ఆంధ్రసచిత్రవార

# పత్రిక

స్త్రీలకు
ప్రత్యేకము

దసరా
సంచిక



-10-62

25 నయాపైసల

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 5—10—62
సంపుటము : 55 సంచిక : 5
శుభకృత్ సం॥ ఆశ్వయుజమాసం శు॥ షష్ఠి

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానంద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా: 135.00.)

విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీథి, మద్రాసు-1




దసరా బొమ్మ

# మనలో మాట

ఈ వారం ఆంధ్ర సచిత్ర వార పత్రిక దసరా సంచిక స్త్రీలకు ప్రత్యేకం. వనితాలోకానికి సంబంధించిన శీర్షికలు ఎక్కువగా వేశాము.

ఈ పండుగ సమయంలో ఆంధ్ర సోదరీమణుల 'కూచిపూడి నాట్యం' అన్న వ్యాసాన్ని ప్రత్యేక వ్యాసంగా ప్రచురిస్తున్నాము.

* * *

(సి)సీతిచంద్రిక ప్రజామోదం పొందినట్టు మాకు వచ్చిన లేఖల వల్ల తెలుస్తున్నది.

అలాగే మారిలిన్ మన్రో ఆత్మకథ, ఇప్పుడు ప్రచురిస్తున్న 'గ్రేస్ కెల్లీ కథ'లు కూడా బాగున్నాయని పాఠకులు వ్రాస్తున్నారు.

* * *

దసరా సంచిక అయినందువల్ల కొన్ని మామూలు శీర్షికలకు చోటు లేకపోయింది. వీలునిబట్టి వట్టిన్ని వేశాము.

* * *

ఈ దసరా సందర్భంలో మా పాఠకులకు శుభాభినందనలు అందజేస్తున్నాము.

## లోకంపోకడ



"వద్దులే బాబూ! మనం టాక్సీలో పోవద్దు! నీ నగలూ నీ అందంగ్రా టాక్సీవాలాను రూల్సు నతిగమించేలా చేయొచ్చును?"

## విషయానుక్రమణిక


ఇష్షూ! తిండి కొరత వున్నదని గట్టిగా అనకు!
'కంట్రోళ్లు' అనేమాటే అనొద్దు! ఇష్షు!
ఆహార సమస్య పరిష్కారానికి ఎస్.కె పాటిల్ గారి చిట్కా
కాశ్మీరను ఎలాఐనా లాక్కొని తీర్తాను
ఐతే సమితి ద్వారా...
లేదా బలప్రయోగం చేస్తా—
అయ్యా! కాశ్మీర్‌గురించి చర్చలు సాగిద్దామా!
భేష్! మా బాగా చేశావు! షాని తొలగించావ్! సంతోషం!
OOMMEN



ఇటీవల న్యూఢిల్లీ కివచ్చిన సింగపూర్ ప్రధాని లీకేన్ యూ.

## శ్రీ కృష్ణ

నేను ఇటీవల ఓ వారం రోజులపాటు దక్షిణ భారతంలో గడిపాను. ఇప్పుడు నేను రాయదల్చుకొన్నది ఆ పర్యటనను గూర్చే. ఇరవయ్యేళ్ళ తర్వాత మద్రాసునూ, సుమారు ఏభై సంవత్సరాల తర్వాత మధురను చూడటం జరిగింది.

ఎప్పుడో చిన్న లాగులు తొడుక్కునే రోజుల్లో మా తల్లిదండ్రులతో కూడా మధురకు వెళ్ళాను. అంత చిన్నతనంలోనూ మీనాక్షి సుందర మహా దేవాలయం నాకు ముచ్చట గొల్పింది. మళ్ళీ ఇంకోసారి చూడాలనిపించింది కూడా. మళ్ళీ ఇటీవల నేను మధురకు వెళ్ళినప్పుడు అంతా కొత్తగా ఏవో కొత్త పనులు జరిగినట్లు కన్పించింది. పెద్ద పెద్ద ద్వార—గోపురాలమీది బొమ్మలకు వేసిన కొత్త రంగులు చూడ ముచ్చగా ఉన్నాయి.

ఈ దేవాలయాన్ని 1700 సంవత్సరంలో కట్టారట. దేవాలయం చుట్టూ పట్టణం ఉంది. అసలు ఆ పాత పట్నాన్ని దేవాలయ సంబంధమైన పట్నమంటేనే బాగుంటుందేమో. అయినా దేవాలయానికి ఉండే శిల్ప సౌందర్యం, దేవాలయ పరిసరాల్లో మచ్చుకైనా కన్పించదు. పాత హావేలి లన్నిటినీ వర్తకులు కొనివేశారు. వాటిని వికృత రూపంలో దుకాణాలుగా తయారుచేసి పారేశారు. ఒక్కమాటలో చెప్పాలంటే ఇప్పుడు దేవాలయం చుట్టూ ఉందల్లా అంగళ్ళు మాత్రమే.

యూరపులో చాలాచోట్ల—ముఖ్యంగా స్విట్జర్లాండ్ లాంటి దేశాల్లో ప్రతి ఇంటి ముందుభాగం పూలతో శిల్పంతో ఉంటుంది. మన మధురలో ఇప్పుడెలాటి మార్పు తీసుకురావటమైనా అవార్యమే ఐనా సాధారణంగా ఉండే దేవాలయ పద్ధతి శిల్పాలు, దేవాలయ సంబంధమైన పద్ధతిలో నిర్మితమైన శిల్పాలు ఇలా నాశనమై పోవటం ఏమిటా అనే బాధ.

దేవాలయం తూర్పు ద్వారం ముందు కుడి వైపు పక్కగా హాజీ సాహెబ్ మూసా అనే అతని బట్టల దుకాణం ఉంది. ఈ ఊళ్ళో అందరి దగ్గరికన్న ఎక్కువగా ఆయనవద్ద సిల్కు బట్టలు విలన ఉన్నాయట. ఈయన కురాన్‌లోని కొన్ని మాటలు తన దుకాణంలో చాలాచోట్ల వ్రాయించి పెట్టాడు. తాను గుజరాత్‌కు చెందిన వాణ్ణని సుమారు నూ వంద సంవత్సరాల క్రితం చాలా గుజరాతీ కుటుంబాలు ఇక్కడ (మధుర) కు వచ్చి స్థిరపడ్డాయని హాజీసాహెబ్ చెప్పాడు. చక్కటి గుజరాతీ భాషను మాట్లాడా డాయన.

ఇదంతా చూస్తే నా మనస్సు పరిపరి విధాల పోయింది. ఒక ప్రఖ్యాత దేవాలయం పరిసరాల్లో గుజరాతుకు చెందిన ఓ మహమ్మదీయుడు వర్తకం కొనసాగిస్తున్నాడంటే హిందువుల మత సహనాన్ని కింతకన్న నిరూపణ యేం కావాలి? ఈ చర్యద్వారా హిందువులు తమ దేశంలో ముస్లింల పట్ల ఎక్కువ తక్కువ భేదాలు లేకపోవటమే గాక, అందరితో పాటు వాళ్లను కూడా వర్తక వ్యాపారాలకూ స్వమతానుసరణకూ స్వేచ్ఛ ఉందని నిరూపించారన్నమాట. ఆ మాటకొస్తే, పాకిస్తాన్‌లో బతుకుతున్న హిందువులకు అవకాశాలు, ఈమాత్రం కూడా లేవుగా.

'ఆలయ నగరం' అనిపిస్తూ, యాత్రిక వసంగా రూపొందిన ఈ మధుర పట్నం పరిశుభ్రతలో మన పాత ఢిల్లీ కన్న తయ! "పరిశుభ్రంగా ఉంచండి" అనే కోర్కె కూడా మధుర్లై తపాలా కార్యాలయంలో ఉంది నిజానికి ఇక్కడి ప్రజలు బీదవాళ్ళే ఐనా, ఉత్తర దేశంలో వాళ్ళకన్నా పరిశుభ్రతగల్గి ఉంటారు.

మదరాసు నుంచి రైల్లోనే ప్రయాణం చేశాను. అప్పుడప్పుడే పచ్చగా చిక్కగా పెరగుతూ ఉన్న పంట పైరులు నన్నెంతగానో ఆకర్షించాయి. ఆవలింతకుముందు కొన్నాళ్ళ క్రిందటిదాకా ఆ ప్రదేశమంతా దున్నరాని బీడ భూముల మయమట! శ్రీ టి. ఎస్. కృష్ణన్ అనే ఆయన ఇంట్లో ఉన్న పశుజాతులు చూస్తే అవి స్కాట్లెండ్, స్విట్జర్లెండ్ దేశాల పశుజాతుల నాణ్యతకేమీ తీసిపోవనిపించింది.

మద్రాసును గూర్చి నా పూర్వపు జ్ఞాపకాలే వేరు. లోగడ 1942 లో నేను చూచినప్పటికీ ఇప్పటికీ ఎంతో మార్పు కన్పడటంలేదు. పైగా అనాటి పాశ్చాత్య భోజనంలోని నాణ్యత ఇప్పుడు చాలా పడిపోయింది. ఒక్క మద్రాసు జింఖానా క్లబ్‌లో తప్ప ఎక్కడా తిండి ముట్టుకో బుద్ధే కాదు. అయితే ధర కూడా తగ్గిందనుకున్నారేమో, నేను ఆ ఊళ్ళో ఉన్న అర్ధ రోజుకు ఏభైమూడు రూపాయలు చెల్లించాను. తిన్నది మాత్రం ఒక పూట భోజనం, ఇన్ని రొట్టెముక్కల్లాంటివి.

రైలు ప్రయాణాల్లో పెట్టే పాశ్చాత్య పద్ధతి భోజనం ఇంతకన్న నాసిగా ఉంటుందని చాలామంది చెప్పటంతో ఆ 'ప్రయత్నం' విరమించుకున్నాను. రకాలలో గాని, కడుపు నింపుకోటానికి గాని భారతీయ పద్ధతి భోజనమే చవకని, ఫర్వాలేదు తినవచ్చనీ అనిపించింది నాకు మాత్రం.

రైళ్ళలో భోజనమే 'నిరుపమానం' అనుకొంటే ఈ సమశీతలపు పెట్టెలలో పారిశుద్ధ్యం మరీ అధ్వాన్నం. స్నాన సౌకర్యపు గది మురికిగా, చీకటి గుహలాగా ఉంది. మనం కొనుక్కున్న టిక్కెట్టు ధరకు తగ్గ సౌకర్యాలు మాత్రం లేవు. పైగా కాంగ్రెస్ ఇప్పుడు తన ఖాదీ వినియోగాన్ని రైళ్ళలో కూడా ప్రవేశ పెట్టిందేమో, అంత శుభ్రంగా కన్పించని ముతక దుప్పటు మెత్తపైన నేను వాళ్ళే యోగం రైల్లో ప్రతివానికీ పట్టున్నది. ఏ అలంకరణ నిపుణుడు ఏర్పాటు చేశాడో ఏమో ఆ కిటికీలకు 'తెరలని'—బక్కచిక్కిన పిల్లాడి మీది చొక్కాల్లాగా అవి ఎప్పుడూ వేలాడుతుంటాయి. స్వతంత్రులమైం తర్వాత ఏర్పడ్డ ఈ సమశీతలపు పెట్టెలో ఇలాంటి సుఖ ప్రయాణం చేస్తున్నందుకు మద్రాసు—మధురల మధ్య అయ్యే ఛార్జీ అదనపు అయిదు రూపాయలు మాత్రమే!

జగజ్జీవనరాంగారి పుణ్యమంటూ తోట పనివారంతా ఇప్పుడు గొప్పవాళ్ళయి పోయారు. వర్గ వర్ణరహిత సమాజం భారతదేశ ఆశయమే ఐనా, తోట పనివాళ్ళందరినీ మూడవ తరగతి సుమాస్తాలుగా పైకి పంపినప్పుడు, ఆ రైల్వే స్నానాల గదులు, ప్లాట్‌ఫారాలు పరిశుభ్రం చేసేందుకు ఎవరో ఒకరు అవసరం గనుక, ఇంకోవర్గం వా

64-వ పేజీ చూడండి



# బంగారు పంజరం

## కోమలాదేవి

### జరిగిన కథ

రామచంద్రపురవాస్తవ్యుడు ప్రసాదరావుగారి కుమార్తె నిర్మలకు అజంతా విహారాలు చూచేందుకు సహాధ్యాయినులతో వెళ్తుండగా రైలులో కాలు జారిపోయి ప్రయాణంసాగక బాధపడుతున్న ఓ లెక్చరర్ దంపతులతో పరిచయం ఏర్పడుతుంది. లెక్చరర్ దంపతుల మనస్సులో నిర్మల స్థానమేర్పరచుకుంటుంది. ఆ లెక్చరర్ భార్య రుక్మిణమ్మగారు నిర్మలకు తన అక్కగారి కుమారుడు ప్రకాశ్‌తోను, నిర్మల చెల్లెలు వసంతకు వేట్లపాలెంలోని బడిపంతులుతోను వివాహం జరిపిస్తుంది. ప్రకాష్ మేనత్తకుమార్తె వసుధ సుధాకర్ అనే వ్యక్తిని వివాహం చేసుకుంటుంది.

### 4

ఉషాదేవి చెదిరిన కుంకుమలా తూర్పున అరుణోదయకాంతులు ప్రసరిస్తున్నాయి. ఆమె అందానికి ముగ్ధుడై, సూర్యుడు త్వరలోనే బహిర్గతమయ్యాడు కానీ, ప్రయత్నంలో విఫలుడయ్యాడు. అతని ఓటమిని చూస్తూ, ఎదురుగా ఉన్న చంద్రుడు ఫక్కున నవ్వాడు. సూర్యునికి కోపంవచ్చింది కాబోలు తన తీక్షణమైన వేడిమిని పుట్టిస్తున్నాడు.

అప్పటికి గాని, నిర్మలకు మెలకువ రాలేదు. ప్రొద్దెక్కి లేచినందుకు సిగ్గుపడింది. గదిలో ఎవ్వరూ లేరు. ముఖం కడుక్కొని, అద్దంలో చూచుకుంది, జేవురించిన ముఖం, కొద్దిగా ఉబ్బిన కళ్ళు చూచుకుంది. ఎవరో తిరిగి, ఆమె హృదయాన్ని అడకత్తెర మధ్య నొక్కుతున్నారు. తల దువ్వుకుని క్రిందికి దిగి వెళ్ళింది.

కాఫీ, ఫలహారాలు పూర్తిచేసి, ఎవరి పనుల్లో వారు మునిగిపోయారు. వంటావిడకు పనులు పురమాయించి, నిర్మల తోటలోకెళ్ళింది. ప్రకాష్ అక్కడే అగుపించాడు. నిర్మల వాలకం చూచి, లాలనగా అడిగాడు, "అలా ఉన్నావేం......ఇంకా అత్తయ్యను గూర్చేనా?"

నిర్మల పేలవంగా నవ్వింది. "ఏంలేదు. సరిగ్గా నిద్రపట్టలేదు. తలనొప్పిగా ఉంది. అత్తమ్మ ఎలా ఉన్నారు? రాత్రి ఫోంచెయ్యలేదు...." మాట మార్చేసింది.

"విజంగానా......పద వెడదాం. నేనూ చూడ

—57 వ పేజీ చూడండి



# నేనూ–మా రాజుగారూ

★ గ్రేస్‌కెల్లీ

## 2

గ్రేస్‌కెల్లీ, రైనీర్‌ల వివాహ మహోత్సవ సందర్భంలో ప్రపంచమంతా హర్షం ప్రకటించింది. గ్రేస్ అమెరికా నుంచి 23 వేల టన్నుల బరువైన "కాన్‌స్టిట్యూషన్" నౌకలో వచ్చినప్పుడు రైనీర్ పెండ్లికుమారునిగా తానై ఎదురు స్వయంగా వెళ్లి బ్రహ్మాండమైన స్వాగతం ఇచ్చాడు. గ్రేస్‌కెల్లీ నౌక తీరాన ప్రవేశిస్తూ ఉండగా విమానాలు, హెలికాప్టర్‌లు రంయ్ రంయ్‌న స్వాగత సూచకంగా నింగిన ఎగిరేయి.

కోట బురుజుల నుంచి గౌరవార్థం ఫిరంగులు పేల్చారు. సైరన్‌లు పూరించారు. ఇంత సంరంభ సంబరాలతో రాజా రైనీర్ గ్రేస్‌కెల్లీని ఆమె నౌక నుంచి తన నౌకలోనికి తీసుకుని రేవులో అడుగు పెట్టాడు..

గ్రేస్ ఈ ఘనమైన స్వాగతానికి ఆనందం పొందుతూ, లోగు భవిష్యత్తును పంచుకొనబోయే రాజుతో సహా ఆ కొత్త ప్రపంచంలో అడుగు పెట్టింది.

ఏప్రిలు మాసం పద్దెనిమిదో తేదీ ఉదయం పదకొండు గంటలకు ముహూర్తం ప్రకారం వైవాహిక తంతు ప్రారంభమైంది. ఆనందం, ఆందోళన పెనవేయగా ఆనాడు రాణిగారి 'కంచుకి'కి మూర్ఛ వచ్చేసింది కూడా.

గ్రేస్‌కెల్లీ పెళ్లినాడు వేసుకున్న గులాబీరంగు సిల్కు దుస్తులు ఆమెకు మరింత వన్నె తెచ్చాయి. రాజా రైనీర్ ఆ సందర్భంలో నల్లని 'మార్నింగ్ జాకట్' వేసుకున్నాడు. చారలున్న లాగు వేసుకున్నాడు. ఇద్దరూ ముభావంగా, గంభీరంగా ఉన్నారు.

ఆవళికోట ప్రాంగణంలో పచ్చిక మైదానంమీద, రంజైన షాంపేను పార్టీ జరిగింది. పుర ప్రముఖులు పాల్గొన్న యీ విందు, వివాహానికి ముందుగా మొనాకోలో జరిగే తొలి తంతు, అయిన వెంటనే జరిగింది. చాలా అందంగా, గొప్పగా జరిగింది. ఆరాత్రి లండన్‌కు చెందిన ప్రఖ్యాత బాలెట్ బృందం ఒకటి, "ఒపెరా హౌస్"లో చక్కని ప్రదర్శనం యిచ్చారు. వధూవరులది చూశారు. ఆ సందర్భంలోనే తొలిసారిగా గ్రేస్‌కెల్లీ, రాజా ఆమెకు ఇచ్చిన కిరీటాన్ని ముత్యాలు కూర్చిన వడ్డాణాన్ని ధరించింది.

ఆ మర్నాడే వివాహం. ఉదయం తొమ్మిది గంటలు కాకపూర్వమే అతిథులు ప్రజలు మొనాకోలోని చలువరాళ్ల కాథెడ్రల్ (క్రైస్తవాలయం) ముందు చేరుకోసాగారు. పదిన్నర గంటలయ్యేసరికి సందడి ఇనుమడించింది. మరి అయిదు నిముషాల్లో ఒకసారి అంత నిశ్శబ్దమైపోయారు. కన్యాదాత తీసుకొనిరాగా గ్రేస్ వస్తున్నది. వాయిద్యాలు మ్రోగాయి. మొనాకో రాజ్యానికి కాబోయే రాణిగాన ఆమె చాలా ఆడంబరమూ, విలువ గల దుస్తులను ధరించింది. రెండు నిమిషాల్లో రాజా రైనీర్ కూడా నిండు యూనిఫారమ్ ధరించి యోధానుయోధునిలాగా వచ్చి ప్రవేశించడంతో కాథెడ్రల్‌లో సందడి మరింత ఎక్కువైంది. సంప్రదాయాలే లేకపోతే రాజును అవతల ఉంచి, గ్రేస్ గుడిలోనికి ప్రవేశించి ఉండేదే కాదు. ఐనా రైనీర్ కూడా గ్రేస్ మందిరంలోనికి వెళ్లగానే ఆమెను కలుసుకోవాలనే ఆతురతతో ఇవతల కారులో నిరీక్షిస్తూ ఉండి, వధువు లోపలికి రాగానే ఆమెను వచ్చి కలుసుకున్నాడు.

ఆ ఇద్దరూ గంభీరంగా ఉన్నారు. ఇద్దరిలోను వైవాహిక బంధన మెంత గట్టిదో, పవిత్రమైనదో తమకు తెలుసునన్నట్లు ప్రశాంతత గాంభీర్యము మూర్తీభవించి ఉన్నాయి. వివాహ తంతునంతా శ్రద్ధగా అనుసరించిన తరువాత ముద్దు టుంగరాలను ఇరువురికూ మార్చుకోమని 'గురువు' ఆదేశించినప్పుడు రైనీర్ గ్రేస్ ఉంగరపు వేలికి తొడిగిన అంగుళీయకము కాస్త ఇరుక్కుంది. గ్రేస్ మృదువుగా చెయ్యి వెనక్కి లాక్కొని ఉంగరం వేలికి సరిగ్గా సర్దుకుని తిరిగి చెయ్యి రైనీర్‌కు అందించింది. ఆ క్షణం నుంచి ఆమె

—వచ్చే పేజీ చూడండి

## వివిధప్రాంతాల వింతప్రదేశాలు-౮

# టాంగనీకాలో కిలిమింజారో! కిలిమింజారోలో కాఫీ తోటలు!!

గత సంవత్సరం పూర్తిగా స్వాతంత్ర్యం పొంది కామన్వెల్తు రాజ్యాల్లోకూడా ఒకటిగా ఉన్న ఆఫ్రికా రాజ్యం 'టాంగనీకా' నిజంగా ఆ పేరుకు తగ్గట్లు చాలా ప్రకృతి రామణీయకత గల దేశం. టాంగనీకా అంటే నదులు సంగమించే చోటుఅని అర్థమట. నిజం కూడా అంతే.

టాంగనీకాను మూడు పెద్ద సరస్సులు పరివేష్టించి ఉన్నాయి. ఉత్తరాన ప్రఖ్యాత విక్టోరియా సరస్సు ఉన్నది. దక్షిణాన టాంగనీకా సరోవరమున్నది. పశ్చిమాన "న్యాసా లేక్" ఉన్నది. కాస్త అభివృద్ధిచేస్తే చాలు ఈ ఆఫ్రికను రాజ్యం బ్రహ్మాండమైన టూరిస్టు సెంటర్ (విలాస యాత్రికులకు)గా కానిస్తుంది. టాంగనీకాలో ఈశాన్యంగా కిలిమింజారో కొండలున్నాయి. ఈ ఉన్నత భూముల్లో కాఫీ పంటకు అనువైన వాతావరణం ఉన్నది. ఇక్కడి వర్షపాతం నుంచి మేలైన అరేబియా కాఫీగింజల పంటకు ఒప్పుతున్నది. అందుకే ఇటీవల కాఫీతోట విస్తృత ముమ్మరంగా చేస్తున్నారు. కమ్మని కాఫీగింజల తోటలను పెంచడానికి స్థానికులకు ఎక్కువ శిక్షణ గఱపుతున్నారు. కిలిమింజారో కొండ ప్రాంతమంతా కాఫీ పంటకు మాత్రమే ప్రశస్తికెక్కడం గాకుండ విదేశీ విలాసయాత్రికులకు ఆనందదాయకమైన ప్రదేశం కూడా.



టాంగనీకా జిరాఫీలు.

ఆఫ్రికాలోని ఇతర ప్రాంతాల వలె టాంగానీకాకు కూడా మంచి రోజులు వచ్చాయి.

ప్రపంచం నాలుగు చెరగుల నించి వస్తారు కిలిమింజారోలో హాయిగా గడపాలని వింతలు చూడాలని జనం! ఈ శిఖరపుటంచులు 19000 అడుగుల ఎత్తున గల ఆకాశాన్ని చుంబిస్తాయి. ప్రపంచంలో ఎత్తైన వాటిలో వీటికి కూడా జాగా ఉన్నది. దీని కొన ఎప్పుడూ మంచులో కప్పుకుపోయి సూర్యకాంతిలో చూడ ముచ్చటగా ఉంటుంది. కొండవాగుల మధుర జలాల వల్ల ఈ కిలిమింజారో భూముల్లో పచ్చని పైరులు, కాయగూరలు, అన్ని కాలాల పండించ గలుగుతున్నారు. కిలిమింజారో దక్షిణ పల్లపుప్రాంతంలో 'మోషీ' అనే చోటు 'కాఫీ'కి పెట్టింది పేరు. ఇదో అద్భుతంగా గడపగల ప్రదేశం. ఇంచక్కా ఇక్కడకు మంచి రోడ్లు వేశారు. దీనికి ఎదంగా విమానాలుకూడా దిగ వీలౌతుంది. ఇక్కడ కాలం ఇట్టే హాయిగా గడిచి పోతుంది. చేపలుపట్టే పిచ్చివాళ్లకు ఇక్కడ వైవిధ్యంచేటన్ని రకాల చేపలు దొరుకుతాయి. కమ్మని కాఫీ, కమ్మని ప్రకృతిగలహోటళ్లున్నాయి.

ఈ మోషీ నుంచి కిలిమింజారో కొండలపైకి వెళ్లడం తేలిక. కానీ మోషీకి మూడువేల నుంచి ఆరువేల అడుగుల ఎత్తున కాఫీ తోటలున్నాయి. కొండను కౌగలిస్తూ వడ్డాణంలా ఉన్న ఈ తోటలను దాటి కిలిమింజారో కొండలపైకి వెళ్లాలంటే మంచి 'సత్తువ' ఉండాలి. ఇక 'ఆహా' అనిపిస్తుంది. పైగా ఈ కొండలపైకి ఎక్కాలనే ఉబలాటం రానురాను విలాస యాత్రికుల్లో పెరుగుతున్నది. మోషీలో మంచి వేటగాళ్ళకు అవసరమైన మృగ సముదాయముంది. "కిలిమింజారో"లో సహజ వన్యమృగ రక్షణ స్థావరాలున్నవి. ఇందులో ఏనుగులు, జిరాఫీలు మొదలు చిన్నచిన్న అడవి జంతుజాలమంతా ఉన్నది.

కిలిమింజారోలో మోషీ తర్వాత చెప్పదగ్గవి మరో రెండు నగరాలు, "అరూషా" "టాంగా" అనేవి ఉన్నాయి. "అరూషా" వాగుల్లోనూ, రెండు నదుల్లోనూ కూడా "శిల్ల" (చేపలు)లు కొల్లలు. దాని చుట్టూ గల ప్రకృతి అందం వర్ణనాతీతం. ఈనగరంలో గోల్ఫ్ ఆడుకునేందుకు, టెన్నిస్ ఆడుకునేందుకు మంచి "క్లబ్బు" లున్నాయి. దీనికి దరినే విమానాలు దిగడానికి అనువైన మైదానమున్నది. మంచి బస్సు సర్వీసు కూడా ఉంది. బస్సులో హాయిగా ఎన్నో నగరాలుచూస్తూ నైరోబీ దాకా ఇక్కణ్ణుంచి పోవచ్చును.

టెంపిల్ హూలింగ్ ★



[illegible]

**రాజధాని కబుర్లు**

# మూసీనది ఉధృతం: రాజధాని ప్రజల కడగండ్లు

సెప్టెంబరు నెలలోనే ఎక్కువ ప్రమాదాలు జరుగుతాయని రాజధానీనగరంలో ఓ నమ్మకం ఉంది. జరిగిన ప్రమాదాల బట్టి, ఈ నమ్మకం ఏర్పడిందో, లేకపోతే ప్రజల విశ్వాసాలకు అనుకూలంగా ప్రమాదాలు జరుగుతున్నాయో తెలీదు. కాని ఈ రెంటికీ ఏదో సంబంధం మాత్రం ఉన్నట్టు కనిపిస్తుంది. ఎప్పుడో 1908 సంవత్సరంలో మూసీ నది మహా ఘోరంగా పొంగి ఎంతో నష్టాన్ని కలిగించిందిట. దాని తర్వాత కూడా ఆ నది పొంగటం, తిరిగి నష్టం కలగటం కూడా జరిగింది. ఇవన్నీ సెప్టెంబరు నెలలోనే! రైలు ప్రమాదాలు జరిగింది కూడా సెప్టెంబరులోనే! మళ్ళీ సెప్టెంబరులోనే ఘోరమైన కుంభ వృష్టిని రాజధాని ప్రజలు చవిచూశారు. ఎడ తెరిపి లేకుండా కుంభపోత పోసి మరీ వదిలి పెట్టింది. రాజధాని నగరం జలప్రవాహంలో ఊగిసలాడింది. హుస్సేన్ సాగర్ 'సాగర్' అని పించుకుంది. నిజానికి హైదరాబాదు నగరం నీటి ముంపుకు చాలా దూరంగానే ఉంది! అంటే ఇది సముద్రతీరం కాదు, జీవనదు లేవీ కూడా ఈ విశాల నగర పరిసర ప్రాంతాల్లో లేవు. అయితే ఏం! వర్షపాతానికి హద్దు లేమిటి!

మూసీ ఉండనే ఉంది! చిన్న చిన్న వాగు లన్నింటిని కబళించి పెద్ద పెద్ద చెరువు లన్నింటిని కడుపులో ఇముడ్చుకుని వికటాట్టహాసం చేస్తు కుంటూ రాజధాని ప్రజల మీదికి దాడి బయలు దేరింది. నగర మధ్యంలో దారులు ఏర్పరుచు కుంటూ, విచ్చలవిడి విహారం చేస్తూ, నానా బీభత్సంచేసి వదిలిపెట్టింది. అడ్డంకు లన్నింటిని ఛేదించుకుంటూ, ఇళ్ళల్లోకి చొచ్చుకునిపోయి, ఉన్నవార్ని తరిమి వెళ్లగొట్టింది. తమ కళ్ళ ఎదుట నురుగులు కక్కుతూ ప్రవాహం వచ్చి, తమ ఇళ్లను నిర్దాక్షిణ్యంగా ఆక్రమించుకుంటుంటే, లడక్‌లో సిపాయిల్లాగ, అశక్తులై, నిస్సహాయులై బిక్క మొహం వేసుకొని చూస్తూ ఉండిపోవలసి వచ్చింది. పసిపిల్లలు, ముసలివాళ్ళు, కదలటానికి కూడా ఓపికలేని స్త్రీలు, బరువుగా అడుగులు వేసుకుంటూ, ఎక్కడికి వెళ్ళాలో తెలియక, ఉన్న చోటు నుంచి తప్పనిసరయి తరలి వెళ్లుతున్న దృశ్యం హృదయవిదారకంగానే ఉంది.! ఈ వాన లకు పల్లపు ప్రాంతాలవారి పని మరీ దుర్భర మయిపోయింది. పై మూల పైన వర్షం! క్రింద నీటితో ప్రయాణం! ఎన్నో వేలమంది ఇళ్ళు నిరాశ్రయు లయ్యారు. ప్రకృతి విజృంభణ ముందర మానవశక్తి ఎంతా అనిపిస్తుంది. నిజమే కాని, మానవులు చెయ్యాలసినవి కూడా కొన్ని ఉన్నాయి. వాటిని విస్మరిస్తే ఎట్లాగు?

ఎక్కడ కాస్త చోటు కనిపిస్తే అక్కడ మట్టిఅడుసులు నాలుగువైపులా పెట్టుకొని, పైన నాలుగైదు వాసాలు నిలబెట్టి, వాటిమీద తాటాకులు పరిచేసి ఇళ్ళు గృహనిర్మాణం చేసేసుకుంటూ వస్తారు బీద ప్రజలు. నిజమే వాళ్ళకూ ఆశ్రయం కావలసిందేగా! ఆ స్థలం ఎవరిదీ అని ఆలోచించే అవసరం వాళ్ళకు లేదు. అవసరం అన్నింటికంటె బలీయమైనది. మెట్ట ప్రాంతాలు కాని, పల్లపు ప్రాంతాలు కాని, తల దాచుకోవటానికి చోటు దొర కటం ప్రధానం. ప్రమాదాలు వచ్చినప్పుడు చూసుకో వచ్చుని ధీమా! మునిసిపాలిటీవారు పరోక్షంగానో, ప్రత్యక్షంగానో, అలాంటి కట్టడాలకు ఆమోద ముద్ర వేసి ఊరుకుంటారు. స్థలం యజమాని ఎన్ని దరఖాస్తులు పెట్టుకున్నా ప్రయోజనం లేదు. కేవలం ఆక్రమిత ప్రాంతం. యిజ మాముల చెయ్యాల్సిందల్లా అధికక్షేవణపత్రాలు

—53వ పేజీ చూడండి

# హరివంశము

## సాందీపని పర్వం-75

సుదక్షిణ కొంత తడవు మాటలాడలేదు. ఆమె ఏమో ఆలోచించుచున్నది. పౌండ్రకుడు పరిదీన ముఖారవిందుడై విచిత్ర మందహాసము చేసినాడు. సుదక్షిణతో ఇట్లనినాడు.

"సుదక్షిణ! నీ విప్పుడు ఆచార్య సాందీపని ఏమీ యగునని, ఆయన ఎచ్చటికి పోవునని ఆలోచించుచున్నావు. నేను ఒక్కటి చెప్పుదునా! ఆచార్య సాందీపని కాశికను అంత త్వరగా వదలిపెట్టి పోలేరు .... పోరు. నేనును ధర్మ పరిషత్తునందు కోపముతో నేదో అనియుందును. దానిని ఆయన పట్టించుకొనునా! అదియునుగాక, ఆయన ధర్మశాస్త్రములు తెలిసినవాడు. పరిషత్తు ఇష్టమును తెలిసికొనక నేను ధర్మ నిర్ణాయము చేసినాను. అది చెల్లదని ఆయన అనును. మరల విచారణము జరగవలయు ననును."

సుదక్షిణ విచారముగా నవ్వినది. "అయ్యో! స్వామి! అంతటి అదృష్టము గూడన!" అన్నది. అని కంచుకి దిక్కై చూచినది.

"కంచుకి! మహారాజా ఆలోచనము సరియందువా! నీవు ఆచార్య సాందీపని ఆశ్రమమునకు గూడ పోయి వచ్చితివి!" అన్నది.

కంచుకి ముందు మాటాడలేదు. తర్వాత ఇట్లు చెప్పినాడు: తల్లీ! ఆచార్య సాందీపని నిశ్చయముగా కాశికనే కాదు. మన రాజ్యమునే వదలిపోవుచున్నారు.

"ఎట్లా!" అనినాడు పౌండ్రకుడు.

"మరి మహారాజులు ఆజ్ఞ అనిన ఏమనుకొన్నారు" అన్నది సుదక్షిణ. అని ఉస్సురన్నది. "స్వామి! నేను చెప్పవే చెప్పితిని. తాము ధర్మము చేయవలయును అని. మరి ఆ ధర్మము ఆచార్య సాందీపని కన్న తెలిసినవా రెవ్వరు! అంతయు నైపోయినది. ఇప్పుడు విచారించి లాభమేమి! కాశికలో చీకటి ప్రవేశించినది."

అని సుదక్షిణ మరియు విచారించినది.

"కంచుకీ! ఏమి అయినది!"

"తల్లీ! నేను ధర్మాసన స్థానమునుండి ఆచార్య సాందీపనితో గూడా వారి ఆశ్రమమునకు పోయితిని. అప్పటికే అచ్చట ఆచార్యాణి బ్రాహ్మణ వాడలోని సోమిదమ్మలు సహాయపడగా, ఆశ్రమము నంతయు సర్దుట మొదలిడినది. నేను అనుకొంటిని. ఆచార్యులకు ముందుగనే మహారాజుల నిర్ణయ మిట్లుండునని తెలియునా' అని!"

"మొదటినుండియు మహారాజుల వైఖరి యేమో తెలియుచునే యున్నది. ఆయనకు ఆచార్య సాందీపనిపై కోప మున్నదని నేను అనను. ఆ కోపము వేరు. అది వేరుచోట."

పౌండ్రకు డామెను చురుక్కున చూచి అప్పటి నుండి కదలి పోబోగా సుదక్షిణ అతనిని ఆపినది. "స్వామి! తమ చెయ్దమువలన ఎంత జరిగినదో నంతయు వినుడు" అన్నది.

కంచుకిని సంబోధించి "తరువాత" అన్నది.

కంచుకి మరల ఇట్లు చెప్పినాడు. "తల్లీ! ఆచార్యాణిని చూచి ఆచార్య సాందీపని మందహాసము చేసినారు. చేసి శ్రీకృష్ణదేవుని దిక్కై "నాయనా! ఇది పిచ్చికాదుటోయీ! ఆశ్రమమునకు ఆశ్రమమునే ఇచ్చటనుండి కదిలించవలయునని చూచుచున్నది" అనినారు. అంతలో ఆయనను దుఃఖము విచిత్రమై క్రమ్ముకొన్నది. పిచ్చి ఎత్తిన వానివలె ఆయన ఆ ఆశ్రమము ఉటజము, ఉటజము తిరిగినారు. వృక్షము వృక్షమును తిలకించినారు. శిష్యులును, నగర బ్రాహ్మణులును ఆయన ఎటుతిరిగిన అటు తిరిగినారు. ఒక్కచో నొక మృగము, కాలు కుంటిపోయినది, కాన్పించినది. ఆచార్యులు దానిని చూచి ఆగి, దగ్గరకు తీసికొన్నారు. "చిట్టీ! నేను నీవలెనే అవిటివాడనై పోయినాను. కాశికలను వదిలిపోవలసి వచ్చినజడుడు ఏమికాడు!" అనినారు. తల్లీ! ...."

సుదక్షిణ దక్షిణ హస్తముతో నాతనిని వారించినది. భర్తను సంబోధించి "స్వామి! ఆ మృగము తమ ప్రేమకు పాత్రమైనది" అన్నది. ఆమె కంఠము దుఃఖముచేత రుద్ధమై పోయినది.

కంచుకి మరల నిట్లుచెప్పినాడు! తల్లీ! ఆచార్య సాందీపని దుఃఖమును నేను చూడలేక పోయినాను. కాశికఅనిన ఎవ్వరికి మమకారముండదు? ఇది ముక్తి మంటపముకదా! అవి ముక్తముకదా! కాశికా నగరపు కడసీమలో నున్న చండాలునితోనైన పోవుటకు అఖండులుడైనను చాలడుకదా! ఆనంద కాననంలో అనశనస్థితి నున్నను భువన సామ్రాజ్యైక వైభవముకన్నను అది ఎక్కుడనికదా పెద్దలు చెప్పుదురు! వారణాసిలో దోమగూడా ఇంద్రుని ఐరావతముకన్నను మిన్నయని వేరుగా చెప్పవలయునా! ఎన్ని కల్పములు గడచినను ఎందరు ఎందరు ఇంద్రులుడిందినను, ఎన్ని మన్వంతరములు చనినను, కాశికకు పసిమి తప్పుటయన్నది లేదని కదా వేదములు చెప్పుచున్నవి. ఎచ్చట దేవోత్తముడైన పినాకపాణి విశ్వనాథుడై వేంచేసి యున్నాడో, ఎచ్చట భాగీరథి సర్వకలుషాలను క్షాళము చేయుచున్నదో, ఎచ్చట అన్నపూర్ణ, విశాలాక్షి, ఆకొన్న వారికి అన్నముపెట్టి రక్షించునో, ఆ కాశికను తలచుకొని తలచుకొని ఆచార్య సాందీపని కుమిలి పోయినారన్నచో ఆశ్చర్య మేమి తల్లీ! సర్వ కల్యాణములకు ఆదికారణమైన కాశిని, యణిమాది అష్టసిద్ధులకు ఆటపట్టైన కాశిని, సకల జనలోక సంకల్ప కల్పవృక్షమైన కాశిని, అఖిల కలుష పిశితమును మెసవు రాకాసి కాశిని, ఎట్లావదలి పోగలనని ఆయన చిన్నపిల్ల వానివలె విచారించినారు తల్లీ! ఆకాశికలో యోగమనగా అట్టిదో! అంతటి విప్రుడు, అంతటి పండితుడు, అంతటి ఉపాధ్యాయుడే అట్టులయుచో, ఆ విప్రయోగవు దుఃఖము ఎంతటిదో!....!!

"అవును! కంచుకీ! అవును. పూర్వము ఒక కారణమున సాక్షాత్ బ్రహ్మమయిన అగస్త్యులును, తరువాత బాదరాయణ భట్టారకులును తమకు కాశికా విప్రయోగము సంభవించగా, పడిన దుఃఖము విన్నదియే కదా! అగస్త్యులేమో లోక సంగ్రహార్థము కాశికను వీడిరి. బాదరాయణులేమో, కోపవశమున కాశికకు అపచారము చేసి తండ్రి పరమశివునిచేత శప్తులై వెడలిరి. తల్లి ఆయనను కరుణించినది. మరి ఇప్పుడు ఆచార్య సాందీపనియో .... "

ఆమె దుఃఖము మరియు నధికమైనది. "నేము ఏమి చేయగలము. ఆచార్య సాందీపనియే రాజాజ్ఞను పాలించుచుండగా నేము వారికి ఏమని చెప్పగలము. స్వామి! తాము ఏమి చేసినారు! ఎంత పని చేసినారు! కాశిక ఇక మిమ్ములను, నన్నును క్షమించదు. మిమ్ములను ధర్మము నాచరించనందులకు, నన్ను తమరిచేత ఆ ధర్మమును చేయించలేక పోయినందులకు—"

పౌండ్రకుడు మౌనిమై యుండిపోయెను.

కంచుకి మరల ఇట్లు చెప్పెను: తల్లీ! తాము అన్నవిధముగానే ఆచార్యులు దుఃఖించిరి. తనకు ఈ కాశికా వియోగ మేల కలిగినదని వాపోయిరి. 'ఓయి! దైవమా! నిష్కారణముగా నన్ను కాశికి ఎడబాపుచున్నావే! ప్రాలేయ గిరికూట సమవతీర్ణ జలౌఘము, జహ్నుకన్యను ఎట్లావదలిపోగలను! మందార మధుర రసాస్వాద ఘూర్ణిత నేత్రుని వటుకనాథుని ఎట్లు వదలిపోగలను!

విఘ్నాంధకారార్కుని, డుంఠివిఘ్న నాయకుని, మండూక జఠరుని ఎట్లు మరువకల్గుదును! కాశీ క్షేత్రము పంచక్రోశము కైవల్య లక్ష్మీ గృహమని శ్రుతులు ఆక్రోశించుచుండగా నేను నిర్భాగ్యుడను దేశాంతరగమన శిక్షకు రాజువలన పాల్పడినాను. తల్లీ! కాశీ! నేను ఏమి చేసినాను!

తల్లీ! గంగా! నేను ఏమి చేసినాను.

తండ్రీ! విశ్వనాథ! నన్ను ఏమి చేసినావు. కాశిలో నున్న జమునికి ఏమి కావాలి? నేను ఎంత పాపము చేసి ఉండక పోయిన నాకీ శిక్ష విధించినావు! తండ్రీ!".... అంటూ ఆయన పలవించినారు .... మహారాజా! నేడు కాశీ నగరమున బ్రాహ్మణుల వాడలలో అగ్ని ఆరాధింపబడలేదు. క్షత్రియుల వాడలు నిర్జీవములై ఉన్నవి. వైశ్యులు బేరసారము లుడిగి అడగిపోయినారు. ఉత్తమ శూద్రులు రాజాజ్ఞను విని ధిక్కరిస్తున్నారు రాజా! నీ రాజ్యములో నేడు ద్వాపరము గడవక మునుపే కలి ప్రవేశించినది. కాశిక తిరిగి దివోదాసుని వశమైనది. భూదేవతలతోడి, సర్వ దేవతలును కాశికనుండి బహిష్కరింపబడినారు...."

"కంచుకీ! కంచుకీ! నన్ను నీవు రంపమున కోయుచున్నావు."

"కాదు! తల్లీ! ఉన్న విషయమును, విన్న

53-వ పేజీ చూడండి

# దసరా పండుగ సరదాలు

మందరపు. లలిత

దసరా పండుగ వస్తుందంటే ఇంటిల్లిపాదికీ ఎంత సరదా! పెద్దలు పూజా పునస్కారాల హడావుడిలో మునిగిఉంటే పిన్నలు ఇంటింటికీవెళ్ళి, పప్పుబెల్లాలు దండుకునే సందడిలో ఉంటారు. ఆడపిల్లలులేనిది అలికిడే ఉండదు. పండుగ పదిరోజులూ, చిట్టి పొట్టి బాలికలంతా బొమ్మల కొలువు తీర్చుకుని పేరంటం చేసుకుంటారు.

మహిషాసురునితో తొమ్మిది రోజులు హోరాహోరి పోరాడి, పదోరోజున కాళీమాత ఆ లోక కంటకుని హతమార్చింది. కాళికాదేవికి మహిషాసురమర్దని అనే పేరు రావటానికిదే కారణం. మహిషాసురమర్దని విజయం సాధించిన శుభదినం విజయదశమి. దానికే దసరా అని మరోపేరు. మహిషాసురవర్ధంతిగా కాదు కాని, మహిషాసురుని పీడ విరగడైన ఆరోజును ప్రజలు ఏటేటా స్మరించుకుని కృతజ్ఞతా భావంతో మహిషాసురమర్దని విజయోత్సవాన్ని జరుపుకుంటారు. ఆశ్వయుజ శుద్ధపాడ్యమి మొదలు దశమి వరకు దేవిని మనసారా పూజిస్తారు. దేవీ నవరాత్రులు ఎంతో వైభవంగా జరుగుతాయి.

విజయదశమిరోజునే ఆయుధపూజ కూడా జరుగుతుంది. అజ్ఞాతవాసానికి బయల్దేరేముందు పాండవులు తమ ఆయుధాలను శమీవృక్షంపై దాచిఉంచి అజ్ఞాతవాసం పూర్తయ్యాక తిరిగివచ్చి తమ ఆయుధాలను తీసుకున్నరోజు ఇదే. విజయుడు దాచిఉంచిన ఆయుధాలను తిరిగి పరిగ్రహించిన దశమి రోజున హైందవులు ఆయుధపూజ జరుపుతారు. తమ తమ వృత్తుల్లో వాడే పనిముట్లను ఆనాడు శుభ్రపరచి పసుపు, కుంకుమ, గంధాక్షతలతో, పువ్వులతో పూజిస్తారు. ఆరోజు రోడ్లవెంబడివెళ్ళే బస్సులు, లారీలు, రిక్షాలు, బళ్ళు, పసుపు, కుంకుమలను దిద్దుకుని గంధం అలదుకుని పూలమాలలనలంకరించుకుని కళకళలాడుతూ కనిపిస్తాయి. యంత్రాలతోసహా రకరకాల పనిముట్లు పూజా పునస్కారాలు అందుకుంటాయి.

ఇతిహాసం మాట ఎలాఉన్నా, దీనిలో ఒక గూఢార్థం గోచరిస్తున్నది. ఏడాది కొకసారైనా, ఆయుధాల గురించి శ్రద్ధ తీసుకోకపోతే అవి ఎందుకూ పనికిరావు.

మా ఇంట్లో ఒక వాటాను పోస్టుమాస్టరుకు అద్దెకిచ్చారు. దశమిరోజున పోస్టుమాస్టరు ఆయుధపూజంటూ హడావుడిపడుతుంటే నాన్నగారు ఒకటే ఆశ్చర్యపోయారు. ఆయన నవ్వుతూ, 'ఆయుధపూజేమిటి లెద్దురూ? ఏదో అలా అనకపోతే ఈ జవాన్లు పని చెయ్యరు. ఆ త్రాసును ఎవరూ తిన్నగా చూడక, తుడవక తగలబడిపోతున్నది!' అన్నారు. అదీ నిజమే వాడుకోవటమేగాని, దాని గురించి శ్రద్ధ తీసుకోకపోతే ఏ పరికరమైనా ఎంతకాలమని పని చేస్తుంది?

ఏళ్ళతరబడి దానిని శుభ్రం చెయ్యకుండా ఉంచితే అది తుప్పుపట్టడం, పని చెయ్యకపోవటం, చివరకు మూలపడటం జరుగుతుంది. ఖచ్చితమైన ఇటువంటి నియమమంటూ లేకపోతే కనీసం ఏడాది కొకసారైనా ఆయుధాలమీది దుమ్ము దులిపి, వాటి అతీ గతీ కనుక్కునేవారు ఎక్కువమంది ఉండరు. ఏడాది వరకు వాటి సంగతి పట్టించుకోకుండా ఉంటారని కాదు. కాని, కొంతమంది బద్ధకస్తులు ఉంటారుగా, వారు అదరాబాదరా పని గడుపుకోవటం తప్పించి, ఆ పనిముట్లను జాగ్రత్తగా చూసుకోరు. అలాంటివారు ఆయుధ పూజ పేరుతో ప్రత్యేక శ్రద్ధ వహించటానికి ఈ పండుగ ఉపయోగపడుతుంది.

ప్రైమరీ స్కూలు పిల్లలకు, ఉపాధ్యాయులకు దసరా సరదాయైన పండుగ. దసరా వస్తున్నదనగానే ఉపాధ్యాయులు దసరా పద్యాలు సేకరించి, పిల్లల చేత వాటిని కంఠోపాఠం చేయించే హడావుడిలో ఉంటారు. తర్వాత ఆ పదిరోజులూ పిల్లల ఇళ్ళకు వెళ్ళి, జేబులు గలగలలాడించుకుని వెళ్తారు.

విల్లంబులు, పైకి క్రిందికీ ఎక్కి దిగే కోతి బొమ్మలుపట్టుకుని చిన్నారిబాలబాలికలు ఎంత మురిసిపోతూ ఉంటారు! 'జయ జయీ భవ దిగ్విజయీ భవ' అంటూ, దసరా పద్యాలను ఏకరువుపెడుతుంటే ఎంత ముచ్చటగా ఉంటారు! విల్లంబులు, కోతులు కొనుక్కునేంతవరకు అమ్మని ఎంత గోలపెడతారు! వాటిని చేత పట్టుకుంటేచాలు వాళ్ళకు ఎక్కడలేని సరదా, ఎక్కడలేని ఉత్సాహం! ఇంటింటికీవెళ్ళి పప్పుబెల్లాలు దండుకోవటం వాళ్ళకు మరింత సరదా. దసరా రాకకు వేయికన్నులతో ఎదురు చూస్తారంటే అది సంశయించాల్సిన విషయంకాదు.

పిల్లలకు నోరు తిరిగేలా సులభంగా ఉంటాయి దసరా పద్యాలు. వాటిని పిల్లలు ఉత్సాహంతో నేర్చుకుంటారు. పూర్తిగా రాకపోయినా, వచ్చిన కాస్త నలుగురితోపాటూ గట్టిగా అరచి సంతృప్తిపడతారు.

దసరా పద్యాలు చక్కని సులభశైలిలో ఉంటాయి. వాటిని పాడుకునే రాగం కూడా పిల్లలకు సులువుగా పట్టుబడేదే.

"ఏదయా మీ దయా
మామీద లేదయా

..............................

..............................

పావలా బేడైతే పట్టేదిలేదు
అర్ధరూపాయైతే అంటేదిలేదు
ముప్పావలాయైతే ముట్టేదిలేదు
ఇచ్చు రూపాయైతే హెచ్చుగా పుచ్చుకుంటాం.

..............................

జయ జయీ భవ
దిగ్విజయీ భవ!

వచ్చిన సంగతేమిటో ఇవి విశదీకరిస్తాయి. 'అయ్యవారికి చాలు అయిదు వరహాలు, పిల్లలకు చాలు పప్పుబెల్లాలు' అని చేయవలసిన లాంఛనాలను వివరిస్తాయి. అయ్యవారికి, పిల్లలకు లాభదాయకమైన సరదా పండుగ దసరా. ఈపండుగ రోజుల్లో ముఖ్యంగా పిల్లలు ఒకరిమీద మరొకరు బుక్కాగుండ జల్లుకుని ఉల్లాసంగా తిరుగుతారు. విల్లంబులో బుక్కాగుండ పోసి, విల్లెక్కుపెడితే ఎదుటివారి బట్టలు ఖరాబు! అది చూస్తే పిల్లలకు మరింత హుషారు.

సరే అమ్ముకునేవారి హడావుడి చెప్పనవసరం లేదు. ముందునుంచి విల్లంబులు, కోతులు, బొమ్మల కొలువులకు బొమ్మలు తయారు చేయటంలో. వారికి తీరికే ఉండదు. పండుగ పేరుతో నాలుగు డబ్బులు చేసుకుంటారు.

ఈ పదిరోజులు ఆడపిల్లలు బొమ్మల కొలువు పెట్టుకుంటారు. గాజుబొమ్మలు, మట్టిబొమ్మలు, చెక్కబొమ్మలు, రంగు రంగుల రమ్యమైన బొమ్మలను సేకరించి కొలువు తీరుస్తారు. రోజూ కొలువుకు హారతిచ్చి, పిండివంటలతో నైవేద్యం పెడతారు. ఇంటింటికీ వెళ్ళి, బొట్టుపెట్టి పేరంటానికి పిలుస్తారు. ఇంటికి వచ్చినవాళ్ళకు మర్యాద చేసి, వాయినాలిచ్చి పంపించటం, మరొకరింటికి వెళ్ళి వాయినాలు తెచ్చుకోవటంలో ఆడపిల్లలకు—ఆమాటకొస్తే ఆడవాళ్ళకందరికీ సరదా. పండుగరోజున కొత్త బట్టలు తొడుక్కునే సరదా అందరికీ ఉంటే ఈ ముచ్చట ఆడపిల్లలకు మాత్రమే ప్రత్యేకం. కొత్త బట్టలు కట్టుకోవటం, పిండివంటలు చేసుకుని తినటం ప్రతి పండుగకుఉన్న సరదాలే. దసరాకు ఈ సరదాలతోపాటు మరెన్ని సరదాలున్నాయో చూశారుకదా?

కొత్తగా పెళ్ళయిన అల్లుడిని అత్తవారు దసరాకు కూడా పిలుచుకొచ్చే అలవాటుఉంది. కొత్త అల్లుడు దసరానాడు అత్తవారింట్లో సకల మర్యాదలు అందుకుని అటు వారి ముచ్చట, ఇటు తన ముచ్చట(లు) తీర్చుకుంటాడు.

కలకత్తాలో దుర్గాపూజ, మైసూర్ దసరా ఉత్సవాలు అతి వైభవంగా, నేత్రోత్సవంగా జరుగుతాయి.

సరదాల రథం దసరా త్వరితగతిని సాగి రావాలని ఎదురుచూడని దెవరు? 

# సంప్రదాయసిద్ధమైన 'కూచిపూడి నాట్యము'

## ఆంధ్ర సోదరీమణులు

మనిషి కోరేది మనుగడ, మనశ్శాంతి. విడతెరిపి లేకుండా ఏదో రకమైన జంజాటంలో పడిఉండే వ్యక్తికి ఏదో విధమైన విశ్రాంతి, మనస్సుకు ఆనందం ఉంటేనే కాని తిరిగి తన కార్యక్రమాలు సాగించలేడు. అలాంటి వినోదాన్ని కలిగించేవే లలితకళలు. అన్నిటికన్న మిన్నగా మానవ మేధస్సును లోబరుచుకొని, ఆకట్టుకొని ఆనందాన్ని అందించేది, రాగ భావ తాళాత్మకమూ అయినదీ నాట్యం. లయానుగతమైన ఈ 'ఆట' 'పాట'లలో మానవుడు మేను మరచి మరో లోకంలో ఏదో దివ్యమైన అనుభూతిని పొందుతాడు. అందుకేనేమో ఈ నాట్యాన్ని దేవతలకు కూడా కాంతమూ చాక్షుషమూ అయిన దివ్య క్రతువుగా శాస్త్రకారులు వర్ణించారు.

దేశాన్నిబట్టి కాలాన్నిబట్టి నృత్య విధానాల కొత్త త్రోవ లేర్పడుతూంటాయి. భారతదేశంలో మణిపురీ, కథక్, కథాకళి, దక్షిణ భారత్‌లో భరతనాట్యం—వివిధ నృత్య విధానాలు ఏర్పడటానికి ఇదే కారణమై ఉంటుంది. అలాంటి వాటిలో ఒకటై తెలుగునాటి మేటితనాన్ని నిల్పుకున్నదీ కూచిపూడి నృత్యం. ఇతర నృత్య విధానా లన్నిటివలె శాస్త్రీయమైన రీతులు కలిగినదీ కూచిపూడి నృత్యం.

తెలుగునాటి నడిగడ్డలో పుట్టి, తెనుగుదనాన్ని మూర్తీభవించుకున్న ఈ కూచిపూడి నృత్యంలో ఉపయోగించే హస్త భేదములు ఏ ఇతర నృత్య విధానంలోను ఉపయోగించక పోవటమే ఈ నృత్య విధానంలో ఒక ప్రత్యేకతగా చెప్పవచ్చు. రెండు చేతులతోనూ ప్రదర్శించే ముద్రలకు సంయుక్త హస్తము అంటారు. పుష్ప పుటము, అంజలి, చతురస్ర, త్రిపతాక, స్వస్తిక, ఆవహిత్థ వర్ధమానాది పేర్లతో ఈ సంయుక్త హస్త ముద్రలు 44 ఉన్నాయి. ఇవికాక మనుష్య హస్తములు, దేవతా హస్తములు, మృగ హస్తములూ కూడా ఎన్నో ఉన్నాయి. వీటిలో దేవతా హస్తాలను దశావతారములు చూపేందుకు ఉపయోగిస్తారు. ఈ దశావతారాలు ప్రజలకు నిజంగా నయనోత్సవం కల్గించి ఎంతో ఆనందాన్నిచ్చి బహుళ ప్రజాదరణను పొందుతాయి. ఒకసారి ప్రదర్శించిన ముద్ర మరియొకసారి చూపకుండా అభినయ ప్రసారమునేది ప్రత్యేక కళ. మా గురుదేవులు శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారు పైన చెప్పిన విధంగానే ప్రదర్శించేవారు.

కూచిపూడి నాట్య ప్రదర్శనంలో ముఖ్యము లైనవి, శబ్దములు, అలరింపు, జతి స్వరము తిల్లాన, పదములు, వర్ణములు, జావళీలు ముఖ్యము లైనవి.

కూచిపూడి నాట్యములో అనేకములైన శబ్దాలున్నవి.

> "దశరథ వర కుమారుడ వైతివి,
> దైవకానుయాగము గాచితివి,
> రసికుడ సీతను పెండ్లాడితివి,
> రవి కులమున బలవంతుడ వైతివి.



ఆంధ్రసోదరీమణులు విజయ, మారుతి

అని రామ పట్టాభిషేకం ప్రారంభిస్తే రాముని లీలలన్నీ హృదయంగమముగా ప్రదర్శించవచ్చు. ప్రహ్లాద శబ్దం కూడా రామ పట్టాభిషేకంతో తూగ గల్గినదే; ఈ శబ్దము లన్నిటిలోను అతి కష్టమైనది, ప్రదర్శనలో నేర్పు చూపేది మండూక శబ్దం. ఈ శబ్దములలో ఎక్కువ ప్రాధాన్యము అభినయానికే ఉంది. అభినయమంటే పూర్తిగా కాళ్లూ, చేతులూ కదపటమని కాదు. మన ప్రదర్శనలోని భావాలను ప్రేక్షకులకు పూర్తిగా అర్థమయ్యేటట్లు చేయుటమే అభినయ విశేషము.

ఈ సంప్రదాయంలో రెండో ముఖ్యాంశం 'అలరింపు'. ఇది స్వతహాగా కూచిపూడి నాట్యంలో లేదు. బ్రహ్మశ్రీ వేదాంతం లక్ష్మీనారాయణగారు ఈ అలరింపును కూచిపూడి సంప్రదాయంగా చేర్చివేశారు. అలరింపులో కేవలం అంగవిన్యాసమే ప్రదర్శనాంశం. అంతేగాక నాట్యానికి ఓ విధమైన ఉపోద్ఘాతమన్నా తప్పులేదు.

జతి మార్పుల ననుసరించి పాద భేదము ప్రదర్శించటము జతి స్వరం. ఈ నాట్యంలో స్వర జతిని ఆరు అడుగులు, ఆరు జతులతో చూడ ముచ్చటగా ప్రదర్శించవచ్చు. ఈవిధంగానే వర్ణమూ పదమూ కూడా కూచిపూడి నాట్యంలో ప్రముఖ స్థానం వహిస్తాయి.

గీతమును పలుకుతూ దాని అర్థాన్ని పతాకాది హస్తములచేత, భావాన్ని దృష్టి భేదములతో, తాళమును పాద విన్యాసం ద్వారాను ప్రదర్శించాలి. నర్తకులకు దృష్టి ఎప్పుడూ ముద్రికమీదే ఉండాలి. అక్కడే మనస్సు లగ్నంచేయాలి. మనస్సు ఎక్కడ ఉంటే భావాలు కూడా అక్కడే ఉండాలి. అందుకే 'యతో హస్త స్తతో దృష్టిః'. నర్తకులు గీతాన్ని పాడితీరాలని లేదు. తాము పెదవులు మాత్రం కదుపుతూ వంత పాటను కూడా ఏర్పాటు చేసుకోవచ్చు.

కూచిపూడి నాట్యంలో భామ కలాపం అనేది

51 పేజీ చూడండి

తప్పకుండా వస్తుంది? అందరికీ సంపంగి నాసికలే ఉండాలా, అందరూ విశాలాక్షులే అయితేనా ఇక అందమనీ, లేదూ అని ఒక ప్రత్యేకత ఏమిటి? కొంద రందంగా ఉండగలవాళ్లున్నారు. కొందరు రూపూ రేఖా ఉండీన్నీ వెకిలిగా అగుపించేవాళ్లున్నారు! ..... కట్టూ బొట్టూ, తీరూ తెన్నూ, మాటా మంతీ నడకా నడవడికా ఇవన్నీ కలిపితే వ్యక్తిత్వానికి ఒక అర్థం. ఆ అర్థంలోనే అందమనే తత్వం రూపొందుతుంది.

అందాన్ని ఒక తత్వమని నిర్వచించడం కొందరికి విడ్డూరంగాను, ఇంకొందరికి ఒగాయ్యితంగానూ ఉంటుందేమో గాని, కాస్త ఆలోచించి చూస్తే పౌడర్ డబ్బా, స్నో సీసాలు, ఎన్నివాడినా అందం రాదనీ, నిర్మలమైన నవ్వు, మెత్తని మాటా నేరిస్తే చీదీ కళ్ళ అమ్మాయిలు కూడా అందంగా ఉంటారని మనకి తెలుస్తుంది. మనవాళ్లంటారు: "ఫలాని పంకజాక్షి వాడినన్ని స్నోలకూ, పవుడర్లకూ, డబ్బుంటే, అది కట్టిన నైలాన్ సిగ్గు విడిచి నవ్వూ కడితే ఇంచక్కా రాజా పెళ్లాం రంభలా ఉంటావని?" కాని, ఇది భ్రమ. కొందరు కొత్తగా బజార్లోకి ఏదేనా స్నో కాని, పౌడర్ కాని, లేదా సెంట్ వస్తే చాలు అది కొని వాడేదాకా నిద్రపోరు. పైగా, బొద్దుగా, పొట్టిగా దబ్బపండు ఛాయలో ఉన్న శ్యామల పల్చని జార్జెట్ చీరె కొనుక్కుందని [...] పొడుగ్గా, కాస్త కృష్ణవర్ణంలో ఉన్న [...] అది కొనుక్కుంటుంది. మన ఆడపిల్లలకుఉండే అహం అలాంటిది. కాని, "శ్యామల వంటిని హత్తుకుని, ఆ పిల్ల మందంగా నడుస్తూ ఉంటే రాణించినంతగా, పల్చని సిల్కుచీరెలు మశాక లాంటి శరీరకు పనికిరాకపోవచ్చును. పైగా సన్నంగా, పొడుగ్గా వున్న వాళ్ళ వంటిని కాస్త ముతక చీరెలు, లేతరంగులున్నవీ పెద్ద బోర్డర్లున్నవీ రాణిస్తాయి. ఇరుగమ్మ సరిగె పెట్టిందని పొరుగమ్మ ఉరి అన్న సామెత ప్రకారం చేయరాదు. ఒక అలామకు నప్పిన నత్తు మరో లతాంగి ముక్కున అత్తుకోదు. కాస్త సన్నంగా మామూలు సైజ స్త్రీలు ఎత్తు మడమల జోడు వేసుకుంటే, చురుకుగా నడుస్తే అదో అందం. అలా గాకుండా కాస్త బారుగావున్న స్త్రీలుకూడా ఫాషన్ అనుకుని అవే ధరిస్తే ఎబ్బెట్టుగా ఉంటుంది. చాలామంది ఆడపిల్లలు తమ వంటికి ఏది రాణిస్తుందో ఆ అలంకరణ చేసుకోడం అలవాటు చేసుకోరు. ఎదుట ఉన్న మరో సాటిపిల్ల ఏ అలంకరణ చేసుకున్నదో చూసి, దానికి రెండాకులు ఎక్కువ తామున్నా, అదే అలంకారం చేసుకుంటారు. నగలు, చీరెలు, చెప్పులూ, ముఖ్యంగా ఈ మూడూ తరచూ బయటకు వెళ్లే స్త్రీలు బహు జాగ్రత్తగా ఎన్నిక చేసుకోవాలి. తమకు కావల్సిన "లైట్ మేకప్"కు ఏ సరంజామా కావాలో అదే కొనుక్కోవాలి. కల ఇంటికోమలి ఏ వేషమేసినా కార్యా, దర్పం ఇత్యాదులు నలుగురి నోళ్ల మూసేస్తాయిగాని, మనం ఎక్కువ మంది మధ్యతరగతి స్త్రీలు—సంస్కారంకోసం సరదా కోసరమో నాలుగు ముక్కలు చదివినవారూ, సాధారణంగా విమర్శలకు గురి అవుతూ ఉంటాము. ముఖ్యంగా దసరాలాంటి వేడుకల్లో బొమ్మల కొలువు లనీ, పిలుపులనీ నలుగురూ కలిసి జరుపుకునే విందు, వినోదాలుంటాయి. ఈ పండుగలలో రక రకాల వేషధారణా, నగల అలంకరణా, వస్త్రధారణా మనం చూస్తూంటాము. అందుకనే ముఖ్యంగా తనకు నప్పిన ప్రతీ రంగూ, ప్రతీ నగా తన వంటిని ఎంత బాగుంటుంది అనీ;సాటి స్త్రీవంటి నెంత రాణిస్తుందీ, అనేది బాగా ఆలోచించుకోవాలి. "నాకు ముదురు నేరేడుపండు రంగంటే మహా ఇష్టం" అని నల్ల అమ్మాయి జరీ అంచు నల్ల చీరే, వెల్వెట్ జాకెట్ వేసుకొందనుకుందాము. ఎలా ఉంటుంది? దాని వల్ల ఆమె ముచ్చట తీరకపోగా అందరూ, ఆ రంగును కూడా ఆమె ఎదుట తీసి పారేస్తారు. అలాగే, నాకు సాదాగా ఉండాలంటే ఇష్టం. నేను తెలుపుమాత్రం వాడతానని, అంచు కూడ లేని తెల్లని వస్త్రధారణ చేసి, వీలైతే నుదుట కుంకుమ కూడా మానేసి చేతికో బంగారుగాజు, రెండోచేతికి సాధ్వమైనంత లేతరంగు బెల్టుగల వాచ్ వేసుకునే అమ్మాయి లుంటారు. వీళ్లకు మొహంలో తెల్లనిరంగువల్ల రావల్సిన కళ రాకపోగా, తెల్పువని పోతారు.

నీరజ కొన్న స్నో బాగుంది. నేను అదే వాడతాను. అని వెంటనే వారిజ ఓ ఫామిలీసైజ బాటిల్ కొనేస్తుంది. కాని, ఈ స్నో వారిజకు ఎల్లర్జిక్ అవుతుంది. రాసుకోగానే ఆ పిల్ల మొహం విరిగిన కాఫీ రంగులా అక్కడక్కడ ముదురుబారిపోతుంది? అలాగే కొన్ని పవుడర్లూ, సబ్బులూనూ......ఇక కొక్కులజుట్టు వున్న శకుంతల రెండు జెడ లల్లు [...] వదిలేసిందనుకోండి.....ఆమె [...] మరీ పొడుగ్గా లేపోతే పైట బారుగా వానివేస్తే ఈ రెండు జెడలు అదోమాదిరి అందాన్నిస్తాయి. ఇదేవిధంగా దీర్ఘకుంతలాలుగల ఘరో స్నుకుమారిచేసి ఆ [...] నాగరికమనుకుంటే జెడ [...] అందం [...] అవసరమ్మకము కూడా. కాని, ఇది చాలా అవసరం.

[...] అలా అని అభ్యాసం వల్ల [...] అలంకారం, భూషణం లేకండా రాణింపూ ఉండదు. తెలుగు స్త్రీల అలంకారంలోను, కట్టూబొట్టూలోను ఒక రకమైన గుంభన, గంభీరత ఉన్నాయంటారు. ఇవి ఈమధ్య రాణింపుకు రాకపోడం కాలేజీ అమ్మాయిల్లోను "వర్కింగ్ గాల్స్" (ఆఫీసుల్లో పని చేసే ఆడపిల్లలోనూ) కూడా అగుపిస్తున్నది. ఫ్యాషన్లు అనేవి ఆడవాళ్లకుఇట్టే అబ్బేస్తాయి. ఇవి స్త్రీలనోట నువ్వుగింజ నానదన్నట్లే ఇట్టే పాకిపోతాయి. ఉదాహరణకి గుర్రపుతోక జెడలు (హార్స్ టైల్ హేర్ స్టైయిల్) ఈమధ్య ఫ్యాషనైంది. ఏ స్నో ప్రకటనో చూడటం, లేదా. వాయిల్ గుడ్డ అడ్వర్టయిజమెంట్ నో చూడటం.... వెంటనే ఆ మాదిరిగా తయారవడం—ఇది అంతగా రాణించదు. 'మాడల్' నించున్న భంగిమ ఆ వేషాన్ని వేసుకున్న అమ్మాయిలు నడుస్తూంటే రాకపోడమే అందు క్కారణం. అలాగే ఈ హార్స్ టైల్ హేర్ స్టైల్ అనేది ఏడెనిమిదేళ్ల పిల్లలకు బాగా ఉంటుంది. వాళ్లు చురుకుగా తువ్వాయిల్లా అటూ, ఇటూ గెంతు లేస్తారు. గనుక—10, 12 సం. ల దాటిన తర్వాత ఇక ఈ వేషం మానెయ్యాలి. కాని, చాలామంది వయస్సు తిరిగిన స్త్రీలు దీనికి మోజుపడుతున్నారు. కొంతమంది మెడ పొడుగ్గా (శంఖంలాగా) ఉంటుంది. మొహం కోలగా, కళ్లు పొగగా, ముక్కు సూదిగా ఉంటుంది. వీళ్ళు కాలర్ వున్న బ్లౌజు వేసుకున్నా, లేదా ఇంగ్లీషు "వి" ఆకారంలోఉన్న జాకెట్ వేసుకున్నా పెద్ద అంచున్న సాదాచీరెమీద రాణిస్తుంది. అయితే ఏ వేషానికేనా ఒకవేళ ఉన్నది. ఏ ఫ్యాషన్ కే నా ఒక సమయమున్నది. డిసెంబర్ మాసంలో చేతుల్లేని బ్యాక్ లెస్ జాకెట్ వేసుకుంటే అదింసంగతి కేమిగాని ఆరోగ్యం కూడా పోతుంది. అలాగా కొంద రమ్మాయిలు, ఈమధ్య "రుద్రాక్ష మాలలు" వేసుకుంటున్నారు. వెనుకటికి 'శకుంతల' (కాళిదాసుగారి శకుంతల కాదులెండి) శాంత రామ్ శకుంతల ఏమాదిరిగి ఉండాలి అని! తువ్వాయి మెడలో కట్టే గాజుమువ్వ సైజు పూసల దండలు ధరించే అమ్మాయిల్లో కొందరు వయ్యార బొమ్మలు రాణిస్తారుగాని, వీళ్లకి సొంపు సోయగం ఉండాలి. పైగా నిడుపైన ఒత్తైన కేశాలు ఉండి, వాటిని కొప్పు ముడుచుకుంటేగాని, ఇవి రాణించడంలేదు. పైగా ఈ "మాలలు" వేస్తే అందుకు మాచ్ అయ్యే సన్నని నేత (జరీ అంచు) చీరలను కట్టాలి. సరిగ్గా ఈ పూసల షేడ్ కు సరిపోయే "టిక్", "లిప్ స్టిక్" వాడాలి. ఇదంతా శ్రమ. కాని, సౌందర్యపోషణ వూరికే వస్తుందా? అందుకనే కొత్త ఫ్యాషన్ కు ఓపిక దేహ సౌష్టవంలో అమరికా ఉండాలి. లేకపోతే ఏదో అంటారే, తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదమనీ అలా అలంకారాలదారి దానిదీ, మన నడకతీరు దానిదీ అయిపోతుంది. దసరాలాంటి పండుగల్లో నలుగురూ కలిసే బొమ్మలకొలువుల్లో, [...] లోగిళ్లలో అమ్మాయి లెంత తెలివి గలవారైనా, పాశ్చాత్యవేషధారణమ 'ఈవ్నింగ్ షాపింగ్' అలంకరణను వదిలేసి, కాస్త ముదురుపూలూ, రంగులూ, అంచులూవున్న చీరెలు పరికిణీలు, వాటి మీదకు నిండైన బ్లవుజులు, చేతులకు గాజులు చిన్న పిల్లలైతే లోలాక్కులు (ఇవేమిటో ఎంతమంది ఆడపిల్లలకు తెలుసు?) మరి కాస్త పెద్దమ్మాయి లైతే దుద్దులు (దీన్నే 'టోడు' అంటారు కొందరు) చేతులకు గాజులు, అసలు ముక్కున కుట్టువుంటే బేసరి, (సూదిగా, పల్చని ముక్కుఉంటే ఒంటిరాయి పుడకే అందం) పెట్టుకుని జెడనో, సిగనో పూలు తురుముకొని తిరిగి వస్తున్నప్పుడు మెడను సుగంధ గంధం, నోట తాంబూలం, చేత పండూ, తాంబూలాల్లో ఉంటాయి గనక దీపాల కాంతుల్లో అవే వెలవెల బోతున్నట్లుంటారు తరుణాంగులు.

అలాగే సందర్భాలను గురించి వస్త్రధారణ అంటే వర్కింగ్ గార్ల్స్" (టైపిస్టులుగా సైనోలుగా రిసెప్షనిస్టులుగా పనిచేసే అమ్మాయిలు) జ్ఞాపకం వస్తారు. ఒక దశలో గౌనులు వేసుకున్న అమ్మాయిలే ఈ ఉద్యోగులుగాని, ఇప్పుడు మన వాళ్లూ చదువుకున్న అమ్మాయిలు ఈ ఉద్యోగాల్లో ఉంటున్నారు గనుక ---వీరి వేషధారణ దానిలో ఔచిత్యా నౌచిత్య మీమాంస చాలామంది స్త్రీలు, పురుషులూ కూడా చేస్తున్నారు. అయితే 'వ్యాస విస్తరణ భీతిచేత' ఇది మహోహరి ముచ్చటించడానికి వదిలి వేస్తున్నాను. ఇంతకీ చెప్పేదేమిటి అంటే పొదుపుగా డబ్బు వృధా అక్కర్లేకుండా అందాన్ని అభ్యాసం చేయొచ్చునని. నిర్మలంగా నవ్వడానికి ప్రశాంతంగా చూడటానికి తెల్లని పళ్ళూ, నిర్మలమైన కళ్ళూ,నీటైన మాటతీరూ; వీటికి విలువ అపారమైంది. ఖరీదు లేదు. తర్ఫీదు ఆసక్తీ, ఇవే ముఖ్యం! ★

# "పిల్లల విషయంలో..."

విజయలక్ష్మి

నలభైమూడుకోట్ల జనాభాగల భారతదేశంలో రకరకాల మనస్తత్వాలుగల ప్రజలుంటారు. ఇందులో కూడా పెద్దవాళ్ళ పిల్లలయందు చూపే ప్రేమ, శిక్షణ వివిధరకాలుగాను, విచిత్రంగానూ ఉంటాయి. నేటి బాలురు కాబోయే పౌరులన్న విషయం అందరకు తెలిసినదే. ఆ విధముగానే బాలికలు కూడా. "ఏ పుట్టలో ఏ పామున్నదో.....!" అను సామెత ఉండనే ఉన్నది. వారిలో ఎందరు డాక్టర్లు, ఇంజనీర్లు, రాజకీయనాయకులున్నారో!

ఏ వాడ చిలుక ఆ వాడ పలుకున్నట్లు, ప్లీడర్ల పిల్లలు ప్లీడర్లుగాను, డాక్టర్ల పిల్లలు వైద్యులుగాను ఆటలాడుతారు. ఇదేవిధముగా చెడ్డ విషయాలలో. త్రాగుబోతువాని పిల్లవాడు సారాయి కొరకు చూస్తూ ఉంటాడు.

పిల్లలమీద తృప్తి ఉన్నా, వారి ఎదుట కనబరచరాదు. అందువలన గర్వం పెరుగుతుంది. పిల్లలయందు పెద్దవారు ఎంత జాగ్రత్తపడితే, అంత వృద్ధిలోకి వస్తారు. పెద్దవారియందు పిల్లలు, పిల్లలయందు పెద్దవారు ఒకరి కొకరు అభిమానము, ప్రేమ పెంచుకునియుంటే ఆ సంసారము ప్రశాంతముగాను, చూడ ముచ్చటగాను ఉంటుంది. పెద్దవాళ్ళు పిల్లలయందు హెచ్చుతగ్గులు చూపించరాదు. ఒక తల్లిగర్భాన జన్మించిన పిల్లలలో విచిత్ర అభిప్రాయాలు, విభిన్న మనస్తత్వాలు కనుపిస్తాయి. ఎవరితోఎలా ప్రవర్తించాలో ముఖ్యంగా తల్లికి తెలుస్తుంది. ఆడపిల్లలైతే తల్లికి ఎక్కువ బాధ్యత, మగపిల్లలైతే తండ్రిది బాధ్యత ఎక్కువ. పిల్లలకు ఐదు, ఆరు సంవత్సరాలప్రాయంవరకుగాని, తప్పొప్పుల విచక్షణ తెలియదు. (ఈ రోజుల్లో పెద్దవారికే తెలియటంలేదనుకోండి) కొందరికి ఇంకా ఆలస్యంగా కూడా తెలియవచ్చును. ఆలస్యమైనంతలో వారు తెలివితక్కువవారని భావించరాదు. ఈ వయసులో ఏ విషయాలు, అభిప్రాయాలైతే ఏర్పడతాయో అవే స్థిరపడుతాయి. పెంకెతనం, అమితమైన గారాబము చిన్నతనమునుండే వృద్ధిపొందకుండా చూడాలి. ప్రేమ కనుక ఎక్కువగా ఉంటే కోపము ఎక్కువగానే పెట్టుకొనవచ్చు. అలాగే గాని, భయము, చనువు లేకుండా మాత్రము ఉండకూడదు. విపరీతమైన భయం కూడా అనర్థాలకు దారి తీస్తుంది.

కాన్వెంటులో పెరిగితే క్రమశిక్షణ అలవడుతుందని కాన్వెంటుల్లోనే చేర్పిస్తారు డబ్బుకలవాళ్ళు. అందరకూ చేర్పించే స్తోమతు ఉండదు, కాని, క్రమశిక్షణకు కాన్వెంటు మాత్రమేకాదు, ఇంటివద్ద కూడా నేర్పవచ్చును. కాన్వెంటుకు వెళ్ళివచ్చి, అప్పటి దర్జాలకు అలవాటుపడి, ఇంటివద్ద సామాన్యంగా అందరితోపాటు ఉండలేక ప్రత్యేకత కోరే పిల్లలు కూడా ఉన్నారు, జరగకపోతే బాధ, అవమానము పొందుతారు. (అట్లాగని అంతా అట్లుండరు.)

(తమ సంతానములోనే!) కొందరి పిల్లల నొక విధంగాను, మరికొందర నొకవిధముగాను చూచే తల్లిదండ్రులున్నారు. మా మేనమామగారి భార్య పెద్దకూతురును, మూడవ కూతుర్ను, మిగతా వారికన్నా భిన్నంగా చూస్తుంది. పెద్దపిల్లను అత్తగారు పెంచినదని, మూడవకూతురికి అత్తగారి పేరు పెట్టారని వాళ్ళకు రోజూ చివాట్లు. ఇక రెండవ కూతురు, కొడుకు విషయం: రెండవ కూతురుకు తన తల్లిపేరు పెట్టబడడంచేత 'మా అమ్మ', 'మా తల్లి.....' అంటుంది. కొడుకు ఒక్కడే అవడంచేత వల్లమాలిన ప్రేమ. ఇవి ఆమె ప్రత్యేక పెంపకములు. వారిలో అవి అప్పుడే బలపడినాయి. రెండవ కూతురుయందు ప్రేమ చూపితేచాలు, ఆయన ఆఫీసునుంచి రాగానే అమ్మాయికి కడుపునొప్పి అని, వాంతులని లేని రోగాలు చెబుతుంది. (మా అన్నయ్యకు 'ఎపెండిసైటిస్' ఆపరేషను జరిగిందిలెండి) అందుకు ఆయన భయపడి 'ప్యాలొటమ్ము' వేయించారు. డాక్టర్లు ఏమీలేదు అని చెప్పారు. ఆయన పదిగంటలకు ఆఫీసుకు పోగానే ఆ కూతురు భోజనముచేసి, త్రొక్కుడుబిళ్ళ ఆటకు పోతుంది. తిరిగి ఆయన వచ్చేవేళకు బట్టలు మార్చుకొని, కళ్ళు త్రిప్పుతూ, అనారోగ్య లక్షణాలు ప్రకటించడం— ఇవి ఆమె రోగ లక్షణాలు. తుదకు ఆయనకు నిజము తెలిసినది. అనలేక ఊరుకున్నారు. ప్రేమ అంటే ఇదేనా? పెంపకము తెలియదా? దీనికి సమాధానము వాళ్ళకు కూడా తెలియదు. దానిని ప్రేమ అనరు. పాడుచెయ్యడము అంటారనుకుంటాను.

ఇక కొందరు పిల్లలు ముదిగా మాట్లాడుతారు. ఎరుగున్నవాళ్ళ నెవరినో చూడడానికి వెళ్ళాము. వారికి, వాళ్ళు పిల్ల పుట్టినప్పుడు ఆవిడ వాళ్ళ దానను అడుగ్గా 'నీ మొగుడు ఎవరే వద్మా?' అంటే 'పెద్ద మామయ్య' అని అన్నది. ఆవిడ పకపక నవ్వింది. ఆ పిల్ల వయసు మూడు—నాలుగు సంవత్సరాలమధ్య ఉంటుంది. దానికి ఆ పిల్ల పొరపాటు ఏముంటుంది చెప్పండి? అవి వాళ్ళు నేర్పిన చిలక పలుకులుగాని. ఇవేనా ఆ పిల్లకు నేర్పేది—నన్నడిగితే పిల్లలముందు వారి వివాహ ప్రసక్తి తేరాదంటాను. ఒకవేళ వారికేల అభిప్రాయాలుంటే, వారు లేని సమయము, చోటు చూసుకుని వర్ణించుకోవాలి.

ఏమండీ! మీ అమ్మాయిని మా అబ్బాయికి చేసుకుందామా! రెండుసంవత్సరాలలో వాడి చదువు, ఈమె స్కూలు ఫైనలు పూర్తి అవుతాయి అన్నది ఒకావిడ అమ్మతో. నాకు నవ్వొచ్చింది. ఇంతలో అతను వచ్చి "ఏమిటి నా పేరువచ్చింది" అని అడిగాడు. నాకు ఈవిడ ఏమంటుందో భగవంతుడా అని భయము వేసింది. "ఏమీ లేదు—నీవు ఇంకా రెండేళ్ళు చదువుతేగాని, చదువు పూర్తికాదని అన్నాను" అన్నది. ప్రజ్ఞమిచ్చి అనుకుని ఇంట్లోకి దూరాను. ఇది పూర్వకాలపువాళ్ళకు—ముఖ్యంగా స్త్రీలకు ఎక్కువగా ఉంటుందని నా అభిప్రాయము. చేసుకున్నా, చేసుకోకపోయినా, ఎందుకు ఈ పిచ్చి సంభాషణలు. ఇవి ఇతరులవాళ్ళకు ప్రాణ సంకటముగా తయారవుతాయి. ఇటువంటి మాటలు అనవద్దు అని కుండబద్దలు కొట్టినట్లు చెప్పే ధైర్యం ఉండదు. ఉన్నా, తల్లిదండ్రులకు భయపడి చెప్పలేరు.

ఇక పిల్లల విషయము: ఇంటిదగ్గర ఉంటేనేగాని బయటకు పోతే ఎలా తెలుస్తుంది? దానికి తండ్రి బాధ్యత ఎక్కువ. కొందరు తండ్రులు తమ పిల్లల్ని



# వనితా వాణి

## బంధువులూ-ఇబ్బందులూ

బంధువులూ, ఇబ్బందులూ అను వ్యాసం చాలా బాగుంది. నేను ఈ వ్యాసంకోసం చాలా రోజులనుండి ఎదురు చూస్తున్నాను. సత్యన్ జయగారు బంధువుల వలన ఎలా ఇబ్బందిపడుతున్నారో తెలిపారు. ఈ వ్యాసం ద్వారానైనా బంధుజనం తగ్గుతారని ఆశిస్తున్నాను.

కె. యు. బి. ఆర్. ఆర్. (బందరు)

* * *

జి. సత్యన్‌జయ వ్రాసిన వ్యాసం చదివి విచారించా. భర్తవేపువారి బంధువులు వస్తే ధూంధాంలు, తండ్రి చుట్టాలువస్తే చక్కగా ఆదరిస్తారీ ఆడవారు. మాకు తెలిసినావిడ మామగారు, అత్తగారు వస్తే ఆమె కొంప మునిగినట్లు చేస్తుంది (వారున్నది 2 రోజులే). తల్లి, తండ్రి వస్తే నవ్వుతూ, ఇంకా ఉండమంటుంది. మామగారివల్లనేగదా ఆమె, భర్త చక్కగా యుంటున్నారు. అలాటివారిని అనాదరిస్తే బాగుంటుందా?

కొత్తపల్లి రాజరత్నం (భిక్కనూరు)

* * *

"బంధువులూ—ఇబ్బందులూ" వ్యాసము చాల బాగున్నది. రచయిత్రి బంధువులవలన కలిగే ఇబ్బందులు చక్కగా వివరించారు. రచయిత్రికి మా అభివందనములు.

తుమ్మల బుల్లెమ్మ, వల్లూరి లక్ష్మీశ్వరి (నిడుబ్రోలు)

## దాంపత్య జీవితం

ఆచంట కృష్ణవేణిగారు వ్రాసిన "దాంపత్య జీవితం" వ్యాసం బాగానే ఉంది. ఆ వ్యాసంలో ఆమె "కాస్త గడ్డుగుణంకల స్త్రీ కొంచెం అమాయకుడైన వ్యక్తి భర్తగా లభిస్తే, అహంకారంగల భర్తను వంచించినట్లే యితనినీ వంచిస్తుంది. 'ఎప్పుడూ యింతే' హీరోగారిని చూసేవిధంగా చూస్తుంది. అతన్ని కీలు గుర్రంలా తయారు చేస్తుంది. ఆ సంసారమునుచూసి అందరూ హేళన చేసినా ఆమె చలించదు." అంటూ వ్రాశారు. అది పొరపాటు. ఎంత గడ్డుగుణంకల స్త్రీకి అయినా, అమాయకుడైనభర్త లభిస్తే అతనియందు (అతని అమాయకత్వమునకు) జాలి, ప్రేమ గౌరవం ఉంటుంది. తనభర్తను అందరూ హేళనచేస్తే ఆమె భరించలేదు. లోకుల నోరు మూయలేక తనభర్తను నల్గురిలో గొప్పవ్యక్తిగా రూపొందించ వలెనని తాపత్రయ పడుతుంది. భర్తను చులకనగాచూస్తే (అరిటాకు సామెతగా) ఆమెకేకదా నష్టం?" భర్తను కీలుబొమ్మలా ఆడిస్తోంది" అని ఆమెనే అంటారు కాని ఆ భర్తను అనరుకదా!

శొంఠి సూర్యకుమారి (నీలగిరి)

* * *

"ఒక మధురగీతంలాంటిది వివాహము. ఆ గానంలో అపశ్రుతులు ఏమాత్రం ఉండకూడదు." —అబ్బ! ఇంత చక్కని వ్యాఖ్యతో ముగించిన వ్యాసాన్ని అభినందించకుండా ఉండలేను! మొండిపట్టు దలకు పోకుండా స్త్రీ పురుషు లిరువురూ సఖ్యతతో మెలిగితే అంతకన్నా స్వర్గం వేరే ఉండదు.

స్త్రీలను సహృదయంతో చూడని మగవారిలో ఈ వ్యాసం తప్పక మార్పు తీసుకు వస్తుంది. 'ఎప్పుడూ ఇంతే'లా ఉండే స్త్రీలకుకూడా ఈ రచన ఒక గుణపాఠం..

సరోజాదేవి (పొలై)

* * *

ఆచంట కృష్ణవేణిగారు "దాంపత్య జీవితం" కొందరు పురుషులు స్త్రీలను సహృదయంతో చూస్తారని, చూడనివారి గురించే వ్రాసేనన్నారు. అలాగే కొందరు పురుషులు స్త్రీలను సహృదయంతో చూచినా, తిరిగి సహృదయంతో చూడని స్త్రీలగురించి వ్రాశారుకారు.

డి. విజయలక్ష్మి (బరంపురం)

* * *

వ్యాసము చదివాను. చాలా బాగా వ్రాశారు. ఈ వ్యాసం లో ఆమె "భర్తకు యిష్టములేని అలవాట్లు భార్యమానుకోవాలి. స్త్రీ యిటువంటి త్యాగాలు చెయ్యాలి అన్నారు," ఎందుకని! స్త్రీకి యిష్టము లేని అలవాట్లు భర్త ఏమైనా మానతాడా?వమానమనే. కనుక భార్యఅంటే" నా యిష్టం నేను మానను ఎలాగైతేనేం? నువ్వొక్కదానవు వచ్చావని నాకిష్టమైన అలవాట్లన్నీ మానుకోవాలా? "అంటూ హేళనగా నవ్వుతాడుగదా! మరియిది ఎవ్వరూ పట్టించుకోరే" అని వ్రాశారు. ఇది నన్నాకర్షించింది. నిజంగా పురుషుణ్ణి ఎవరూ పట్టించుకోరు. అతను తప్పుచేసినా ఘనుడే. అదేమంటే? అది పురుష లక్షణమంటాడు. ఏం చేస్తాము? స్త్రీకి ప్రకృతి, పురుషుడు కలిసి విధించిన శిక్ష అలాంటిది.

టి. సరళాదేవి (పెదముత్తేవి)

* * *

ఈ వ్యాసం చదివాక మాదాంపత్యాన్నికూడా చెప్పాలని తోచింది. మావారు నేనుకూడా ఏమాత్రం అభిప్రాయ భేదాలువచ్చినా సర్దుకు పోతాము. వావల్ల ఏదైనా పొరపాటు జరిగినావారు సర్దుకుంటారు. మా దాంపత్యం ఎంతో సుఖంగా సంతోషంగా గడిగడిచి పోతోంది.

ఎ. సావిత్రీదేవి (కొత్తపల్లి)

* * *

కృష్ణవేణిగారు వ్రాసిన "దాంపత్య జీవితం" వ్యాసం బాగానే ఉంది. కాని కొన్నిచోట్ల మాత్రం రచన అసహజంగాసాగింది. రచయిత్రిగారు వ్రాసినట్లు దాంపత్య జీవితంలోగూడ భార్యాభర్తలు పరస్పరము గౌరవం యిచ్చి పుచ్చుకోవడాలు పాటిస్తే, లేనిపోని చిక్కులు ప్రారంభిస్తాయి. ప్రేమానురాగాల కాలవాలమైన ఒక మధుర ఘట్టమే దాంపత్య జీవితం. పవిత్రమైన వైవాహిక బంధంలో ప్రేమానురాగాలకే తావుంది! కాని గౌరవం ఇచ్చి పొందటం ప్రారంభిస్తే కొద్ది కాలంలోనే వసంత కాలంవంటి జీవిత యాత్రలో — ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అనుభావం ఏర్పడి జీవితపథంలో చాలా అడ్డంకులకు, అగచాట్లకు గురి కావల్సి వస్తుంది.

కొలను సుగుణ (ఒడిపిలవంచ)

* * *

"దాంపత్య జీవితం" వ్యాసం చదివాను. వ్యక్తుల ప్రవర్తన చిన్నప్పటినుండి వారు పెరిగిన వాతావరణం మీదా వారిప్రవృత్తిమీద ఆధారపడి వుంటుందని సరిగానే వ్రాశారు. కాని, చదువుకొని స్త్రీ అయితే

---

చెడిపోతున్నా ఊరుకుంటారు. కాని, వారిని మాస్టర్లుగాని, ఇతరులుగాని ఏమన్నాఅంటే ఊరుకోరు. స్కూలులో చదువుతున్నపుడు చదువు విషయమే కాకుండా పిల్లల ప్రవర్తనపై కూడా అధ్యాపకులకు బాధ్యత ఉంటుందిగదా! ఏ ఆడపిల్లనైనా, వారే దైనాఅంటే చూస్తూ ఊరుకోవాలి; (ప్రతి విషయంలోను అంతే) కాని, గురువులు ఏమీ అనరాదు. అంటే, తల్లితండ్రులు కర్రలు తీసుకుని దండెత్తుతారు. ఈ విధంగా ఉంటే పూర్వం గురుకులాలలో విద్య ఏ రకంగా కొనసాగేది? మాకు ఒక్క పిల్లవాడు, వాడిని అంటే ఊరుకోమని మాస్టర్లమీద తగాదాకి వెడితే ఎంత అర్థరహితంగా ఉంటుంది చెప్పండి. గురువులకు ఏ పిల్లలైనా ఒకటే. ఫలానావారికి ఒక్కపిల్లవాడు కనుక ముద్దుగా చూడాలి అనుకుంటారా? ఇది ఆలోచించరు. ఈ విధముగా

## పిల్లల విషయంలో

పిల్లలకు మాస్టర్లంటే భయం ఎప్పటికీ రాదు. కొందరు పిల్లలు మాస్టర్లను తిడతారు. చాటుగా తిడితే, వచ్చే ప్రయోజనమేమిటో! ఇందుకు పెద్దవాళ్ళ ఊరుకోవడము పొరబాటు.

"మా అమ్మాయి చదువుకునేటప్పుడు చాలా బుద్ధిమంతురాలు అనిపించుకుని మరీ మానింది. ఇక్కడ వంచిన తల స్కూలులోను, స్కూలులో వంచిన తల ఇక్కడ ఎత్తేది. ఈ రోజులలో పిల్లలు చాలా అసహ్యంగా ప్రవర్తిస్తున్నారు" అని అన్నది మాకు తెలిసిన ఆవిడ మా అమ్మతో. 'ఎవరి పిల్లలు వాళ్ళకు మంచివారేలెండి' అని మా అమ్మ అంటే ఆవిడకు కోపంవచ్చింది. ఈ ప్రసక్తికి కారణం నేను చదువుకోవడము. పరోక్షంగా దెప్పిపొడవడమే తన ఉద్దేశముగాని, బయట ఎలా ఉండేది తనకు తెలియదు. ఇటువంటి మాటలవలన ప్రయోజనములేదు. ఇది విమర్శనకు వ్రాయడంలేదు. ఇలా ఎంతకాలం కొనసాగుతాయి? ఎప్పటికైనా పరిస్థితులు మారుతాయా?

మన పొరబాట్లవలన పిల్లలు పాడవుతున్నారు. మన సంతానంమీద అనవసరమైన నమ్మకముతోను, ప్రేమతోను పాడుచేస్తున్నామని ఆలోచించము. నేను వ్రాసిన దానిలో బాధ కలిగించేదుంటే మన్నించండి. పిల్లలకు రెండు మూడు సంవత్సరాలు వచ్చిన తరువాత పెంపకము జాగ్రత్తగా ఉండాలి: పెరుగుతున్న వృక్షంలాంటివారు కనుక!



విదురువాదన చేయుటం జరుగుతుందని తీర్పు చేయుటం సమంజసముగాలేదు. ప్రస్తుత కాలంలో వారివారి పరిస్థితులనుబట్టి అహంభావంగా ప్రవర్తించేవారు స్త్రీలలోను వున్నారు పురుషులలోను వున్నారు. నేరుగా ఎదిరించలేని పరిస్థితులలో మాయోపాయంచేత భార్యను భర్తగాని, భర్తను భార్యగాని ఎదిరించడమనేది, వారివారి మనో ప్రవృత్తులమీద ఆధారపడి వుంటుంది. అంతేగాని స్త్రీ మాత్రమే మాయోపాయం పన్నుతుందని, పురుషుడు ఆ విధంగా ఆలోచించలేడని అనటం సబబుకాదు.

పి. రంగనాయకి (హైదరాబాద్)

*   *   *

వ్యాసం చాలా బాగుంది. దాంపత్య జీవితంలోవుండే సత్యాన్ని ఈమె బాగా గ్రహించారు. వారితో నేనూ ఏకీభవిస్తున్నాను. భర్తకి అనుగుణంగా భార్య సర్దుకున్నప్పుడు భర్త కూడా; ఎందుకు సర్దుకోకూడదు? కృష్ణవేణిగారు వ్రాసినట్లుగా యిదేమీ పూర్వకాలం కాదు. రోజు రోజుకీ ఉద్దేశాలు, ఆచారాలు మారుతున్నాయి. భర్త అన్నదెల్లా భార్య చెయ్యాలని ఎక్కడాలేదు. ఆమెకి వీలున్నవే చేస్తుంది, కాని అన్నీ చేయలేదు. ఇది ప్రతిభర్తా గమనించాలి. లేకపోతే దాంపత్య జీవితంలో సుఖమనేది వుండదు.

శ్రీమతి. పి. రత్నమాల (సికింద్రాబాద్) ★

---

## కుమారి కళ-4   బొమ్మలకథ- దేవిక.



**తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!**

# తలపోటునుంచి పూర్తిగా విముక్తి పొందండి

ప్రపంచమంతా లక్షలాది మందికి కుటుంబ ఔషధం. 'ఆస్ప్రో' మీ శరీరంలో బాధిత భాగాల మీద నేరుగా పనిచేస్తుంది. 'ఆస్ప్రో' తలనొప్పులను పూర్తిగా నయం చేస్తుంది. పంటినొప్పి, వెన్నుపోటు, ఋతుస్రావ నొప్పులు, కీళ్లలోను, అవయవాలలోను, కలిగే బిరుసుతనం, నరాల సలుపు, మొదలైన నొప్పులూ బాధలను కూడా 'ఆస్ప్రో' నయంచేస్తుంది.
కుటుంబంలో అందరికోసము 'ఆస్ప్రో'ను దగ్గర పెట్టుకొనండి.

# 'ఆస్ప్రో'

## ఇంటిల్లపాదికీ



### "ఆస్ప్రో" పనిచేసే విధం చూడండి



**విడిపోతుంది** — 'ఆస్ప్రో' వేసుకోగానే విడిపోవడం మొదలు పెడుతుంది. 'ఆస్ప్రో' చర్య కొద్ది క్షణాలలో మొదలౌతుంది.

**వ్యాపిస్తుంది** — లక్షలాది సూక్ష్మకణాలు మీ రక్త ప్రవాహంతో అతి త్వరగా బాధిత భాగాలు చేరతాయి. తక్షణం ఉపశమనం మొదలౌతుంది.

**నివారిస్తుంది** — బాధ నివారించగానే 'ఆస్ప్రో' మీ శరీరం నుంచి ఉపసంహరించుకొంటుంది. మిమ్ము ఆరోగ్యంగా, ఆనందంగా వుంచుతుంది.




రోజా, ఊదారంగుగల సీలుచేసిన పట్టీ కావాలని అడగండి




## 'ఆస్ప్రో' తీసుకొనండి
## తిరిగి నిజముగా స్వస్థత పొందండి

నికొలస్ వారి (N) తయారు నాణ్యతకు మరియు శుద్ధతకు గ్యారంటీ కలదు

AG.126 TEL.

# ఉదర పరీక్ష

డా॥ గాలి బాలసుందరరావు

ఉదర పరీక్షలో పరివీక్షణ (Inspection) లో సాధారణంగా కనుపించే చిహ్నములు. తెల్లని అడ్డగీతలు. తెలుగుదేశంలో కొన్ని భాగాలో శైశవంలో పొట్టమీద సూది కాల్చి వాతలుపెట్టే ఆచారం ఉంది. ఇందువల్ల కలిగే లాభం ఏమిటో తెలియదు. ఆ మచ్చలుమాత్రం జన్మాంతమూ ఉంటవి. కాని, ఉదర పరీక్షలో గమనించదగినవి ఈ గీతలుకావు. సాధారణంగా చర్మానికి ఒక రంగు ఉంటుంది. ఉదరం బహుకాలం ఉబ్బి ఉన్నప్పుడు, ఉదరకుడ్యం సాగి, చర్మంలోఉండే రంగువస్తువు అంతరిస్తుంది. అలా అంతరించినచోట రేఖాకృతిగల తెల్లని మచ్చలు ఏర్పడతవి. ఉబ్బరమునుబట్టి,ఈ అడ్డమచ్చల పొడుగూ, వెడల్పూ ఆధారపడిఉంటుంది. గర్భధారణ చేసిన స్త్రీలలో ఈ రేఖలు విధిగా ఏర్పడి ఉంటవి. వీటిని గర్భరేఖలు (Striagra vidarum) అంటారు. జలోదరం ఏర్పడ్డ వారిలోనూ ఈ గీతలు కనుపిస్తవి. ఏ కారణంచేతనయినాసరే, కడుపు చాలాకాలం ఉబ్బి ఉన్నప్పుడూ ఈ గీతలు ఏర్పడతవి. ఈ గీతలున్నప్పుడు కడుపును ఉబ్బరించిఉంచే పరిస్థితి ఏదో ఏర్పడిఉన్నదని గ్రహించవచ్చును.

ఉదరకుడ్యంలో రంధ్రంగానీ, ఆ రంధ్రమునుండి చీము, నీరు, రక్తము కారడంగానీ ఉన్నదేమో గమనించాలి. ఉదరంలో కేన్సరు ఏర్పడ్డప్పుడూ, క్షయ వ్యాధి ఏర్పడినప్పుడూ ఈ పరిస్థితి సకృతుగా ఏర్పడవచ్చును. శరీరాంతరాళములకు బహిఃప్రదేశానికీ సంబంధం ఏర్పరచే ద్వారములను "ఫిస్ట్యులా" (Fistula) అంటారు. అంతరాళములను క్రమ్మిఉండే గోడలలో నాళములలాగా ఈఫిస్ట్యూలాలు ఏర్పడతవి. ఇవి ఎన్నాళ్లకూ మానవు. ఈ ఫిస్

—41 వ పేజీ చూడండి

ఇదీ వరస—11

సుందర్



## జరిగిన కథ

నిచుళ నగరంలో శృంగారమంజరి రెండవ కుమార్తె హేమసుందరి. ఒక అర్ధరాత్రి ఆమెను కలుసుకోవచ్చిన రంగనాయకుడు, కావలివారిని గాయపరిచి పోతాడు. గజదొంగ అనుకుంటారు నగరవాసులు. తలారి వేశ్యమాతతో పాటు కుమార్తెల నిద్దరిని దొంగతనం సంగతి విచారిస్తాడు. మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకుల రహస్యం తిరుమలరెడ్డికి చెబుతుంది. స్నేహితుడు గోపాలయ్య ఎంత చెప్పినా వినక రంగనాయకుడు, హేమసుందరి కోసం ఆలయగోపురంమీదకి పోయి సింహాచలాన్ని ఎదుర్కొని బలమైన గాయాలతో ఇంటికి చేరుకుంటాడు. తిరుమలరెడ్డి ద్రోహం తెలుసుకున్న మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకులు కలుసుకునే ఏర్పాటు చేయాలని సంకల్పించుకుంటుంది. నాంచారమ్మ సాయంతో రంగనాయకుడు హేమసుందరిని కలుసుకుంటాడు. తిరుమలరెడ్డి ఇంట్లో దొంగతనం జరుగుతుంది. రంగనాయకుడు, హేమసుందరి శ్రీరంగం పారిపోతారు. హేమసుందరి కన్యగాదని రంగనాయకుడు తెలుసుకుంటాడు. అతని మిత్రుడు గోపాలయ్యవలన స్వగ్రామంలోని స్థితిగతులు తెలుసుకుంటాడు.

## 15

గోపాలయ్య వెళ్లిపోయిన తరవాత రంగనాయకుడు మరికొంత సేపటివరకు నిశ్చల శిలాప్రతిమలా నిలబడి ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు. క్షణకాలం విపరీతమయిన వేదనతో అతని హృదయం స్తంభించింది. ఇక ప్రపంచంలో తానొక్కడే ఏకాకిగా నిలబడ్డట్టు స్ఫురించింది. అతనికి గోపాలయ్యకన్న ఆత్మీయ మిత్రు డెవ్వడు లేడు! అటువంటివాడే ఈనాడు తన సరసన కూర్చుని భోజనం చెయ్యడానికే సంకోచించాడు! ఇక తండ్రి తనమాట తలపెట్టగానే భగ్గుమని మండిపడుతున్నాడు. చిన్ననాటినించి కడగొట్టు కుమారుడని ఎంతో ఆప్యాయంగా పెంచిన కన్నతల్లి కూడా ఆయనమాట కెదురాడలేక మాట్లాడ కూరుకొన్నది. మరి అన్నలిద్దరు తన గోడే తలపెట్టుకపోవడంలో ఆశ్చర్యం ఏమి ఉన్నది? హేమసుందరి కూడా ఎప్పటికయినా తన దారిని తను తరలిపోగలదని గోపాలయ్య గట్టిగా హెచ్చరించాడు. కాని రంగనాయకుని కంతటి అపనమ్మకం కలగలేదు. అయినా చిన్న అనుమాన మేదో లోలోపల కొంచెం పీడించక పోలేదు! కన్న తల్లిదండ్రులే దులిపివేసుకొన్న తరువాత ఎక్కడినించో వచ్చిన హేమసుందరి కలకాలం తానే దైవమని నమ్ముకొని

—42 వ పేజీ చూడండి



# చదువుల్రావు






# కథ కాని కథ

## డేంజర్ సిగ్నల్!

(మొదటి బహుమతి)

మా బాబాయికి గుంటూరు నుంచి హుబ్లీకి బదిలీ కావడంవల్ల, బాబాయి, నేనూ, మా చెల్లీ కారులోనే హుబ్లీకి ప్రయాణం కట్టాము. బళ్లారిదాకా ప్రయాణం బాగా సాగింది. బళ్లారిలో మా యింట్లో రెండు రోజులుండి మరి హుబ్లీకి బయలుదేరాం. మేము రాణీ బెన్నూరు దాటగానే 'తుంగ' నది దగ్గరకు వచ్చింది కారు. మా చెల్లికి కళ్లు తిరిగి నా చీర చెంగు మీద వాంతి చేసుకున్నది. కారు ఆపి నదిలో చీర చెరగు బాగా కడిగి తడి చెంగుతో అలాగే వచ్చి కూర్చున్నా. కారు కదిలింది. మా బాబాయి ఊరుకోక, 'తడి చెరగు కారు కిటికీలోంచి బయటికి వదిలివేయి, గాలికి తొందరగా ఆరిపోతుందని' చెప్పారు. నేను అలానే చేశాను. కొద్దిసేపటికి మా ఎదురుగా వస్తున్న ఒకలారీ ఆగిపోయింది. మా కారు అలానే పోవడం చూసి, మళ్లీ లారీ స్టార్టయింది. ఇలా ఐదారు మార్లు జరగడంతో మా బాబాయి అర్థంకాక నా వైపు చూశారు. ఉన్నట్టుండి పెద్దపెట్టున నవ్వారు. నేను తెల్లబోయి ఏం జరిగిందని అడిగాను. నా చీర చెంగు వైపు వ్రేలితో చూపారు. నేను అటువైపు చూస్తే, ఎర్రని చీర కొంగు గాలిలో రెపరెప లాడడం కనిపించింది. అప్పుడు బోధపడింది నాకు మా ఎదురుగా వచ్చే లారీలు ఎందుకు ఆగిపోయేవో.

సున (బళ్లారి)

* * *

## అమ్మా! టోపీయే!

(రెండవ బహుమతి)

అవి మేము చదువుచున్న రోజులు. అప్పటికి మా ఇంటి ప్రక్కనే ఒక కుటుంబము ఉండేది. వారికి 8 సం॥ ల అబ్బాయి ఉండేవాడు. మా ఊరిలోనే ఒక అతను తిరుపతి వెళ్ళుటవలనను, మరొకరు తల్లి పోవుటవలనను జుత్తు తీయించుకొని గాంధీగారి టోపీలను పెట్టుకొనిరి. వీరి టోపీలను చూచిన ఈ అబ్బాయి ముచ్చటగా తల్లివద్దకు వెళ్ళి "అమ్మా! టోపీయే!" అని మారాము చేశాడు. దానికి ఆవిడ "జుత్తు తీయించుకొన్నవారికే టోపీ కాని నీకేమిటని" అన్నారు. వెంటనే ఆ అబ్బాయి మంగలి షాపునకు పోయి సాఫ్‌గా గుండు చేయించుకొని ఇంటికి వచ్చాడు. అప్పుడు తిరిగి, 'నేను గుండు చేయించుకొని వచ్చాను. ఇక నాకు కూడా టోపీ కొను' అని ఆమెను అడిగాడు. ఆవిడ తెల్లబోయినది కుమారుని ఘనకార్యమునకు. ఇప్పటికీ ఆ అబ్బాయికి టోపీ ముచ్చట తీరలేదు. ఇది విని మేమందరము 'టోపీ ఇంకా కొనలేదా?' అని నవ్వుతూంటాం.

కుమారి వి. కృష్ణ (ఆలమండ)

* * *

## అరె! బచ్చేకొనికాల్

(రెండవ బహుమతి)

ఈ మధ్యను మా ఊరిలో "శ్రీకృష్ణరాయబారము" అను నాటక ప్రదర్శనము అతి వైభవోపేతముగా జరిగింది. నటవర్గములో భీముని పాత్ర ధరించిన షేక్ మస్తాన్ (సింహగర్జనతో) స్టేజీ మీదికి వచ్చాడు. స్టేజీమీదనే ప్రక్కన తన కుమారుణ్ణి (4 సం. లు) కూర్చోపెట్టాడు. భీముడు రౌద్రరస ప్రధానమైన పద్యము చదువనారంభించాడు. ఇంతలో ఆ చిన్నపిల్లవాడు ఆ సింహగర్జనకు అదిరిపడి "అబ్బా" (ఓ నాన్నా) అని కేక వేశాడు. భీముడు (మస్తాన్) తన పద్యమును సగములో ఆపి "అరె బచ్చేకో నికాల్" (ఒరే పిల్లవాణ్ణి తీరా) అని, వెంటనే తరువాతి సగమునుంచి పద్యమును చదువ నారంభించెను. ఆ వింతను చూసి ప్రేక్షకులంతా ఒక్కసారి గొల్లుమని నవ్వారు.

ఖా. ద. రహమతుల్లా (పామూరు)





# కథ కాక...

వక్కలంక రామారావు

పరధ్యాన్నంగా బూట్లు విప్పుకుంటున్న సుబ్బారావు 'సుబ్బా' అన్న సుభద్రమ్మగారి పిలుపుకు ఉలిక్కిపడ్డమాట వాస్తవం. నిజం చెప్పాల్సివస్తే సుబ్బారావుకు ఉలిక్కిపడటం కొత్తకాదు. ఆ మధ్య క్లాసులో శ్యామలవంక తదేకంగా చూస్తూ స్వప్నజగతిలో విహరిస్తుండగా లెక్చరర్ — "సుబ్బారావుగారూ! పాఠం ఇటు" అన్నప్పుడు నిజంగా ఉలిక్కిపడ్డాడు. అలాగే మరోసారి సినిమాలో శంకరం భుజంచరచి 'సుబ్బా' అనగానే ఉలిక్కిపడి మామూలు మనిషయ్యాడు. ఇలా లెక్కచూస్తే ఈసారి ఉలిక్కిపడటం వేలసంఖ్యలోనే వస్తుంది.

అయితే ఈసారి ఉలిక్కిపడటంలో ఒక కొత్తదనం ఉంది. ఇన్నాళ్ళూ ఉలిక్కిపడటంలో ఒకే తరహా ధ్వనిస్తుంది. కాని ఈసారి ఒక ప్రత్యేకమయిన ఆలోచనా సముద్రంలోంచి అమాంతంగా వచ్చి ఒడ్డున పడలేక తబ్బిబ్బై ఉలిక్కిపడ్డాడు. అయితే అతన్ని ఇంత అగాధంలోకి తీసుకుపోయిన ఆలోచన ఏమిటో తెలుసుకోవాల్సివుంది.

ఉండచుట్టి టేబిల్‌మీద పడేసిన ఒక పత్రిక ఫ్యాను గాలికి పురివిప్పుకుని గంతులేస్తూంది. పత్రిక చేతిలోకి తీసుకున్న సుభద్రమ్మగారు సుబ్బారావు మౌనానికి కారణం తెలుసుకోలేక అతని ముఖంలోకి ఒకసారి, పత్రికలో బొమ్మలవైపు మరోసారి చూశారు. సుబ్బారావు ముఖంలో మార్పులేదు. ఏదో తీవ్రమైన ఆలోచనలో కొట్టుకుంటున్నట్లుమాత్రం రూఢిగా చెప్పొచ్చు.

"సుబ్బా! ఏమిట్రా ఆ తెగని ఆలోచన ?" ఇది సుభద్రమ్మగారి ప్రశ్న.

"...... ఆఁ ఏమీ లేదు. ఆ పత్రికలో దీపావళి కథలపోటీ ప్రకటనపడింది. దానికి ఓ మాంచి కథ వ్రాసి పంపిద్దామని......"

"...... ఆలోచిస్తున్నానంటావు. దానికేం తరువాత చూడొచ్చుగాని ముందు భోజనానికి లే! పొద్దున్ననగా పోయావ్.... ఇప్పుడు రావటం మీ నాన్నగారు చూస్తే......"

"సర్లే, అది ఎప్పుడూ ఉండేదే! పద. అన్నం వడ్డించు"—సుబ్బారావు బట్టలు మార్చుకుంటూ అన్నాడు. సుభద్రమ్మగారు వంటింటివైపు వెళ్ళారు.

*        *        *

'సుబ్బారావ్! ఏం చదువుతున్నావ్?' అంటే 'బి. ఎ ఫైనల్ ఇయర్' అంటాడు సుబ్బారావు. అతడు తరచు అబద్ధాలాడతాడని కాలేజీలో ప్రచారమున్నా, ఈ విషయంలోమాత్రం అణుమాత్రంకూడా అబద్ధంలేదు. అయితే.. ఈమధ్య సుబ్బారావుకి జీవితమే ఓ సమస్యయి కూర్చుంది. 'ఇంతకీ నిన్ను అంతగా వేధించే సమస్య ఏమిటి సుబ్బారావ్?' అంటే .... "బద్ధకంగా నిద్దరోతున్న నా హృదయవీణను అలాఅలా మీటి రాగాలపన చేసి మేల్కొలిపి, మధురగానలహరిలో మత్తెక్కించిన మందగమన అందకుండా ఆటలాడిస్తే ఏ పురుషుడు సహించగలడు? నేనూ మామూలు మనిషినే!

జీవితాన్ని అల్లిబిల్లిగా అల్లుకుని, సమస్యలు సృష్టించుకుని, వాటినుండి విముక్తిపొందలేక అలమటించటం నాకు వేడుకకాదు. కాని ఎంత కాదనుకున్నా ఈ ఆలోచనలు నానుంచి దూరం కావటంలేదు; ఇంజనువెనుక రైలుపెట్టెల్లా నా మనసుతోపాటే వరుసగా పరుగెడుతున్నాయి..... నా హృదయవీణను మీటిన మందగమన 'శ్యామల'. ఆమె తొలిసారి నన్ను ఉద్దేశించి 'సుబ్బారావుగారూ! మీ జనరల్ నాలెడ్జి నోట్సు ఒకసారి ఇస్తారా' అన్నప్పుడు నా హృదయవీణ తీగెలు సవరించుకుని టివ్వుటివ్వులాడింది. నా వీణాగానానికి అదే తొలి నాదం. నా ఊహాజగతికి, నా ప్రేమసౌధానికి ఆనాటి ఆ పిలుపే పునాది. ఆ పిలుపులోనే మేడలు కట్టాను. కోటలు నిర్మించాను. కాని ఆపిలుపు...నేడు....అలా అలా దూరమైపోతుందంటే నే నేమైపోతాను? నా మేడలన్నీ పునాదులతో నేలమట్టం కావలసిందేనా....' చాలామంది సుబ్బారావును వాగుడుకాయ అంటారు. సుబ్బారావుకు కవిత్వం రాకపోయినా ఈ విషయంలో (బట్టీపట్టికావచ్చు) అనర్గళంగా మాట్లాడగలడు. ఈమాటే అతని ముఖంముందు అంటే 'ఏం చేయమంటావు? నా హృదయపరితాపవిముక్తికి అంతకంటే మరో మంచిమార్గంలేదు' అంటాడు. అంతటితో అతనితో కబుర్లకు ఓ అంతంటూ కలిగించకపోతే అది సముద్రంలా, లీనమవటానికి వేరే చోటులేక కొట్టుమిట్లాడిపోతుంది. అందుకే సుబ్బారావుతో ఎవరు మాట్లాడినా వీలయినంతలో తెంచుకుందుకు వీలుగా మాట్లాడతారు.

భోజనంచేసివచ్చిన సుబ్బారావు అరిచేతులు తుడుచుకుంటూ టేబిల్‌మీది సిగరెట్‌పెట్టె అందుకుని సిగరెట్ నోట్లోఉంచి నిప్పుముట్టించాడు. 'శ్యామల' పొడుగాటి శిరోజాల్లా సిగరెట్‌పొగలు పైపైకి పోతున్నాయి. 'ఒరేయ్! ఒరేయ్!! మీ నాన్నగారు చూస్తే కొంపమునుగుతుంది.. జాగ్రత్త' సుభద్రమ్మగారి హెచ్చరికకు మరోసారి ఉలిక్కిపడి 'నాన్నగారు వస్తూంటే కాస్తంత దగ్గు' అన్నాడు సుబ్బారావు.

'అలాగేకాని జాగ్రత్త సుమీ! ఆయనసలే కోపిష్టి మనిషి' అంటూ అటుగా వెళ్ళిపోయిందామె. మూడు సిగరెట్లు పరశురామప్రీతి అయినా అతని ఆలోచనకు ఓ ఒడ్డంటూ దొరకలేదు. 'ఇన్ని పత్రికలు చదివాను, ఇన్ని నవలలు చదివాను.. వెధనది ఒక్క ఐడియా, సింగల్‌థాట్.. ఛీ .... ఛీ దొరకటంలేదు. కథలు రాయటంలో ఇంత గీకాకుందని ఇంతవరకూ తెలియలేదు.... పోనీ పాతపత్రికల్లోది ఏదయినా కాస్తంత మొగ్గవేయించి ఓ కథంటూ తయారుచేస్తే సరిపోతుంది.....'

బీరువా తెరచి చూచిన సుబ్బారావు అయిదారు నిముషాలపాటు కొయ్యబొమ్మలా నిలబడిపోయాడు. నిన్ననే పత్రికలన్నీ అమ్మేసినట్లు గుర్తొచ్చింది. 'అయినా ఈమధ్య వెలువడ్డ సంచికల్లోవే కాపీ కొడితే మరీ దారుణంగా ఉంటుంది. సుబ్బారావు బుర్రకు మరోసారి పనిచెప్పాడు. గడియారం మరో గంట ముందుకు పోయేసరికి మరో రెండు సిగరెట్టు గుల్లలు నేలమీదకు వలస వచ్చాయి. అయినా ఎటూ ఆలోచన తెగలేదు. 'ఛీ. ఛీ. వ్రాయటం మానేస్తే సరి గొడవ వదుల్తుంది. ఈపిచ్చి ఆలోచనలతో చికాకెత్తిపోతోంది.' సిగరెట్‌పీకి నేలమీదకు విసురుతూ స్వగతంలో విసుక్కున్నాడు.

బీరువాఅద్దంలో తన ప్రతిబింబం తెల్లసూట్లో ముందుకొచ్చి తనవైపు చూసి వెకిలిగా నవ్వింది: "వెర్రివాడా! ఆలోచించాలిగాని ఇంతలోనే నిస్పృహచెందితే ఏమవుతుంది? నీ కథ పత్రికలో పడకపోతే శ్యామల నీకు ఎలా దక్కుతుందనుకున్నావ్? ఆ 'రామం' నాలుగు కథలు అల్లటం నేర్చుకునేగదా నిక్షేపంలా నీవంటే ఇష్టపడే శ్యామలను తనవైపుకు త్రిప్పుకున్నాడు. నీవు ఈ పోటీలో విజయం సాధించకపోతే ఆ విలన్ రామం బారినుండి నీ శ్యామలకు విముక్తిలేదు. శ్యామల లేనిదే నీ జీవితంలేదు. అది నేను వేరే చెప్పనక్కరలేదు. ఆలోచించు. శ్యామలను మనస్ఫూర్తిగా కోరుతున్నవాడివయితే కథ వ్రాయటం మానేయకు. ఐడియా కేమిటి! అదే తడుతుంది. మనసు మరోలా పోనీయకు. ప్రయత్నించు! ప్రయత్నించు!!" ప్రతిబింబం గర్జించింది.

సుబ్బారావు ఓ నిర్ణయానికి వచ్చేలోపునే మరో ప్రతిబింబం నల్లసూటు ధరించి డిస్నీ బొమ్మలా గంతులేస్తూ ముందుకొచ్చింది: "సుబ్బారావ్! కథలు వ్రాయటమంటే మాటలనుకున్నావా! అదేమంత సులువుకాదు. సులువయితే ఈ నరికి

—35 పేజి చూడండి

# ఆయుధపూజ!

వీరాజీ

ఇది యివాళ కాబోలు కవిత్వమ్
రేపు అవుతుందిలే నిజమ్
ఇది ఇవాల్టి కల
రేపు పండుతుందిలే ఇల.

ఆటమ్‌బాంబుతో వెలిగించు
నీ ప్రపంచంలో రాతిరుండదు
మారణాయుధాల శక్తి పిండి
మళ్లించు నదీ జలాలను పంటపొలాలకు.

నీ సైన్యాన్ని పిలిపించు
నీ హెచ్ బాంబు శక్తి నదిలించు
వైరాశ్యాన్ని చంపించు
నలుదిక్కులా శాంతి వెలిగించు.

నీ విమానాల నెగిరించు
రవాణా సౌకర్యాలు పెంచు
దూరాల మధ్య తేడాలు తెంచు
తేడాల మధ్య భేదాలు త్రుంచు.

నీ మరటాంకుల నదిలించి దున్ను
ఈ భూమాత పచ్చగా నవ్వు
నువ్వీ ఆయుధపూజ జరుపు
నిండు శాంతిసౌఖ్యాలు రేపు.

నువ్వీ ఆయుధపూజ జరుపు!
పండు మంచి పంటలు రేపు!!




**5-10-1962 శుక్రవారము మొదలు**
**11-10-1962 గురువారమువరకు**

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

భారం అనే విషయం తెలుసుకొని కూడా కార్య రంగంలో నిర్భయంగా ప్రవేశించగలుగుతారు. స్నేహితులు సమయంలో చక్కని సలహా ఇస్తారు. వారం ఆరంభంలో ధన సహాయం లోపించగల సూచనలు కనుపిస్తవి. దైవానుగ్రహంవల్ల ఏ విషయంలోను లోపం రాకుండా సమర్థించుకొంటారు. నరముల బలహీనతవల్ల అసౌఖ్యంతోనూ ఉంటుంది. వృత్తిలో శరీరక శ్రమకన్నా, మానసిక శ్రమ అధికం. మాటలలో పట్టుదలచూపి, జయం పొందవలసిన సమయం. ముందు మీ అంచనాలోలేని క్రొత్త ఖర్చులు పైన పడగల అవకాశాలున్నవి. ప్రయాణాలు సుఖంగా చేస్తారు. ఆప్తులవద్దనుంచి ఆశ్చర్యకరమైన వార్తలు తెలుస్తవి. పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. 5, 6 తేదులలో దైవకార్యాలు, సంఘంలో గౌరవం.

* * *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)**

నదిమందిలో మీ సమర్థతను చూపి పేరు సంపాదించుకొనగలుగుతారు. వృత్తి, వ్యాపారాలలో వచ్చే సాధారణమైన హెచ్చు తగ్గులు మిమ్ములను కొంత ఆందోళన పెడుతవి. వ్యవహార కార్యాలలో అధికారుల అనుకూలత లభిస్తుంది. విలువగల వస్తువులు కొంటారు. నౌకరులవంటివారితో పేచీలు తలెత్తగల సమయం. ధనాదాయం బాగుంటుంది. సాధ్యమైనంతవరకు ఎదటివారి మాటను కాదనకుండా నిబ్బరంతో కార్యం సాధించుకొని రాగలుగుతారు. కుటుంబంలో మీ కార్యక్రమాలలో కలిగే మార్పులు అశాంతికి కారణం అవుతవి. ఇతరులకు అప్పులు ఈయటంవంటి భారాన్ని వహించవలసి వస్తుంది. 10, 11 తేదులలో కార్యానుకూలత, ధనలాభం.

> **గ్రహస్థితి**
>
> కర్కాటకంలో కుజ, రాహువులు; కన్యలో సూర్య, బుధులు; తులా, వృశ్చికాలలో శుక్రుడు; మకరంలో శని, కేతువులు; కుంభంలో గురువు; వృశ్చిక, ధనుర్మకర, కుంభాలలో చంద్రుడు.

* * *

### మిధునం :

**(మృగశిర 3, 4 పా., ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ప్రస్తుతం తరచు ధన సంబంధమైన శ్రమ కలుగుతూ ఉంటుంది. వ్యవహార విషయాలలో మీ పనులను జాగ్రత్తగా నిర్వహించగల మిత్రులు లభిస్తారు. గౌరవంతో కూడిన కార్యక్రమాలలో పాల్గొంటారు. కాని, అందువల్ల వెంటనే ఫలితం కనుపించదు. కుటుంబ విషయాలలో ప్రత్యేకంగా లోపం కనుపించకపోయినా, మనస్సుకు నెమ్మది ఉండదు. ఈ సమయంలో స్థిరాస్తులు మొదలయినవి కొనటం, అమ్మటంవంటి పనులలో చిక్కులు రాకుండా చూచుకొనటం అవసరం. పుణ్యకార్యాలు జరుగుతవి. బాహ్య ఆడంబరంకోసం, అంతగా ప్రాకులాడతగిన సమయంకాదు. అజాగ్రత్తవల్ల వస్తువులు పోయే అవకాశాలున్నవి. 6, 7 తేదులలో శుభ వర్తమానాలు తెలుస్తవి. కొంతవరకు ఆదాయవృద్ధి.

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష.)**

ఈ సమయంలో లేనిపోని అనుమానాలతో మీ అభివృద్ధికి ఆటంకాలను తెచ్చుకున్నట్లుగా ఉంటుంది. సాహసం చేయలేకపోతారు. వృత్తిలో మీయందు ఈర్ష్య పెంచుకుని, కుయుక్తిగా మాట్లాడేవారు ఉంటారు. ఒక వ్యవహారం సవ్యంగా జరిగిందని అనుకొనే సమయంలో మరొక విషయంలో మెలిక పడుతూ ఉంటుంది. మొత్తంమీద శారీరకంగా సుఖం తక్కువ. విద్యా విషయాలలో ప్రోత్సాహం బాగుంటుంది. ఎక్కువమందిచేత నిర్వహింపచేయతగిన పనులలో శ్రమను సహించుకొని మంచి పేరు పొందగలుగుతారు. క్రొత్తవారితో స్నేహం సంపాదించే ప్రయత్నాలు సుముఖంగా కనుపించవు. సంఘ కార్యాలలో కార్యభారం తగ్గించుకొని, తటస్థంగా ఉండతగిన సమయం. 9, 10 తేదులలో పుణ్యకార్యాలు, సంచారంతో కూడిన కార్యక్రమాలు, అనారోగ్యం.

* * *

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

మాట నేర్పుతో ఎదటివారిని ఒప్పించుకొనగలుగుతారు. ప్రత్యేకంగా ధన విషయంలో అదృష్టం విశేషంగా కనుపించకపోవచ్చు. కాని, వృత్తిలో గొప్పదనం. కార్య నిర్వహణశక్తి బాగుంటవి. మీ బంధుమిత్రుల నిమిత్తం పూనుకొన్న ప్రయత్నాలు సక్రమంగా జరుగుతవి. తలవని తలంపుగా అనారోగ్యం చేసి, నెమ్మదిస్తుంది. మాటలలో బయటపడకుండా మీ శక్తిసామర్థ్యాలతో ముందుకు పోగలుగుతారు. ఒకటి రెండు సమయాలలో పట్టుదలను తగ్గించుకొని, రాజీ మార్గంలో మీ పనిని సాధించుకొనవలసి వస్తుంది. కుటుంబంలో సంతోష, సుఖాలు పొందగలుగుతారు. వీలునుబట్టి ప్రయాణాలను వాయిదా వేయటానికి ప్రయత్నించటం మంచిది. విలువగల వస్తువులను కొంటారు. 7, 8 తేదులలో స్వల్ప విషయాలలో మాట—పట్టింపులు, మానసికంగా అశాంతి.

* * *

### కన్య :

**(ఉత్తర 2, 3, 4 పా. హస్త, చిత్త 1, 2 పా.)**

ఏ విషయమైనా స్వయంగా నిర్ణయించగలిగే

మనస్సుకు తృప్తి ఉండదు. కార్యసిద్ధి పొందగలుగుతారు. వృత్తిలో క్రొత్త పద్ధతులను అనుసరించవలసిన అవసరం కలుగుతుంది. క్రమంగా శ్రమను తగ్గించుకొంటారు. ముందు పోటీని ఎదుర్కొనవలసినట్లు తోచినా, ప్రశాంతంగా జరిగిపోతుంది. ఎదురుచూస్తున్న వార్తలు ఆలస్యంగా అందగల సమయం. కుటుంబంలో శుభ సంతోషాలు, కార్యసిద్ధి పొందగలుగుతారు. కోర్టు, కచేరీలలో ఆటంకాలు తొలగి, స్వేచ్ఛగా ముందుకు వెళ్ళటానికి తగిన మార్గాలు ఏర్పడుతవి. ఖర్చులు విశేషంగా ఉంటవి. కాని, సంతృప్తికరంగా వినియోగపడుతుంది. వారాంతంలో చోరభయం కనిపిస్తుంది. విశ్రాంతి ఉండదు.

* * *

## తుల :

**(చిత్తి 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

పరిస్థితుల ననుసరించి దూరంగా ఉందామని ఎంత ప్రయత్నించినా, ఏదో ఒక విధంగా మాట పడవలసి వస్తూ ఉంటుంది. బంధువులు మంచి మాటలతో మీపైన పెత్తనం చేయటానికి చూస్తారు: "అంత్య నిష్ఠురంకన్నా, ఆదినిష్ఠురం మేలు" అనే విషయం మరచిపోవద్దు. సంఘంలో పేరు బాగుంటుంది. ఇతరులతో కలసి చేయు వృత్తులలో మనశ్శాంతిగాని, ఫలితంగాని అంతగా కనుపించవు. పేరు నిమిత్తం ప్రాకులాడవలసివస్తుంది. స్వయంగా విద్యాబుద్ధులను వినియోగించి, గౌరవం పొందగలుగుతారు. స్థిరాస్తులవంటి వాటిమీద డబ్బును వినియోగిస్తారు. మీరు బంధుమిత్రులతో మాట్లాడే సందర్భాలలోగాని, ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాయటంలోగాని నిగ్రహంతో ఉండవలసిన సమయం. ప్రయాణాలు చేస్తారు. ఆదాయం మామూలుగా ఉంటుంది. 8, 9 తేదులలో శ్రమ, గౌరవప్రాప్తి.

* * *

## వృశ్చికం:

**(విశాఖ 4–వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

ప్రస్తుతం గ్రహస్థితి సంతృప్తికరంగా కనుపించదు. ఒకసారి చేసిన పనినే తిరిగి చేయవలసివస్తూ ఉంటుంది. రావలసిన ధనం వెంటనే పూర్తిగా రాదు. కుటుంబంలోనివారితో చిన్న చిన్న పేచీలువచ్చి, సమసిపోతూఉంటవి. అయితే ఏ వ్యవహారంలోను భంగం కలుగదు. కాని, ఆటంకాలనుదాటుకుంటూ ముందుకు పోవలసివస్తుంది. మీ ఆంతరంగిక కార్యకలాపాలు బయటవారి చెవికి పోకుండా జాగ్రత్త వహించండి. ఉత్తరదిశనుంచి శుభవార్తలు తెలుస్తవి. ఉద్యోగ వృత్తులలో ఉత్సాహకరమైన వాతావరణం కనుపిస్తుంది. ఏ సమయంలో నెరవేర్చవలసిన పనిని ఆ సమయంలో జాగ్రత్తగా నిర్వహిస్తారు. దేహసౌఖ్యం గురించి జాగ్రత్తగా ఉండండి.

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

క్రొత్త పనులను సాగించటానికి ప్రస్తుతం ఆసక్తి అంతగా ఉండదు. తగినట్లు అవకాశాలు కూడా తక్కువ అని చెప్పవలసిఉంటుంది. కాని, సమయంలో తోటివారి ప్రోత్సాహం లభిస్తుంది. ప్రయాణాలు అనుకూలిస్తవి. గొప్పవారి స్నేహము, సహాయము పొందగలుగుతారు. పిల్లల ఆరోగ్యం గురించి మాత్రం జాగ్రత్తగా యుండవలసిన సమయం. మీ ప్రధాన కార్యకలాపాలకు, అనేక ఇతర ఆలోచనలు అడ్డు వస్తూ ఉంటవి. అయితే ఈశ్వరానుగ్రహంవల్ల అపవాదులు లేకుండా మీ మాటను కాపాడుకొంటారు. లాటరీ, చట్టావ్యాపారం మొదలయిన వాటిలో చేయిపెట్టవద్దు. ఈ సమయంలో ఇతరుల చేతికి పోయిన వస్తువులుగాని, డబ్బుగాని తిరిగి సులభంగా వస్తుందనే ఆశ పెట్టుకోవద్దు. సంఘకార్యాలు, రాజకీయాలు మొదలయినవాటిలో చికాకు తోస్తుంది. 10, 11 తేదులలో శుభవార్తలు, ఇష్టవస్తు లాభము.

* *

## మకరం .

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

వృత్తికి సంబంధించిన ఏ పనిలోనూ సులభంగా ముందుకు పోవటం జరుగదు. శక్తికిమించిన శ్రమ, అనవసరమైన మెలికలు, పేచీలు వస్తూ ఉంటవి. ఏదైనా ఒక పని పూర్తిచేసి, ఫలితం అందుకొనేవరకు సందేహం కలుగుతూ ఉంటుంది. అయితే గ్రహబలం బాగున్నది. వ్యవహార రంగంలో లాభం కలుగుతుంది. మీ ఆరోగ్యంమాత్రం తలవని తలంపుగా మార్పు చెందవచ్చు. శుభవార్తలు తెలుస్తవి. ప్రస్తుతం ఎవ్వరినీ, ఏవిధమైన సహాయము కోరతగిన సమయంకాదు. మీరు నిర్వహిస్తున్న కార్యక్రమాలలో జరిగే పొరపాట్లు అకస్మాత్తుగా మిమ్ములను ఆందోళన పరచగల అవకాశాలున్నవి. శుభకార్య ప్రయత్నాలు చురుకుగా సాగవు. ప్రసంగాలలో పట్టుదల చూప తగిన సమయంకాదు.

* * *

## కుంభం :

**(ధనిష 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

క్రమక్రమంగా మనశ్శాంతి లభిస్తుంది. వృత్తి, వ్యాపారాలలో నిలకడ, అభివృద్ధి సూచనలు చక్కగా ఏర్పడుతవి. కుటుంబంలో కూడా శుభ సూచనలు కనుపిస్తవి. మీ పద్ధతులను, సలహాలను తోటివారు అనుసరిస్తారు. అవసరానికి తగినంత ధన సహాయం లభిస్తుంది. సంఘ కార్యాలయందు ఉత్సాహం తగ్గదు. తరచు పెద్ద మనుష్యులను కలుసుకొనగలుగుతారు. అకస్మాత్తుగా శుభ లాభవార్తలు తెలుస్తవి. వారం రెండవ భాగంలో కుటుంబంలోనివారికి అనారోగ్యం చేస్తుంది. అధికారులవలన మాట రాకుండా చూచుకొనటం అవసరం. సాధ్యమైనంతవరకు పోటీ పడకుండా ప్రశాంతంగా ఫలితం పొందటానికి ప్రయత్నం చేయండి. 8, 9 తేదులలో ప్రయాణ సూచనలు, ధన వ్యయం.

* *

## మీనం .

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

మీ ఆలోచనలకు, అనుభవానికి పొలిక తక్కువ. ముందు ఏమి జరుగుతుందోనని ఎదురుచూస్తూ ఉండవలసి వస్తుంది. ప్రయోజనంలేని మాటలతో కాలక్షేపం అవుతూ ఉంటుంది. వృత్తిలో మీకు అనుకూల సూచనలు కనిపిస్తూ ఉంటవి. ప్రత్యక్షంగా ఫలితం తక్కువ. అందు నిమిత్తం మీ ప్రయత్నాలు మాత్రం తప్పవు. పదిమంది మిమ్ములను గౌరవిస్తూ మాట్లాడతారు. ఏ సందర్భంలోను అప్పుల భారం పైన పెట్టుకొనటం మంచిదికాదు. దైవకార్యాలు, పుణ్యకాలక్షేపాలు మొదలయినవాటియందు పాల్గొంటారు. మానసికంగా ఉద్రేకం కలిగే అవకాశాలు ఏర్పడుతవి. సమయంలో నిబ్బరంతో ఉండటానికి ప్రయత్నించండి. ★

---

## ఈ వారము ధరలు

బంగారుధర కొద్దిగా తగ్గే సూచనలున్నవి. వెండిధర నిలకడగా ఉంటుంది. వేరుశనగపప్పు ధర క్రమంగా పెరుగుతుంది. వేరుశనగనూనె ధర పెరిగి, కొంచెం తగ్గుదల వస్తుంది. నూవులధర వారం రెండవ భాగంలో మందీ వస్తుంది. ప్రత్తిధర పెరుగుతుంది. నూలు ధర ముందు పెరిగి, తరువాత తగ్గే అవకాశాలున్నవి. మిర్చిధర నిలకడగా ఉంటుంది.

---

"నువ్వు రైలుక్రింద బుర్ర పెడ్తనని పోయావుటగా! తిరిగి వచ్చేశావేమ్ ?" నిరాశరావు మొండి శంకరాన్ని అడిగాడు. "ఏం చేయను?...ఆ రైలు వేళకి రాలేదు. పైగా, నేను ఇన్సూర్ చేయలేదని కూడా జ్ఞాపకం వచ్చింది, వచ్చేశా" నన్నాడు మొండి శంకరం.

పి. విద్యారాణి (బెజవాడ)

# కాల్గేట్ వాడి నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి రోజంతా దంతక్షయం రాకుండా కూడా కాపాడుకోండి!




ఎందుకంటె : ఒక్క సారి తోముకొంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే ఆపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని, దంత శాస్త్రచరిత్రలో పూర్వము ఎన్నడూ తెలియనే యనంతటా శాస్త్ర పరిశోధనల ఫలితముగా నిరూపించబడినది!

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమంతప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని చురుకైన నురుగు పళ్లమధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లిపోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది!

పిల్లలు కాల్గేట్‌తో పళ్లుతోము కొనుటకు యిష్టపడతారు. ఎందుకంటె చాల పేపు ఉండే దాని పిప్పరమెంటు వంటి రుచి అంటే వారికి ప్రీతి!

కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే

- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




**నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్ల తోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్ నే ఎక్కువ మంది వాడుతున్నారు**





## ధన్యుడైన పతి?

పతి మాటకు ఎదురాడక—
సతతము 'పతిసేవా ధర్మము' నాచరించి
కుతుకముతో పూజచేయు
పతియే భూతలమున ధన్యుడు సుమతీ!
అరుణోదయ కాలము నే
పొరుగింటి 'పిన్ని'కడకు రయమునబోయి
అరువుగ కాఫీ పొడి —
సరమరిక లేక తెచ్చు పతి పూజ్యుడు
మహిలో!
నలభీమ పాకశాస్త్రము —
తెలియని గృహమేధయు — సోషల్
క్లబ్బులలో
కిలకిల మనుచు తిరుగని—
ఇల్లాలును అనాగరికములు — గదరా
వినగా!

వరసు (వెలంపాలెం)

## లౌక్యం

స్నేహితుడు శేషయ్యకి
బాగున్నావా అని అడుగుతూ
భక్తవత్సలావు రాసేది.
అన్నమాట ప్రకారం
ఆ నౌకరీ మనవాడికి
ఒచ్చేటట్టు చూసేది
ఈ సాయం మర్చిపోక
పట్టుబట్టి చేసేది
కుర్రవాడు బీదవాడు
మనకెంతో అయినవాడు
మొన్ననే మెట్రిక్కు హాజరయ్యాడు
కాని రెంటిలో తప్పిపొయ్యాడు (పాపం!)
ఏదో ఈ మేలు చేస్తే
వీడికే ఆ నౌకరి వేస్తే
పాపం వాడి కో దారి
చూపించిన వాడివవుతావు
ఓ అశ్వమేధం
చేయించిన వాడివవుతావు
అన్నట్టు అరుంధతీ అన్నదాతా
బాగున్నారని తలుస్తా
ఇంతకీ మా అమ్మాయిని
మనవాడి కిద్దామ నుంది
దయఉంచు మళ్లీ వస్తాను

వత్సల (నరసారావ్‌పేట)

## స్త్రీలకు మాత్రమే!

ఆదిని ఒక్క నలుడు
మరొక్క భీముడు పప్పులో
వేలు వేసిన నేరానికి
మై గుడ్నెస్! హే నలా!
హే భీమా!!

వారం వారం తెనుగు ఇంట
హామేషా తమాషాగా
అడపా తడపా మగ వంటేనా?
చెయ్యి కాల్చుకోడం రాకనేగా,
మీకోసం అంటే స్త్రీలకు మాత్రమ్

ఎలక్ట్రిక్ హీటర్ చేశాం
కుక్కర్ టోస్టర్ తెచ్చాం
ఫ్రిజిడైర్ కనుగొన్నాం
వాక్యూమ్ క్లీనర్ కొనిపెట్టాం.
అడపా తడపా నగా నట్రా
ఎట్ సెట్రా ఎక్స్ట్రాగా కొంటాం.

అంతేనా స్కూటర్ మీ కోసం
నైలాన్ షిఫాన్లు మీ వేషం
స్నోలూ పవుడర్‌లూ మీ సొంతం
లిప్‌స్టిక్ మేం వాడే వాడమ్.
ప్లాస్టిక్ తట్టలు మీ 'షాపింగ్'కి
హైహీల్ చెప్పులు మీ 'వాకింగ్'కి
రైల్లో పెట్టెలు బళ్లో బల్లలు
అట్టేపెట్టేం వేరే మీకేనని.
ముఖపత్రంపై మీదే అందం
నడిపత్రంలో మీదే చందం
వెండిమాపాయికి మీ పేరే అసలు
పేరు
వెండితెరకు మీరే చాలు 'పది
వేలు'

అసలీ మగాళ్ల ప్రపంచంలో
మీ నోరు చెలాయించే జోరు
మై గుడ్నెస్! దాని సంగతే వేరు
దాని పూసెత్తకుంటేనే మేలు.

[రహస్యం]
అసలీ రోజుల్లో ఫ్యాషన్ మగ వంటే!
పై మాటలు సరదాకన్నా నంతే!!

క్రిష్ణానంద్. ★




చిత్రకారుడు: దేవ (హైద్రాబాద్)



మధ్యాహ్నం పదకొండు గంటలయింది. సీతారామయ్యగారింట్లో పిల్లా, పెద్దా అంతా భోజనాలు ముగించివచ్చి, హాల్లో కూర్చున్నారు. సీతారామయ్యగారు వాలుకుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటున్నారు. ఆయన భార్య వెంకమ్మాంబ భర్త కుర్చీ ప్రక్కనే కూర్చుని తమలపాకులకు సున్నం రాసి భర్తకి అందిస్తున్నారు.

రాధ ఒకవార గోడకి చేరగిలబడి, కూర్చొని ఏదో పత్రిక చదువుకుంటున్నది—రాధ సీతారామయ్యగారి పెద్దకూతురు. క్రిందటి సంవత్సరమే పెళ్లి అయింది. తక్కిన ఇద్దరు పిల్లలు—రామం, రవి ఆడుకుంటున్నారు.

అంతవరకు తీక్షణంగాఉన్న ఎండ హఠాత్తుగా పోయి, మబ్బు పట్టింది. కొన్ని నిముషాలలోనే మబ్బులు దట్టమయి, వర్షం మొదలెట్టింది. వాన మొదట చినుకులుగ ప్రారంభించినా, రాను రాను ఎక్కువ కాసాగింది.

ఇంత హఠాత్తుగా పట్టుకున్న వాననిచూచి, వెంకమ్మాంబ చిరాకు పడ్డారు. "అంతా దొంగవాన. హఠాత్తుగ ముంచుకొచ్చింది. ఎప్పుడు తగ్గుతుందో ఏమో! ఇంకా చేయవలసినవి చాల పనులున్నాయి" అని విసుక్కుంటూ లేచివెళ్ళి కిటికీ తలుపులు మూశారు, జల్లు లోపలికి కొడుతుందేమోనన్న భయంతో. జల్లు కొట్టనే కొట్టింది. తలుపు సందుల్లోంచి.

ముఖంమీదపడ్డ నీటి చినుకులను తుడుచుకుంటూ, వెంకమ్మాంబ భర్త కుర్చీప్రక్కన చదికిలబడ్డారు.

"ఏమండీ! పండుగకి అల్లుడి కివ్వడానికి బట్టలు కొంటానన్నారుగా. ఇంకా ఎప్పుడు కొంటారు?" అని అడిగారు.

"మధ్యాహ్నం బండికి వస్తాడుగా. అతడు వచ్చాక, అతని కిష్టమైన బట్టలే కొందాం" అని మరలా పేపరు చదవడంలో మునిగిపోయారు ఆయన. తలవంచుకొని పత్రిక చదువుకుంటున్న రాధ, తన భర్త ప్రసక్తిరాగానే ఒక్కసారి తలఎత్తి చూసి, మళ్ళీ తలదించేసుకుంది.

"ఈ వర్షం ఇంకా ఇలాగేవుంటే స్టేషనుకు వెళ్ళి, బావను తీసుకురావడం చాల కష్టమమ్మా. రోడ్లన్నీ బురదగా ఉంటాయి. అదీగాక, మనింట్లో గొడుగు కూడాలేదు" అన్నాడు ఒకమూల కూర్చుని తమ్ముడితో ఆడుకుంటున్న రామం.

సీతారామయ్యగారు పేపరు చదవడం పూర్తి చేశారు. దాన్ని ప్రక్కనున్న టేబిలుమీద పడేస్తూ, ఆయన అన్నారు:

"ఈవాన ఇంకా ఎంతోసేపు ఉండదులే. వెలిసిపోతుంది. వాన తగ్గకపోతే నువ్వు వెళ్ళనక్కరలేదులే. రిక్షాలోవచ్చేస్తాడు ఇంటికి. ఇల్లు తెలుసుగా."

వెంటనే అందుకొని రామం, "ఏమో స్టేషనుకు వెళ్లకపోతే బావకి కోపం వస్తుందేమోనని. బావకి వచ్చినా, రాకపోయినా, అక్కయ్యకుమాత్రం వచ్చేస్తుంది ఎక్కడలేని కోపం" అన్నాడు నవ్వుతూ.

రాధకి ఉక్రోషం వచ్చేసింది. "నువ్వు వెళ్ళనవసరం లేదులేరా" అంది. ఆ ఉక్రోషం అంతా ఆమె మాటలలో ధ్వనించింది.

అంతా నవ్వుకున్నారు. ఈ విషయాలన్నీ తన కనవసరమన్నట్లు చిన్నవాడు ఆడుకుంటున్నాడు. వాడి మనస్సు ఇపుడు కాగితపు పడవలమీదేవుంది. వర్షానికి వాళ్ల పెరట్లో చేరిన నీటిలో కాగితపు పడవలతో ఆడుకోవాలని వాడి ఉబలాటం. అందుకే తలెత్తకుండా కాగితాలతో పడవలుచేసి పారేస్తున్నాడు.

సీతారామయ్యగారు మెల్లగా కిటికీ దగ్గరకు వెళ్ళి, తలుపులుతెరచి, బయటకు తొంగిచూశారు. వాన జోరుగానే కురుస్తోంది. కాగితపు పడవలు పట్టుకొని, అంత వర్షంలోను పిల్లలు ఇళ్లనుండి బయటకువచ్చి, సైడు కాలవలలో వదలుతున్నారు. ఆ పడవలు కొంతదూరం వెళ్లేటప్పటికే తడిసి ముద్దయి మునిగిపోతున్నాయి. వాటిని మునగకుండా చేయడం ఆ పసిపిల్లలకు చేతకావటంలేదు. కాని వాళ్లకి చేతనయింది ఒక్కటే—పాత పడవలు మునిగి మునగకముందే క్రొత్త పడవలుతెచ్చి, నీళ్లలో వేయడం.

ఇదంతా చూస్తుంటే సీతారామయ్యగారికి తన చిన్ననాటి ఆటలు గుర్తుకు వచ్చాయి. అప్పుడు కాగితం పడవలు చేయడంలో తనే ఫస్టు. ఓహో! ఎన్నెన్ని రకాల కాగితపు పడవలు చేసేవాడో తను!

అవి తలచుకుంటే ఆయన కిప్పుడు పడవలు



[illegible]లని కోరిక పుట్టింది. వెంటనే ఒక కాగితం తీసికొని, పడవ చేయబోయారు. ఎన్ని తంటాలు పడినా కుదరలేదు. ఇంతలో చిన్న పిల్లాడు రవివచ్చి ఆయన చేతిలోని కాగితాన్ని తీసుకున్నాడు.

ఆయన సంభ్రమంతో చూస్తున్నారు.

రవి మూడు నిముషాలలో పడవని తయారు చేశాడు.

సీతారామయ్యగారికి ఆశ్చర్యంతోపాటు నవ్వు వచ్చింది.

చిన్నప్పుడు తను చేసిన పనే ఇప్పుడు చేయబోతే కుదరలేదు!

ఇంతలో "టెలిగ్రాం సార్!" అని బయట నుండి పోస్టుమేన్ కేక వేశాడు.

రెయిన్‌కోటు, నెత్తిమీద టోపీతో పోస్టుమేన్ గుమ్మంవరకు వచ్చి మరలా కేక వేశాడు. సీతారామయ్యగారు సంతకంచేసి టెలిగ్రాం అందుకున్నారు.

టెలిగ్రాం అను కేక వినబడగానే వంటింట్లో ఉన్న వెంకుమాంబ, రాధ—అందరూ హాల్లోకి పరుగెత్తుకొని వచ్చారు. అది ఎక్కడినుండి వచ్చిందో నను కుతూహలం వాళ్ల ముఖాలలో ప్రస్ఫుటమవుతోంది.

సీతారామయ్యగారు కవరుచింపి చదివారు. ఆయన వేడి నిట్టూర్పు విడిచి వాలుకుర్చీలో కూలబడ్డారు.

అదిచూసి వెంకుమాంబ గాభరాపడ్డారు. "ఎక్కడనుండండి టెలిగ్రాం" అని అడిగారు.

"అల్లుడి దగ్గరనుండి"

దానితో రాధ గాభరా ఎక్కువయింది.

"సెలవు దొరకలేదు. నేను వచ్చుటకు వీలు పడదు" అని వ్రాశాడు అల్లుడు" అన్నారు సీతారామయ్యగారు నిట్టూర్పుతూ.

తెల్లగానున్న రాధమ్ముఖం ఎర్రబడింది. వెంకుమాంబ ఇంకా ఆశ్చర్యంనుండి తేరుకొనేలేదు. సీతారామయ్యగారు వాలుకుర్చీలో వెనక్కి జేరగిలబడ్డారు. ఆయన కుర్చీప్రక్కనే నేలమీద చదికిలబడ్డారు వెంకుమాంబ.

సీతారామయ్యగారు రాధవైపుచూచి అడిగారు. "ఏవమ్మా! నీతో ఏమని చెప్పాడు మీ ఆయన. పండుగకు వారంరోజులు సెలవుపెట్టి ముందుగానే వస్తాననికదూ! అలాగ అనేకదా! నిన్ను పదిహేనురోజులు ముందుగ పంపేడు. నాకు కూడ వ్రాశాడుగా. ఇవాళ మధ్యాహ్నం ఇక్కడకు వస్తానని. మళ్లీ ఇప్పుడు ఈ టెలిగ్రాం ఏమిటి!"

ఏమోనాన్నా. 'ఆఫీసరు చాల మంచివాడు. తప్పకుండా సెలవు దొరుకుతుంది' అన్నారు" అంది రాధ.

"ఈ ఆఫీసర్లు బొత్తిగ హృదయంలేనివాళ్ళు అయిపోతున్నారు. పండుగకు అత్తవారింటికి వెడతామన్నా సెలవు ఇవ్వరు" అని అన్నారు వెంకుమాంబ.

"సెలవు దొరికితే ఎందుకురాడు?" సీతారామయ్యగారు అన్నారు.

వెంకుమాంబకి సందేహాలు పుట్టుకొచ్చాయి. అల్లుడికి ఏమేనా కోర్కెలున్నాయేమోనని. ఆ మాట గట్టిగా అన్నారు.

"ఏమే నా కోరికలేవో!" అని.

"ఏమైనా కోరికలువుంటే నూటిగ అడగవచ్చుగా! మాకువీలైతే ఇస్తాము" అని సీతారామయ్యగారు రాధవంకచూచి అడిగారు. "నీతో ఏమైనా చెప్పాలా అమ్మా?" అని.

"నాతో ఏమీ చెప్పలేదు.....కాని....." నసిగింది రాధ.

"సరిగ్గా చెప్పమ్మా రాధా."

"చాల కాలమైె, సైకిలు కొనుక్కుందామను కుంటున్నారు. ఆఫీసు చాల దూరం. అంతదూరం రోజూ నడిచివెళ్ళడం ఇబ్బందిగావుంది. అందుచేత ఏదో ఒక సైకిలు వెంటనే కొనుక్కోవాలని అనుకుంటున్నారు. కానీ వీలుపడటంలేదు. మరి సైకిలు కావాలని కోరిక కాబోలు, ఏమో. నాతో ఏమీ చెప్పలేదు.

"ఒకసారిమాత్రం అన్నారు. మీ నాన్న నాకు సైకిలు ఇవ్వరా అని. హాస్యమేమో అనుకున్నాను" అన్నది రాధ.

అల్లుడి కోరికవిని నిర్విణ్ణులయ్యారు సీతారామయ్యగారు. సైకిలు కొనడం అంటే మాటలుకాదు. అధమపక్షం రెండు వందలయినా. ఉండాలి తన దగ్గర ఇప్పుడు అంత డబ్బులేదు......ఇప్పుడేమిటి? ఎప్పుడూ ఉండదు. ఎలా ఉంటుంది? వచ్చింది తిండికి, బట్టకే బొటాబొటీగ సరిపోతుంది. వెనుక వెయ్యడానికి ఎలా వీలుపడుతుంది?

పండుగకు అల్లుడికి, కూతురుకూ బట్టలు కొనడానికి స్నేహితుని దగ్గర అరవై రూపాయలు అప్పుతెచ్చారు. ఇంకా ఆ బట్టలు కొననేలేదు. దానిపై ఇంకో నూటయాభై ఉంటేనేగాని, సైకిలురాదు. అంత డబ్బు తన కిప్పుడు ఎక్కడనుండి వస్తుంది?... ఏమిటి చెయ్యడం ఇప్పుడు?......

సీతారామయ్యగారు మౌనంగా కూర్చుని ఆలోచిస్తున్నారు. ఆయనకు తన పెళ్ళయిన క్రొత్తలో జరిగిన సంఘటనలు గుర్తుకు వచ్చాయి.....

తన మామగారు ఏమంత డబ్బు ఉన్నవాడు కాదు. ఏదో సంసారపక్షంగా జీవయాత్ర సాగించుతున్నవాడు. తనకు పెళ్ళికి కానుకగా ఇస్తానన్న రేడియో పెళ్లిలో ఇవ్వలేక తరువాత ఇస్తానన్నాడు. తను సరే ననక తప్పిందికాదు.

కానీ, వీలుపడక సంవత్సరం దాటినా రేడియో ఇవ్వలేకపోయాడు ఆయన. తనకు కోపం వచ్చింది.

ఆ ఏటి సంక్రాంతికి రమ్మని తనకు ఉత్తరం వచ్చింది మామగారి దగ్గరనుండి. ఆఫీసునుండి ఇంటికి రాగానే తను వెంకుమాంబకి చెప్పాడు ఉత్తరం గురించి. ఆవిడ చాల ఉత్సాహంగానేవుంది పుట్టింటికి వెళ్దామని. కాని, తను మాత్రం, "ఆ! నువ్వు ఎప్పుడూ ఇంతే. పుట్టింటికి వెడదామని సరదాయే గాని, నా సంగతి పట్టించుకోవు" అన్నాడు విసుక్కుంటూ.

ఆవిడ చాల నొచ్చుకుంది తన మాటలకి. తను అన్నాడు, "మీ నాన్న క్రిందటి సంవత్సరమే రేడియో ఇస్తానన్నారు. కాని, ఏది? ఇంతవరకు ఇవ్వలేదు. ఈసారి ఆ రేడియో ఇస్తేనేగాని, నేను రాను. కావలసి వస్తే నువ్వు వెళ్ళు. నేనుమాత్రం రాను."

పాపం. ఈ విషయం తెలిసి నానా తంటాలుపడి రేడియో కొన్నాడు తన మామగారు.....

# వాన వెలిసింది

పాత సంఘటనలను తలచుకోగానే సీతారామయ్యగారికి సిగ్గువేసింది. ఎదురుగా టేబిలుమీదనున్న రేడియో అతని సిగ్గును అధికం చేసింది.

సీతారామయ్యగారికి అంత విషమ పరిస్థితిలోను నవ్వు వచ్చింది! అల్లుడుగా తను మామగారిని వేధించుకొని తిన్నాడు. ఇప్పుడు తన అల్లునివంతు కోరికలు కోరుకోవడానికి.....

వెంకుమాంబ పిలుపుతో, ఆలోచనలలోంచి తేరుకున్నారు సీతారామయ్యగారు. ఆయన్ని ఉద్దేశించి ఆవిడ అన్నారు.

"ఎలాగైనా అప్పో సొప్పోచేసి కొనాలండి సైకిలు. తప్పదు. పండుగకి అల్లుడు ఇంటికి రాకపోతే ఎలాగ? ఇదేగా మొదటిసారి. అల్లుడు రాకపోతే అమ్మాయి బాధపడదూ?"

రాధకి నిజంగానే దుఃఖం ఆగలేదు. గదిలోనికి వెళ్ళిపోయింది.

ఆమెనుచూస్తే సీతారామయ్యగారికి కూడ దుఃఖం ఆగలేదు. మాట్లాడలేకపోయారు.

వెంకుమాంబ 'టేబిలు దగ్గరకువెళ్ళి, డ్రాయరులోనుండి పెన్నూ, కాగితంతెచ్చి సీతారామయ్యగారికిస్తూ, "అల్లుడికి ఉత్తరం వ్రాయండి. "నీ కోరిక అమ్మాయి చెప్పింది. దాని ప్రకారమే సైకిలుకొని ఇస్తాము. పండుగకు తప్పక రమ్మని వ్రాయండి" అన్నారు.

సీతారామయ్యగారు ఒక వేడి నిట్టూర్పు విడుస్తూ పెన్నుకేపు తీశారు, అల్లుడికి ఉత్తరం వ్రాద్దామని. 'చిరంజీవికృష్ణారావుకు' అనిమొదలుపెట్టారుఉత్తరం.

దూరాన రైలుబండి కూత పెట్టింది.

"వస్తే ఈ బండిలోనే వచ్చేవాడు అల్లుడు" అని బిగ్గరగానే అన్నారు వెంకుమాంబ.

సీతారామయ్యగారు ఉత్తరం వ్రాస్తున్నారు.

బయట వాన కొంచెం తగ్గినట్లుంది. వీధి గేటుదగ్గర రిక్షా ఆగిన చప్పుడయింది. సీతారామయ్యగారు, వెంకుమాంబ ఆతృతగా వీధివైపు చూశారు. రామం పరుగెత్తుకొనివెళ్ళి వీధి తలుపుతీసి చూశాడు.

"బావ వచ్చాడ్రోయ్" ఒక్కకేకపెట్టి వీధిలోకి పరుగెత్తాడు.

అందరూ వీధిగుమ్మంవరకు వచ్చారు.

ప్రక్కగదిలోఉన్న రాధ మాత్రం రామం హాస్యం ఆడుతున్నాడేమోననుకుంది. కాని, హాల్లో భర్త మాటలు వినబడి, హాలు గుమ్మంవరకు వచ్చింది.

నిజంగానే వచ్చారు! రాధ మనస్సు తేలిక పడింది.

వెంకుమాంబ అడిగారు అలుడిని. "ఏం నాయనా, టెలిగ్రాంలో అలా వ్రాశావేం?" అని.

"హఠాత్తుగ మీకు కనబడాలని అనుకున్నానండీ" అన్నాడు కృష్ణారావు.

"అలా చేయబట్టే బావగారు ఇప్పుడు వానలో తడియవలసి వచ్చింది" అన్నాడు రామం నవ్వుతూ.

అంతా నవ్వుకున్నారు. కృష్ణారావు ఎవరూ చూడకుండా రాధవైపుచూసి వెక్కిరించాడు. రాధ మాత్రం తక్కువదా! తిరిగి వెక్కిరించి వెనుదిరిగి గదిలోకి పారిపోయింది.

"ఎలాగైనా కొంటెవాడివోయ్ కృష్ణారావూ!" అన్నారు సీతారామయ్యగారు.

వాన పూర్తిగ వెలిసింది.



## కథ కాక

26-వ పేజీ తరువాయి

ప్రతిఒక్కరూ వ్రాసేఉండేవారు. అంతా వ్రాస్తే ఇక వాటిని ప్రచురించేదెవరు? ఒకవేళ ప్రచురిస్తే చదివే పాఠకోత్తము లెవరు? అందులోనూ నీవు పంపదలుచుకున్నది పోటీకి. పోటీకంటే ఎన్ని వేల రచన లొస్తాయో తెలుసా? అందులో నీ అనుభవంలేని రచన అడుగున పడిపోవటంలో ఆశ్చర్యం లేదు. తీరా కథ పంపాక పడుతుంది, పేరొస్తుంది, ప్రైజం టొస్తుంది అంటూ ఎదురుచూడటం; అదికాస్తా మరొకరు తన్నుకుపోవటం, దారిని పోతుంటే 'సుబ్బారావ్! నీ కథ అడుగున పడిపోయిందేమిరా' అని పదిమందీ అడగటం, నీవు ముఖంమీద జేబురుమాలు కప్పుకుని లేనినవ్వు తెచ్చుకుని 'అది అంతేలే' అని పెదిమలు చప్పరించటం. ఇంతేనా ఇంతకంటే జరిగేదేమయినాఉందా? నా మాట విని, ఈ కథలల్లటం గురించి మరేమీ ఆలోచించి కాలం, బుర్ర పాడుచేసుకోకు. మరోలా ఆలోచిస్తే శ్యామలను పొందటానికి, ఆమెఅభిమానం సంపాదించటానికి ఇంతకంటె సులువయిన మార్గాలు కనుపించకపోవు." ఈ ప్రతిబింబం ఆజ్ఞాపిస్తున్నట్లు మాట్లాడుతూ గంతులేసింది.

ఈ మాటల్లో సుబ్బారావుకు చాలా సత్యముందనిపించింది. కాని ఇంతలోనే తొలి ప్రతిబింబం సరాసరి ముందుకొచ్చి క్లోజప్‌లో కనుబొమ్మఎగరేస్తూ 'సుబ్బారావ్' అంది మరీ బిగ్గరగా. సుబ్బారావు తెల్లసూటుప్రతిబింబంమాటలు వినదలుచుకోలేదు. 'సుబ్బారావు! సుబ్బారావ్!!' గొంతు గింజుకుంది ప్రతిబింబం. సుబ్బారావు చెవులుమూసుకున్న చేతులు తీసి సిగరెట్‌ముట్టిస్తూ 'ఏం! అంతల్లా గింజుకుంటున్నావ్' అన్నాడు.

"అవును. గింజుకుంటున్నాను. మన తెలుగు వాళ్ళకు ఉన్న తెగులే ఇది. మంచి చెప్పేవాణ్ణి ఎవరు నమ్మారు కనుక! అయినా చెప్పటం నా ధర్మం. అటుపైన నీ విధి. కథ వ్రాయటం మానేద్దామనుకుంటున్నావ్‌కదూ? సరే. మానేశావే అనుకో. శ్యామలను భార్యగా పొందటానికి మరో మంచిమార్గం కోసంమాత్రం ఆలోచించద్దూ!—కథ వ్రాయటం కష్టమనుకుంటే ఎలా? ఆ రామం నిజంగా కథలు వ్రాయటం వచ్చే రాశాడంటావా? శ్యామలకు సాహిత్యమంటే మహా ఇష్టం. కథలు వ్రాసేవాళ్లంటే ప్రాణాలయినా ఇస్తుంది. అట్లాంటి శ్యామల సాన్నిహిత్యం సంపాదించాలంటే నీవు కథ వ్రాసి, ప్రైజుకొట్టి ఆ రామంకన్న ఘనుడ వనిపించాలి. నా మాట విను. ఐడియా తట్టడంలేదని భయపడి వెనుకంజ వేయకు. మెదడును ఓసారి ఓవర్‌ఆయిలింగ్ చెయ్యి. అన్నట్లు ఓ చిన్నసలహా. కథల చిట్కాలమాట మరచిపోయావు. ఓసారి అవి పూర్తిగా చదువు......"

ప్రతిబింబంమాటలు వింటూండగానే సుబ్బారావు ముఖంలో ఆనందరేఖ తళుక్కుమంది. చిట్కాలకోసం బీరువాతలుపు తెరవటంతో ప్రతిబింబంకూడా మాయమయింది. మూడుసార్లు మూడుఅరలూ తణిఖీ చేయగా ఆ పుస్తకం

# ఉత్కృష్టమైన

## అత్యాకర్షకమైన

స్టెయిన్‌లెస్
స్టీల్ పాత్ర సామానులు
—మీరు కోరునవన్నీ గలవు.

అంద చందాల బహుమానాలు
మిమ్మల్ని తప్పక మెప్పించగలవు.
ఈ బహుమాన కూపనులను
ఓ.కే. తయారీ వస్తువులనుండి
చేర్చి పెట్టండి.

























మీరు కొను ఈ క్రింది ప్రతి ఓ.కే. తయారీ వస్తువునుంచిన్నీ బహుమాన కూపనులను చేర్చిపెట్ట ప్రారంభించండి,

- ఓ.కే. వనస్పతి
- ఓ.కే. డబుల్ రిఫైన్డ్ ఆయిల్
- గోల్డన్ సలడ్ ఆయిల్
- ఓ.కే. చందన సబ్బు
- ఓ.కే. ఓరియంటల్ రోజ్ సబ్బు
- ఓ.కే. నీమ్ సబ్బు
- మీయోకే సబ్బు
- సోప్ చిప్సు

మరిన్నీ ఆ మీ కూపనులకు మారుగా అత్యాకర్షణీయములగు స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలను — మీకు ఇష్టమైన పరిమాణ ప్రమాణాలలో — మీకు అతి సమీపమునగల ఓ.కే. వ్యాపారి వద్దనుండి పొందండి.

ఈ ప్రత్యేక బహుమానయోజనల గురించిన విశేష వివరాలు గల సచిత్ర ఫోల్డరుగురించి మీ ఓ. కే. వ్యాపారిని అడిగి పొందండి.







EP·EAC·2TEL

*తయారుచేసినవారు :*

**ది ఈస్ట్ ఏషియాటిక్ కం. (ఇండియా) ప్రైవేట లిమిటెడ్., మదరాసు-1**

ఈ బహుమతి పథకం మద్రాసు, మైసూరు, కేరళ మరియు ఆంధ్ర రాష్ట్రములకు మాత్రమే వర్తించును.

# కథ కాక

ఎలాగో దొరికింది. తొలినుంచి చివరిదాకా మూడు సార్లు చదివాడు. అయినా ఓ కథంటూ ఆలోచన కలుగలేదు. ఆ కుక్కపిల్లకథే మదిలో మెదల్తూంది. ఎలాగో ఆ కథ వ్రాసిపారేద్దామంటే అది చాలా మందికి తెలుసున్నదేనాయె! పైగా ఈ చిట్కాలు చదివినవాళ్లలో ఇంకా ఏ ఒక్కరూ ఆ కథ రాయ లేదని నమ్మకమేమిటి? —అయినా పోటీకి పంపుతూ ఇలాటి టుంగిరీ కథా ఎన్నుకునేది? బిగువైన సన్ని వేశాలు, హృదయాన్ని కదిలించే సంఘటనలు, రసవత్తరమైన పాత్రలు, పాత్రోచితమైన సంభా షణలు—ఇవన్నీఒకదానితో నొకటి జోడించి అందంగా అయోమయం కాకుండా అల్లుకురావాలి. అయితే అదెలా సాధ్యం? ఛీ! ఛీ! ఆలోచన మళ్లీ మొదలు కొచ్చింది. నా వెర్రిగాని ఈ పుస్తకం చదివినంత మాత్రాన కథలు వ్రాయగలమా! గ్రుడ్డివానికి దీపంచూపిస్తేమాత్రం ఉపయోగం ఏమిటి? అసలు కాస్త అనుభవమంటూ ఉంటే ఏదో నాలుగుముక్కలలా అల్లుకురావచ్చు. ఈ రోజు ఏమిటో గాని చచ్చినా ఆలోచన తెగటంలేదు....."

మెట్లమీదుగా ఎవరో వస్తున్న అలికిడి అయింది. చిన్న పొడిదగ్గు వినిపించింది. సిగరెట్టు గుల్లలు రెండూ డ్రాయరుసొరుగులో నక్కి కూర్చున్నాయి. సిగరెట్—పీకలన్నీ ఓమూలగా చేరి, ఎవరికీ కనుపించకుండా ఏవో విషయాలు చర్చించుకుంటున్నాయ్. అప్పుడే సుబ్బారావుచేతుల నలంకరించిన ఎకనామిక్సు గైడు తలక్రిందులుగా తపస్సు చేస్తూంది.

'సుబ్బా!' రంగనాథంగారు పిలుస్తూనే తలుపుతెరిచి గదిలోకివచ్చారు. "ఏం నాన్నగారూ! పిలిచారా" తదేకమైన పుస్తకపఠనంలో ఉన్న సుబ్బారావు బుర్ర పైకెత్తాడు. "ఆఁ చూడు. నిన్న ఈ గదిలో భగవద్గీత మరచినట్టున్నాను.."

"ఆ ఇదుగో తీసుకోండి"

ఆయన పుస్తకం తీసుకుని మెట్లుదిగిపోయారు. సుబ్బారావు ఆలోచనల గొలుసుకు లింకులు ఊడి పోయాయి. పుస్తకం టేబిల్‌మీద పడేసి భారంగా మంచంమీద వాలిపోయాడు. తిరుగుతున్న సీలింగు ఫ్యానుచుట్టూ మెదడుకూడా తిరుగుతూంది. అలాగే పైకప్పుకేసి చూస్తూండిపోయాడు. చాలా సేపటికి సుబ్బారావు మళ్లీ వాస్తవంలోకి వచ్చాడు. టైము ఎంతయుందోనన్న అనుమానం వచ్చి, అలారం వైపు చూశాడు. పెద్దముల్లు పన్డ్రెండు దగ్గర చిన్నముల్లు కాగిలిలోంచి విడిపోలేక భారంగా ముందుకు కదుల్తూంది. ఒక్కసారి ఆవులించి చిటికె వేసి కళ్లుమూసుకున్నాడు.

..., ఏమయితే ఏం! కతిపయదినంబులకు సుబ్బారావు ఎలాగో, బుర్ర ఖరాబుచేసుకుని ఓ కథంటూ రాశాడు. రాశాడనేకంటే తయారుచేశా డంటేనే బాగుంటుంది. పట్టిపట్టి దాన్ని ఫెయిరు చేసి, కవరులోఉంచి సంపాదకులవారి ఆదేశాను సారం 'దీపావళి కథల పోటీకి' అని పెద్ద అక్షరా లలో వ్రాసి పోస్టుచేశాడు. నిరీక్షణలో నీళ్ళు నమలుస్తూ కూర్చోగా, కూర్చోగా ఓనాడు 'సుబ్బా రావుగారూ! మీ కథకు మొదటి బహుమతి' అనే ఉత్తరం తెచ్చిచ్చాడు పోస్ట్‌మన్. అతని ఆనందానికి అవధులు లేవు. హిందీసినిమాలో హీరోయిన్ని ఇచ్చినంతగా ఆనందపడిపోయాడు. శ్యామల దగ్గరకు పరుగెత్తుకుని వెళ్లి ఈసంగతి చెప్పేశాడు. అమాంతంగా లావుగా అయిపోయి 'సుబ్బారావు గారూ! మీరు ఎంతటివారండీ! మీలోఇంత ఆర్టు, స్పిరిటుఉందని మాటవరసకయినా అన లేదే. ఇంతకీ దీపావళి సంచిక ఎప్పుడొస్తుంది అంటారు? అంతవరకూ నేను మీ కథ చదవ కుండాఉండగలనా! దయఉంచి మీ కథ వ్రాతప్రతి ఒకసారి ఇస్తే వెయ్యినూటపదహారు ధన్యవాదాలు" అన్నది. సుబ్బారావు మళ్లీ పరుగెత్తుకుని ఇంటికి వెళ్లబోయి, సిటీబస్సులున్నాయని గుర్తొచ్చి కాసేపుబాధగానే నుంచుని, బసెక్కి వెళ్లి ఆ కాపీ తెచ్చిఇచ్చాడు. శ్యామల కథంతా చదివి "అబ్బ! ఎంత బాగా రాశారండీ! ఆ రావుం కథలు చూసి మహ ఇదిగా ఉన్నాయనుకున్నాను. ఈ కథముందు ఆతని కథలన్నీ బలాదూరు సుమండీ. అయినా నా వెర్రిగాని ఎంత బాగుండకపోతే ఇంత ప్రముఖ పత్రికలో ప్రథమ బహుమతి లభిస్తుంది" అన్నది.

సుబ్బారావుహృదయం ఆనందంతో అంతై, ఇంతై ఆకాశమంతై శ్యామలను తనలో ఇమి డ్చేసుకుందామని తాపత్రయపడిపోయి, ఇద్దై పోయి అదోలా ఉండిపోయింది. అతనికళ్లల్లోబాధను గ్రహించిన శ్యామల 'సుబ్బారావుగారూ! నేనంటే మీకు ఇష్టమేనా' అనటంతో అవునని చెప్పటానికి మాటలు దొరక్క గిలగిలలాడిపోయి ఎలాగో తల మాత్రం ఊపాడు ఇష్టమేనన్నట్లు. ఆనాటి నుంచి శ్యామలా, సుబ్బారావు మరీ దగ్గరయిపోయారు. సుబ్బారావు, తల్లితో ఈ విషయం చెప్పాడు. ఆవిడ భర్తతో చెప్పటం, ఆయన శ్యామల తండ్రీ మాట్లాడు కోవటం, శ్యామల సుబ్బారావుల—పెండ్లి వైభవంగా జరిగిపోవటం సినిమా రీలులా తిరిగిపోయాయి.

ఆరోజు... అతను గదిలో వారగా నుంచున్న శ్యామల భుజంమీద చేయివేసి తనవైపు తిప్పు కున్నాడు. శ్యామల సిగ్గుదొంతరల్లో మిఠాయిలా ముడుచుకుపోయింది. ఎలాగయితేనేం ఆమెను అనున యించి, బుజ్జగించి మంచంవరకూ తీసుకొచ్చి తనప్రక్కగా కూర్చోపెట్టుకున్నాడు. శ్యామల కళ్లు దించుకుపోయాయి. సుబ్బారావు ఆమెగడ్డం పట్టు కుని పైకెత్తుతూ "శ్యామలా.... ఇటు చూడు.. అబ్బ...అంత సిగ్గా...." అన్నాడు.

"బాబూ ఏదో కలవరిస్తుండారు. ఎనిమిది కావస్తూంది. పెదబాబు కోప్పడతారు. లెగుండి బాబూ" నౌఖరుఅప్పన్న తట్టి లేపాడు. లేచి కళ్లు నులుపుకున్న సుబ్బారావు గదిపరిసరాలు ఒకసారి చూచి 'ఇదంతా కలా! ఛీ ఛీ' అంటూ బాత్ రూమ్‌వైపు వెళ్లిపోయాడు.

*　　　*　　　*

క్లాసు జరుగుతూన్నా సుబ్బారావు కథావస్తువు గురించి ఆలోచిస్తూనే ఉన్నాడు. పైకప్పుకు దూలాలెన్నిఉన్నాయో మూడుసార్లు లెక్కపెట్టాడు. మొదటి మూడువరసల్లో ఆడపిల్లలెంతమందో ఆరు

## చందమామ విందు

"మహేశ్వర్"

అందాల జాబిల్లి
విందు జేసింది
చుక్కలన్నీ చేరి
విందు కొచ్చాయి!
బంగారు అంచుతో
సింగార మొలికించి
తెల్లనీ మేఘాలు
తెరలుగా అమరాయి!
తెరల చాటునుండి
దోబూచులాడుతూ
నీలాల నింగిలో
నిలచింది జాబిల్లి!
పిలిచింది చల్లగా
పిల్ల లందరినీ
పాల వెన్నెల ఛాలు
విరబోసింది!
బోసినోరిప్పుతూ
ముత్యాలు ఒలికించి
ముచ్చట్లు గొల్పింది
ఒక ముద్దుపాపాయి!
వెన్నెలల విందులో
గోరుముద్దలు మింగి
గజ్జెలూ మువ్వలూ
ఘలుఘల్లుమనంగా
విందులో అందాలు
విరజిమ్ముకుంటూ
చిన్నారి చిట్టిపాప
చిందు వేసింది
చుక్కలన్నీకలసి
ఫక్కుమన్నాయి!

## కథ కాక

సార్లు లెక్కపెట్టాడు. శ్యామల జడవైపు తొమ్మిదిసార్లు చూశాడు. మూడుసార్లు గోళ్లు గిల్లుకున్నాడు. పదకొండు మార్లు వరండావైపు, ఒకసారి లెక్చరర్ ముఖంలోకి చూశాడు. ఏడుసార్లు పెన్నుమూత తీసి మళ్లీమూశాడు. పుస్తకంపేజీలు రెండుసార్లు తిరగేశాడు. అయినా అదేం ఖర్మమో ఏ ఐడియా తట్టలేదు. బయట గంటమ్రోగింది. లెక్చరర్ బయటకు వెళ్లిపోయాడు. క్లాసులో కొంచెం రణగొణధ్వని బయలుదేరింది. సుబ్బారావులోమాత్రం మార్పులేదు.

చాలాసేపటినుంచి సుబ్బారావువైపు తదేకంగా చూస్తున్న శంకరం అతని ముఖంలోకి మరోసారి చూశాడు. అయినా సుబ్బారావు అజంతాశిల్పం మార్కులోనే ఆగిపోయాడు. ఈలోగా ముకుందం వెనుక బెంచీలోంచి డస్కుదూకి ముందుకొచ్చి కూర్చుంటూ 'ఒరేయ్! శంకరం! ఈ వారం పత్రికలో మా మామయ్య కథపడిందిరోయ్'అన్నాడు. ఈమాట వినగానే సుబ్బారావు మరోసారి ఉలిక్కిపడి "ఎవరు ముకుందం? మీ మామయ్యా.... కథ ఎందులో పడింది.. ఎప్పుడు?...." అన్నాడు అనాయకంగా. అతని వాలకం చూసి ముకుందం ఓ నిముషం అదోలాఅయి, అసలు సంగతి చెప్పాడు. "ఒరేయ్ ముకుందం! అయితే మీ మామయ్యకు కథలు వ్రాయటం వచ్చున్నమాట. శంకరం! ఈ విషయం నాకు కాస్తంతయినా చెప్పావుకాదేరా?— సరే దానికేంగాని "నాకు నీతో చాలా పనుంది. అలా బయటికి వెడదాం పద" అన్నాడు సుబ్బారావు ముకుందం చెయ్యిపట్టుకుంటూ. "నేనో" అన్నాడు శంకరం.

"రావచ్చు. అభ్యంతరంలేదు." సుబ్బారావు ఇద్దరి భుజాలమీద చెరోచెయ్యివేసి ఔట్‌గేటు వైపుకు తీసుకుపోయాడు.

సుబ్బారావు కథంతా విన్న ముకుందం, శంకరం 'అయితే నీకిప్పుడు ఓ మాంచి కథ కావాలంటావ్. అంతేనా' అన్నారు. అవునని తలఆడించాడు— సుబ్బారావు. ఆ మర్నాడు తన మామయ్య వ్రాసి ఉంచిన కథల్లో ఒక మంచి కథ చూసి ఎత్తుకొచ్చాడు ముకుందం. సుబ్బారావు ఆనందానికి అవధుల్లేవు. దానికి ప్రతిగా ముకుందం, శంకరం నయాపైసా ఖర్చులేకుండా సమస్తలాంఛనాలతో రిజర్వుడడు క్లాసులో కూర్చుని డిటెక్టివ్ పిక్చర్ చూశాడు. సుబ్బారావు ఆ వ్రాతప్రతిని పదిలంగా ఇంటికి తీసుకెళ్లి స్వదస్తూరీలో మరో కాపీతీయటం ప్రారంభించాడు.

ఆ ఎమోషన్‌లో వ్రాయటమంటే ప్రారంభించాడు గాని పట్టుమని పదిలైన్లు వ్రాసేసరికి చేతివేళ్లు బాధగా మూలిగాయి. అక్షరాలు ఆకారం కోల్పోయి 'ఇది ఏభాష' అన్నట్లు క్వశ్చన్‌మార్కుల్లా తయారయ్యాయి. నిజం చెప్పాల్సివస్తే అసలు సుబ్బారావు పేజీలు, పేజీలు ఏకథాటీగా వ్రాసిందెప్పుడు? అందులో తెలుగు (నోట్సు) వ్రాయటమంటేనే మహాచికాకు. మరోమాట వ్రాయాలంటే తీరుబడిగా కూర్చుని తెలుగునోట్సు వ్రాయటం 'పరువుహీనం' కూడాను. అందుకే సుబ్బా

రావు అడపాతడపా నోట్సులన్నీ ఆచారిచేత వ్రాయించే వాడు. ఆచారికి ఇందుమూలంగా ఏదో ప్రతిఫలం ముడుతూనేఉండేది. సుబ్బారావు పెన్ను మూసి, వేళ్లనొక్కుకుంటూ ఒక్కసారి ఆవులించి, 'రేపు రాద్దాంలే' అని మనసులో అనుకుని పేజీలు మడిచి సొరుగులో పెట్టాడు.

కదిలిపోతున్న సిటీబస్‌కు పరుగెత్తుకెళ్లి ఆరోహించి, హీరోలా రెండుసార్లు కాలరు సర్దుకుని ఈలవేస్తూ బస్సులోఉన్న అందర్నీ పరికించాడు— సుబ్బారావు. తన ప్రక్కసీట్లోనే కూర్చునిఉంది శ్యామల. సూటిగా ఆమెకళ్లల్లోకి చూశాడు. (ఇటువంటి అవకాశాలు చాలాఅరుదుగా వస్తాయి. వినియోగించుకోకపోవటం తెలివితక్కువ.— సుబ్బారావు డైరీ 5వ పేజీనుంచి). ఆమె కనురెప్పలు రెండు సార్లు విూటి మళ్లీ దించుకుంది. అతను వాచీవైపు చూసుకున్నాడు. పది దాటవస్తూంది. చేతిలో పుస్తకాలు మరోసారి సరిచేసి పట్టుకున్నాడు. ఈ సారి శ్యామలవైపు చూసినప్పుడు ఆమెచేతుల్లో పుస్తకాలు లేవని స్పష్టపడిపోయింది. సుబ్బారావు ఓసారి క్వశ్చన్‌మార్కులా మెలితిరిగిపోయి, గడ్డిమోపులా రోజూ అన్నిపుస్తకాలు తీసుకొచ్చే ఈమె ఇలా నిరాడంబరంగా, చేత 'సింగిల్' పుస్తకం కూడా లేనిదై రావటంలో అర్థమేమిటా అని బుర్రకు పనిచెప్పి, అది ఒకవైపుకు మొగ్గక ముందే స్టాపు రావటంతో దిగిపోయాడు. వెనకే వస్తున్న శ్యామల తన చేతిలో పుస్తకాలు చూసి నవ్వుతుందేమోనని రెండుమూడుసార్లు వెనక్కి చూశాడు.

కాలేజీ ఆవరణలోకి ప్రవేశించగానే విషాదభరితమైన వార్త అతని హృదయాన్ని కుదిపివేసింది. శ్యామల ఈవేళ టి. సి తీసుకుంటోందని, వాళ్ల నాన్నగారికి బదిలీఅయిందని తనకు ఇంతవరకూ మాటమాత్రంగానయినా ఎవరూ చెప్పలేదు. విషాదఘట్టంలో తెలుగుసినిమా హీరోలా రెండుసార్లు నిట్టూర్చి భారంగా క్లాసులోకి వెళ్లికూర్చున్నాడు. శ్యామలలేని క్లాసు చంద్రుడులేని ఆకాశంలా, పెట్రోలులేని కారులా, గుండీలులేని చొక్కాలా, ముఖచిత్రంలేని పత్రికలా, అదోలా అదోలా అనిపించింది. 'అంతకంటే మంచి ఉపమానాలు తట్టి ఉంటే ఈసరికి స్వంతంగానే కథలు రాసేవాణ్ణి' అనుకున్నాడు. "కనీసం 'ఇలా కాలేజీవదలి వెళ్లిపోతున్నాను' అనేనా చెప్పకుండా వెళ్ళిపోతుందా— శ్యామల" అనుకుంటూ బెంచీలో భారంగా వెనక్కి వాలిపోయాడు.

ఇంటర్వెల్‌లో కాంటీన్‌వైపు వెడుతూండగా శ్యామల ఎదురై 'హలో! సుబ్బారావుగారూ' అంది. సుబ్బారావు ఫుల్‌స్టాప్‌లా అయిపోయి, ఉలిక్కిపడిపోయి, నాలుక రెండుసార్లు తడిచేసుకుని, గుట్టింలా దూకుతున్న తుమ్మును బలవంతాన ఆపుచేసుకుని.... 'హలో' అన్నాడు. 'నేను మన కాలేజీనుంచి వెళ్లిపోతున్నానండీ'—

ఈ న్యూసు ఇంతకుమునుపే తెలిసినా ఆ క్షణంలోనే తెలిసినట్లు కనీసం నటించనేనా నటించకపోతే తన భావి పటాపంచలైపోతుందని భావించి, ఓసారి వళ్లువిదిలించుకుని, విషాదం ముఖంనిండా కప్పుకుని 'ఆఁ! విూరు.... వెళ్లిపోతారా?—' అన్నాడు మాటకి పదిపాళ్లు ఆశ్చర్యంకూడా కలిపి.

"అవును.. మా నాన్నగారికి బదిలీఅయింది."

"అయాంన్ వెరీ సారీ.... విూరు...."

"ప్లీజ్. మరోలాభావించకండి. నేను చాలా మందితో చెప్పాలి. వస్తా. మరచిపోకండి...."

"తరచు లెటర్సు రాస్తూంటారుకదూ...."

"ఊఁ...."

* * *

శ్యామల ఊరువదలి పదిరోజులయింది. సుబ్బారావు గంటల్లో లెక్కపెట్టాడు కాబట్టి '240' గంటలు అయిందనే చెప్పాలి. ఇది కథ కాబట్టి సుబ్బారావు శ్యామలకోసం బెంగపెట్టుకున్నాడంటే సరిపోదు. అతని కళ్లు ఆమెకోసం కాయలుకాచాయి. ఆతని మనసు ఆమెతలపుల్లో గిలగిల్లాడింది. హృదయం పరితపించింది. ఆమెదగ్గరనుంచి ఇంతవరకూ ఉత్తరం లేకపోవటంతో సుబ్బారావు నిరీక్షణకు ఓరూపంఅంటూ ఏర్పడలేదనే అనుకోవాలి. ఈ బాధలో, ఈ విరహంలో, ఈ పరితాపంలో ఒకవేళ అతను మరోనాలుగు పేజీలకథ ఫెయిర్ చేశాడన్నా నమ్మేవాళ్లుండరు. ఎలా నమ్ముతారు? ప్రేమ.... మరోపని చేయనిస్తుందా? మనసుకు నిలకడ, నిశ్చలత కలిగిస్తుందా? అయినా ఇది ప్రేమ సఫలతా కార్యక్రమంలోదే కాబట్టి వ్రాశాడేమో అనుకోవచ్చు.

ఆవేళ సుబ్బారావు ఇక ఉగ్గబట్టలేకపోయాడు. క్రిందటి సంవత్సరం గ్రూపుఫోటోతీసి శ్యామలవైపు పదకొండుసార్లుచూశాడు. పన్నెండోసారి ఆమెముఖం ఇక చూడలేక (విసుగువచ్చికాదు) బాధతో ఫోటో తిరగేసి కళ్లనీళ్లుపెట్టుకున్నాడు. ఏమయినాసరే ఈ వేళ తనకుతానుగా ఆమెకు ఓలేఖ రాయాలని నిశ్చయించుకున్నాడు. ఆ లేఖలో సాహిత్యమంతా గుప్పించేయాలి. తను వ్రాసిన ప్రతి మాటా అయస్కాంతంలా పనిచేసి శ్యామల హృదయాన్ని తనవైపుకు బలంగా ఆకర్షించాలి. అయితే సాహిత్యానుభవం, అంతంతమాత్రంగా ఉన్న తను ఈ లేఖలో ఇన్ని రసాలు చొప్పించటమంటే మాటలా! సుబ్బారావు మనసులో ముకుందంగాడి మావయ్య మెదిలాడు. త్వరత్వరగా బట్టలు వేసుకుని వెళ్లి, ముకుందాన్ని కలుసుకుని సంగతంతా వాళ్ల మావయ్యతో చెప్పి, ఓ బ్రహ్మాండమయిన లేఖ తయారుచేయించి, కష్టపడి ఎలాగో దాన్ని తన స్వదస్తూరిలో ఫెయిర్‌చేశాడు. తిరాపోస్టుచేయబోతే ఆవేళ ఆదివారమని, స్టాంపులు దొరకవని గుర్తొచ్చి, కథకూడా ఫెయిర్‌కాపీ వ్రాస్తే— రెండూ మర్నాడు పోస్టుచేయవచ్చని ఎలాగో దాన్ని పూర్తిచేశాడు సుబ్బారావు.

మర్నాడు సోమవారం, ఉత్తరం, కథ పోస్టుచేసి, చేతులు దులుపుకుని 'హమ్మయ్య' అనుకున్నాడు సుబ్బారావు.

అసలు శ్యామలకు సుబ్బారావువిూద, అతని హృదయంపైన ఒకప్రత్యేకమయిన దృష్టిఉందో లేదో తెలియదుగాని అతడుమాత్రం ఆమెనుంచి వచ్చే జవాబుకై వళ్లంతా కళ్లుచేసుకుని (అన్ని కళ్లజోళ్లు కొనుక్కోలేక) బాధపడ్డాడు. అయినా శ్యామలదగ్గరనుంచి ఓ ఉత్తరమంటూ దర్శనమీయలేదు.

సుబ్బారావు హృదయం కురిడీకొబ్బరిలా ఎండిపోయింది. చివరకు కతిపయదినంబులకు, సుబ్బారావు పరధ్యాన్నంగా పత్రికనూస్తూ, శ్యామల కథకు మొదటిబహుమతి రావటం గ్రహించి అలాగే ఉండిపోయాడు. మొదటి పేరా చదవకముందే అది తను ఫెయిర్‌చేసిపంపిన 'ముకుందం మామయ్య' వ్రాసిన కథని తేలిపోయింది. పాపం ఆరడుగుల సుబ్బారావు మూడడుగులు ముడుచుకుపోయి ముక్కుమీద వేలేసుకున్నాడు.

ఇంతకీ సుబ్బారావు కథ, ఉత్తరం పోస్టుచేయటంలో చిరునామాలు తప్పువ్రాయటంవల్ల ఇలా జరిగిందని గ్రహించాడా? శ్యామల అసలు సుబ్బారావును ప్రేమించిందా? ప్రేమిస్తే అతడి కథను ఇలా తస్కరించటంలో ఆమెఉద్దేశ్య మేమిటి? ఈ విషాదంఅంతా తనను ముసురుకున్నాక సుబ్బారావు ఏం చేశాడు? ఇంతకీ 'ఇదీ ఓ కథేనా?' ఈ ప్రశ్నలకు సమాధానాలు కావాలంటే (సాధారణంగా) వెండితెర చూస్తే సరిపోతుందేమో అనిపిస్తుంది. కాని ప్రస్తుతం కాగితంకూడా కరువైపోయి పత్రికలు తక్కువ కాపీలు అచ్చువేస్తున్న ఈరోజుల్లో ఈ కథాకమామీషు పూర్తిచేయటానికి వేరే తెర సృష్టించటం సాధ్యపడదు. కనుక శలవు. 

---

తనదగ్గరకు ఉద్యోగానికి వచ్చిన ఓ కొత్తవ్యక్తిని వ్యాపారస్తుడిలా అడిగాడు.

"డబుల్ ఎంట్రీ వేయగలవా?"

"డబుల్ ఎంట్రీ ఎమిటండీ? ట్రిబుల్ ఎంట్రీకూడా వేయగలను. పనిచేసే భాగస్థుడికి అధికలాభాలు చూపిస్తూ, మందకొడి భాగస్థుడికి స్వల్పలాభాలు చూపిస్తూ, మనలెక్కల్లో నష్టం ప్రభుత్వానికి చూపిస్తూ వెరసి మూడు ఎంట్రీలు వ్రాయగల్ను!"

శివకామయ్య (చిత్తూరు.)

---

# మనమూ-మనదేహస్థితి

21 వ పేజీ తరువాయి

ట్యూలాల నొటిచుట్టూ మృదుత్వం నశించి, గడ్డ కట్టి ఉంటుంది. కేన్సరులోనూ, క్షయవ్యాధి లోనూ ఈ గడ్డ తిరూ తెన్నూ లేకుండా ఉంటుంది.

ఉదరం ఫుట్‌బాల్ బ్లాడరులాగా, గుండ్రంగా ఉన్నప్పుడు, అందులోగాలి ఉందని గ్రహించవచ్చును. ఉదరంలో జలం చేరినప్పుడు, వెలకిలా పడుకున్నప్పుడు రెండువైపులా డొక్కలు ఉబ్బరిస్తవి. ప్రక్కకుతిరిగి పడుకున్నప్పుడు ఆ ఉబ్బరం ఒక వైపుకు చేరి, పైవైపు లోపలికి పోతుంది. రోగికి కడుపులో నీరు కదిలినట్లు తెలుస్తుంది. తొందరగా ప్రక్కకు తిరిగినప్పుడు కదిలించిన బిందెలో నీళ్ళు తొణికిసలాడినట్లుగా ఉదరంలో నీరు తొణికిసలాడిన శబ్దం వినిపిస్తుంది. ఉదరంలో స్థూలాంత్రం (Largeintestine) లో ఆటంకం ఏర్పడినప్పుడు రెండు డొక్కలలోనూ ఉబ్బరింపు ఏర్పడుతుంది. కాని, చిన్నపేగులో ఆటంకం ఏర్పడ్డప్పుడు ఉబ్బరింపు సాధారణంగా నాభిప్రదేశంలోనే అధికంగా కనుపిస్తుంది. కొన్ని క్రిమిదోషాల్లో ప్రేగులు శక్తిహీనములై ఉబ్బిపోతవి. రోగిచేత దగ్గించినప్పుడు, డయాఫ్రమ త్వరగా సంకోచించి, దాని స్పందనము కెరటంలాగా ఉదరకుడ్యంలో పైనుంచి క్రిందకు వెళ్తుంది. ఆ సమయంలో ఎక్కడయినా, హెర్నియాఉంటే ఆ ప్రదేశంలో చేతికి స్పందనం తెలుస్తుంది.

ఉదరం, శ్వాస సమయంలో పైకీ, క్రిందికీ కదులుతూ ఉంటుంది. ఉచ్ఛ్వాసకాలంలో ఉదరం పైకి లేస్తుంది. నిశ్వాసకాలంలో క్రిందికి పోతుంది. కాండం ఒక పీపా వంటిది. దానిని డయాఫ్రమ, పైన వక్షంగానూ, క్రింద ఉదరంగానూ విభాగిస్తుంది. ఊపిరితిత్తులు గాలి చేత పూరింపబడినప్పుడు డయాఫ్రమ క్రిందికి వచ్చి ఉదరంలో అంగముల వత్తిడి వల్ల ఉదరకుడ్యము పైకి లేస్తుంది. ఉదరకుడ్యంలో చాలా పొరలు ఉన్నవి. అవి పైనుంచి లోపలకు క్రమంగా (1) చర్మం, (2) కొవ్వుపొర, (3) మొదటి పీచుపొర, (4) కండరములు, (5) లోపలిపీచుపొర. దానిని అంటే, ఉదరాంతరాళమునుచుట్టి ఉండే పెరిటోనియం మడతలు రెండు. ఈ ఏడు పొరలూ కలిసి ఉదరకుడ్యము ఏర్పడింది. ఇందులో పెరిటొనియం ఇన్‌ఫ్లేం అవుతూ ఉంటుంది. ఆ స్థితిని పెరిటొనైటిస్ (Peritonitis) అంటారు.

పెరిటోనియంలో కొంతభాగం మాత్రమే ఇన్‌ఫ్లేం కావచ్చును. అప్పుడు ఏభాగం ఇనేఫ్లేం అయితే ఆ ప్రదేశం బల్లలాగా కఠినము అయిపోతుంది. ఈ స్థితిని సాధారణ భాషలో కడుపు రాయిలాగాఉందని వర్ణిస్తారు. పెరిటొనైటెస్‌లో శ్వాస సమయంలో ఉదరం ఆకృతి మారదు. ఉచ్ఛ్వాసకాలంలో వక్షభాగం మాత్రమే పైకిపోతుంది. పెరిటొనైటిస్ ప్రాణాంతకమైన వ్యాధి—విశేషము. గంటలలో నివారించకపోతే, ఆ తరవాత ఏంచేసినా లాభం ఉండదు. ఈస్థితి తరుచు, ఎపెండిసైటెస్‌లో ఎపెండిక్సు పగిలినప్పుడూ, కడుపులోనూ, డివోడినంలోనూ అల్సర్లు అంతకంతకు లోతై, వాటి గోడలలో చిల్లి ఏర్పడి, వాటిలోఉండే పదార్థములు పెరిటోనియంమీద పడ్డప్పుడూ ఏర్పడుతుంది. స్త్రీలలో ఇన్‌ఫ్లేం అయిన రజోనాళములు (Fathopiantubes) పగిలినప్పుడూ, ఆ నాళములలో ఏర్పడే 'నాళికా గర్భము' (Tubal pregnancy) పగిలినప్పుడూ, యూటెరస్ (గర్భాశయము) లో దీర్ఘమైన ఇన్‌ఫ్లమేషను, కేన్సరు, ఫైబ్రాయిడ్ (Fibroid) వంటి దుర్మాంసవృద్ధులూ పెరిగి గర్భాశయంగోడ వెలుపలికి చొచ్చుకొని వచ్చినప్పుడూ బిడ్డ అడ్డం పడి ప్రసవకాలంలో గర్భాశయం పగిలినప్పుడూ, పెరిటోనియం ఇన్‌ఫ్లేం అవుతూ ఉంటుంది. శరీరంలో ఇతర భాగములు ఇన్‌ఫ్లేం అయినప్పుడు కూడా లింఫొటెక్కుద్వారా ఆ క్రిమిదోషం ప్రాకి, ఉదరాంగములలో ఇన్‌ఫ్లమేషన్ రావచ్చును. కడుపు రాయిలాగా ఉండడం, టెటనస్ అనే వ్యాధిలో (ధనుర్వాతం) దుస్సంకోచకాలంలో (Spasm) కొంతకాలం వస్తూ,పోతూ ఉండవచ్చును. ఏమయినా ఉదరకుడ్యము మృదుత్వము నశించి, రాయిలాగా అయిపోవడం, అతిప్రమాదకరమైన రోగస్థితి.

సాధారణంగా నాడీ స్పందనం (Pulsation), ఆర్టెరీలలోనే కనుపిస్తుంది. వెయినులలో కనిపించదు. కాని, హృద్రోగంలో దాని శక్తి నశించి హృదయోన్ముఖమయిన రక్తము, హృదయంలోకి పోక, లివరులోనూ, ఇతర ఉదరాంగములలోనూ నిలవ ఉండిపోతుంది. హృదయం కుడిభాగం, ఆ రక్తమును తనలోకి తీసుకుని ఊపిరితిత్తులలోకి పంపలేనిస్థితి ఏర్పడుతుంది. అప్పుడు ఉదరో పరిభాగంలో కనుపించే వెయినులు ఉబ్బి, ఆర్టెరీలలోలాగా వీటిలో 'నాడి' (Pulsation) కనుపిస్తుంది. సన్నని వారిలో అయోర్టా (ప్రధాన ఆర్టెరీ) నాడి, ఉదరం ముందు గోడను స్పందింపజేస్తుంది. అయోర్టా ముందు ఏదయినా దుర్మాంసవృద్ధి, గ్రంధీ ఉన్నప్పుడు ఆ గ్రంధి కదిలి, ఉదరకుడ్యమును స్పందింప జేయవచ్చును.

సాధారణంగా ప్రేగులలో ఏర్పడే తరంగచలనం ఉదరకుడ్యాన్ని కదలించదు. కాని, ప్రేగులలో ఎక్కడయినా తీవ్రమయినఆటంకము (Obstruction) ఏర్పడినప్పుడు ప్రేగులు ఉబ్బి, ఆ తరంగచలనము అవిలోమంగా వెనక్కు నడవవచ్చును. ఉదరకుడ్యము మందంగా ఉన్నవారిలో ఇది కనుక్కోడం అసాధ్యము. కాని, చిన్న పిల్లల్లోనూ, సన్నినివారిలోనూ ఈ అవిలోమ తరంగచలనం గతి ఉదరకుడ్యంమీద చూడవచ్చును. మంచి వెలుతురులో రోగిని వెలకిలా పడుకోబెట్టి, కొంచెం నీరుగానీ, పాలుగానీ తాగించి, పొట్టమీద చిన్న చిటికెవేస్తే, ఆటంక ప్రదేశంవరకు తరంగచలనం పోయి, వెనక్కు తిరగడమును చూడవచ్చును. కొంతమంది శిశువులలో జఠరాశయమునకూ, డివోడినమునకూ మధ్యఉండే ద్వారం చాలా చిన్నదై, అక్కడఉండే స్ఫింక్టరుకు సంకోచ వ్యాకోచక శక్తి నశిస్తుంది. అప్పుడు బిడ్డ పాలు త్రాగినా, త్వరగా కక్కివేస్తాడు. ఆ వాంతి చిమ్మి కొట్టినట్లుగా చాలా దూరం పోతుంది. ఆ స్థితిలో కడుపులో ఏర్పడే అవిలోమ తరంగచలనము కనిపిస్తూ ఉంటుంది. ఇది, త్వరగా గమనించి, శస్త్రచికిత్స చేయించకపోతే, కొద్దికాలంలోనే నిరశనదోషంవల్లా (Starvation), నిర్జలస్థితివల్లా (Dehydration) శిశువు మరణించడం సంభవిస్తుంది.

ఉదర భాగమును వీక్షించినప్పుడు దాని గోడలో ఉండే కొవ్వు కణుతులూ (Lipoid lysts), చర్మవ్యాధులూ, అందులో ఏర్పడిన సంజూ ఇంకా ఎన్నో గమనించవచ్చును. ఇటువంటి అసాధారణ లక్షణములు గమనించగానే వెంటనే వైద్యుడి దృష్టికి తేవడం చాలా అవసరం. ★



అంటిపెట్టుకుని ఉండగలదా ? ఏమో ఎవరు చెప్పగలరు ?

అన్నిటికన్న గోపాలయ్య తిరస్కృతి అతని కెంతో వేదన కలిగించింది. ఆ వ్యథతో అతని కిక కాళ్లాడలేదు. మొట్టమొదట తిన్నగా ఇంటికే వెళ్లిపోవాలని నిశ్చయించుకొన్నాడు. కాని అంతగా పొద్దు పోయినట్టు కనబడలేదు. కాలక్షేపం కోసం కొంతసేపు కావేరీ తీరంలో విశ్రమించా లను కొన్నాడు. అప్రయత్నంగా అతని పాదా లటువైపు సాగిపోయాయి. అల్లంతదూరంలో కావేరి చల్లని పిల్ల తెమ్మెరలతో అలల సవ్వడితో కన్నతల్లిలా ఆహ్వానించింది. కుడివైపున కొంత దూరంలో శ్రీ రంగేశుని ఉత్సవమూర్తి మేళతాళాల కోలాహలంలో క్రమక్రమంగా మున్ముందుకు సాగి పోయింది. రంగనాయకుడు చేతులెత్తి స్వామికి నమస్కరించి ఇసుకతిన్నె మీదికి పోయి కూర్చున్నాడు. ఏవేవో ఆలోచనలల్లి బిల్లిగా అల్లుకుని అతని మనస్సు బాగా కలగించివేశాయి. అలాగ ఎంత సేపు గడిచిందో అతనికే తెలియదు.

క్రమ క్రమంగా బాగా చీకటి పడింది. ఉత్సవ కోలాహలం పూర్తిగా మందగించింది. నీరవ నదీ ప్రవాహంలో నక్షత్రాల కాంతి మాత్రమే స్పష్టాస్పష్టంగా గోచరించింది. అక్కడక్కడ కెరటాలలో నుండి తెల్లతెల్లని చిరు మీనులు కొన్ని పైపైకెగిరిపడ్డాయి. సన్నని కీచురాళ్ల మోత జీవిత సంగీతాని కంతటికి మంద్రాతి మంద్రమయిన మధుర శ్రుతిలా వినికిపించింది. కొంచెం దూరంలో రెల్లు గుబురులలో జలపక్షుల కలకలారావం కర్ణపేయంగా వినిపించింది. ఆకాశంలో మబ్బుల మాటున దాగిన నెలవంకవెలుగు గాలిలో కదలాడుతున్న రెల్లు పూల కొక విధమయిన వింత సోయగం కలిగించింది. అప్పటికి ఆశ్వయుజ మాసం ప్రవేశించి రెండు మూడు రోజులే అయింది. అందుచేత చిరు చలికి సంకోచించిన శ్రీరంగ నగర వాసు లెంతోమంది కావేరీ తీరానికి రాలేదు. వచ్చినవా రొక రొకరే తిరిగి వెళ్లిపోయారు. ఆపైన ఆ పరిసరంలో ఎక్కడ మానవ సంచారమే గోచరించలేదు ! అంతలోనే అనతిదూరంలో ఏటిగట్టు కవతల ఉన్న మర్రిచెట్టుమీద కొక్కెర కూత వినిపించింది.

రంగనాయకుడు ఉలికిపడి లేచి నిలుచున్నాడు. అప్పటికి గాని అతనికి బాగా చీకటిపడినదన్న సంగతి స్ఫురించలేదు ! తిరిగి ఇంటికి వెళ్లిపోవాలని నిశ్చయించి తొందర తొందరగా రెండు మూడడుగులు వేశాడు. అంతే ! నెత్తిమీద పిడుగువంటి పెద్ద దెబ్బ పడింది. ఆ దారుణాఘాతంతో అతని తల రెండు చెక్కలయి విడిపోవలసిందే ! విపరీత వేదనతో విలవిలలాడి వెనక్కి తిరిగి చూశాడు ! పోత విగ్రహం వంటి ఒక వ్యక్తి తిరిగి తన చేతనున్న బాణాకర్ర పైకెత్తాడు. మరుక్షణంలోనే దాని దెబ్బతో అతని శిరస్సు తుత్తునియలై పోవలిసిందే! కాని మొండి ధైర్యంతో కళ్లు మూసుకుని, ప్రత్యర్థి మీదికి లంఘించాడు. రెండు మూడు క్షణాలపాటు వా రిరిద్దరికి మధ్య పెద్ద పెనుగులాట చెలరేగింది. చిట్టచివరికి రంగనాయకునిదే పైచెయ్యి అయింది. మిక్కిలి చాకచక్యంతో మీది

# విశాల నేత్రాలు

23-వ పేజీ తిరువాయి

కురికి ప్రత్యర్థిచేత నున్న బాణాకర్ర చేజిక్కించు కొన్నాడు. ఉత్తర క్షణంలోనే ఆ వ్యక్తి బాగా భయపడి కాలికొద్ది పరుగు ప్రారంభించాడు. అయినా రంగనాయకు డతనిని విడిచిపెట్టలేదు. డేగలాగ వెంటబడి తన యావచ్ఛక్తి వినియోగించి నడినెత్తిమీద గట్టిగా కొట్టి హుంకరించాడు.

ఆ తీవ్రాఘాతంతో మరి అడుగు లెయ్యలేక వా డక్కడే చాప చుట్టలా కూలబడిపోయాడు! అంతలోనే రంగనాయకునికి తగిలిన గాయంలో నించి పై కుబికిన రక్తం చెక్కిళ్లపై జాలు వారింది. పైనున్న ఉత్తరీయం చించి అతడా గాయానికి గట్టిగా కట్టు బిగించాడు. పడిపోయిన వ్యక్తి దగ్గరికి వెళ్లి ముఖకవళిక జాగ్రత్తగా పరిశీలించాడు. మొట్టమొదట మసకచీకటిలో స్పష్టంగా గుర్తు తెలియలేదు. మళ్లీ ముఖంమీద ముఖం పెట్టి పరకాయించాడు. వా డెవడో అపరిచిత వ్యక్తికాడు ! సింహాచలం ! వాడికి తగిలినది బాగా గట్టిదెబ్బ ! దానిలోనించి రక్తం ధారకట్టి ప్రవహించింది. అప్పటికి గాని రంగనాయకునికి తాను కొట్టిన దెబ్బ ఎంతటి దారుణ మైనదో బోధపడలేదు. సింహాచలంమీద వల్లమాలిన జాలితో తల మునకలై గాయానికి కట్టు కట్టాలని ప్రయత్నించాడు. కాని ఎక్కడ జీవమున్న జాడే కనబడలేదు. శరీరం అటు ఇటు కదిపి చూశాడు. సన్నని మూలుగయినా వినబడలేదు. మరికొంత సేపటికి వరకు మునివేళ్లతో ఊపిరి పరిశీలించాడు. ఇంక సందేహం లేదు. సింహాచలం ప్రాణం పోయింది. ఒకటి రెండు నిమిషాల వరకు రంగనాయకుని కేమి చెయ్యడానికి పాలుపోలేదు. తిరిగి తిన్నగా తన దారిని తాను ఇంటికి వెళ్లిపోవాలని అనుకొన్నాడు. కాని కాళ్లాడలేదు. అంతలోనే అతని కది క్షేమకరమయిన పద్ధతి కాదని స్ఫురించింది. మరునా డుదయమే రాజభటులా దారుణం కనిపెట్టి అడుగుజాడలతో తన సంగతి పసికట్టి అనుమాన పడవచ్చును.

క్షణకాలం తీవ్రంగా ఆలోచించి సింహాచలం కాళ్లు రెండు దొరక పుచ్చుకుని కావేరీ ప్రవాహ మధ్యం లోని కీడ్చుకుపోయాడు. అతని మృతకళేబరం మరి కొంతదూరం కొట్టుకుపోయే వరకు అలాగే నిలబడి కావేరీలో స్నానంచేసి, తడిబట్టలు పిండుకుని తిన్నగా తన యింటివైపు సాగిపోయాడు. విపరీతమైన ఆందోళనవల్ల, శిరోవేదన వల్ల బడలికవల్ల ఎంతగా ప్రయత్నించినా తొందరగా అడుగు పడలేదు. అలాగే కాళ్లీడ్చుకుంటూ అతి కష్టంమీద అర్ధరాత్రి కింటికి చేరుకొన్నాడు.

హేమసుందరి అతనికోసం నిరీక్షిస్తూ అంత వరకు వీధిగుమ్మంలోనే నిలుచున్నది. నెమ్మదిగా కాళ్లీడ్చుకుంటూ ఇంటిలో అడుగు పెట్టగానే రక్తసిక్తమయిన తలకట్టు పరిశీలించి 'అయ్యో ! ఇదేమిటీ గాయం !' అని నిలువునా నిర్ఘాంతపడి లోపలికి తీసుకుపోయి శయ్యమీద విశ్రమింపజేసి పరిచర్య ప్రారంభించింది. ఆదరాబాదరాగా బిగించిన తలకట్టు విప్పి కుంకుమ అద్ది వేరొక కొత్త కట్టు కట్టింది. విపరీతమయిన నిస్త్రాణవల్ల రంగనాయకుని కొంచెం మగత నిద్ర పట్టింది. రెండు మూడు నిమిషాలలో తిరిగి కొంచెం మెళకువ రాగానే జరిగిన సంగతి అంతా సంగ్రహంగా ఆమెతో చెప్పి కళ్లు మూసుకుని ఉసూరుమని నిశ్వసించాడు. హేమసుందరి చెక్కిళ్లపై దిగజారుతున్న కన్నీరు తుడుచుకుని 'ఇంతకి మనం అదృష్టవంతులమే ! వాడా దెబ్బ కత్తితో కొట్టలేదు ! .... అయితే మనం ఇక్కడ ఉన్న సంగతి వా డెలాగ కనిపెట్టాడో !' అన్నది. రంగనాయకుడు ఆమె కేవిధంగాను ప్రతి సమాధానం చెప్పలేదు. కాని అదే సంగతి ఆలోచించాడు. పగబట్టిన తిరుమల రెడ్డి స్వయంగా సింహాచలాన్ని ఇక్కడికి పంపించి ఉండవచ్చును. లేక లోలోపల పేరుకొన్న అక్కస్సుతో వాడే తన కసి తీర్చుకుని తీరాలని ప్రయత్నించి ఉండవచ్చును. శ్రీరంగం వచ్చి తనకోసం నలువైపుల గాలించి ఉండవచ్చును. కంటపడగానే వెంటాడి సమీపంలో ఎవ్వరు లేరన్న సంగతి కనిపెట్టి, దుడ్డుకర్రతో చావమోది ఉండవచ్చును. ఆ సమయంలో సింహాచలం దగ్గర చిన్న బాకు గాని, కత్తి గాని లేవేమో ! ఉంటే తాని పాటికి పరలోకం చేరుకుని ఉండవలసిందే ! దైవానుగ్రహంవల్లనే తానా ఘోరాపద తప్పించుకొని బయట పడ్డాడు. ఒకవేళ రెడ్డి ప్రోత్సాహమే సింహాచలంచేత ఇంతటి సాహసాని కొడిగట్టించిందేమో ! అనాడే ఆ విషసర్పాన్ని హతమార్చివేసి ఉండవలసింది. ఒకవేళ అతగాడు పంపిస్తే మాత్రం! వీడిక్కడికి వచ్చి ఇంతటి దారుణం తలపెట్టాలా ? రెడ్డికేం ! మోకాలు కీ లూడినా సుఖంగానే కాల

---

"ఏమిటయ్యా! ముఖం అలా వేలాడేసుకూర్చున్నావ్ ! ఏం జరిగిం దేమిటి" ఎంతో ఆప్యాయత పలకరించాడు రామారావు కుటుంబరావుని.

"ముఖం వేలపడక చేసే దేముంది? ఇక నేను త్రాగుడు, చుట్ట, బీడి మానెయ్యాల్సి వచ్చేట్టుంది" అన్నాడు దీనంగా కుటుంబరావు.

"మంచిదేలే! కాస్త డబ్బు నిలుస్తుంది."

"ఏడ్చినట్టుంది నీ సలహా! అసలు డబ్బు లేకనే కదా మానేస్తుంది!" విసుకున్నాడు కుటుంబరావు.

మల్లాది (భీమవరం)

---

క్షేపం చేస్తున్నాడు! పాపం సింహాచలమే చిట్టచివరి కేవిధంగా ప్రాణాలు పోగొట్టుకుని కావేరీ పాలయి వాడు. అయ్యో! ఎంతపని చేశా నీవేళ! రంగనాయకుని ఆలోచనా పరంపర లావిధంగా సాగిపోయాయి.

మరికొంతసేపటి కతనికి బాగా జ్వరం తగిలింది. తెల్లవారేవరకు మరి కన్ను తెరవలేదు. తెల్లవారుజామున చెరుపుమరుపుమాట లారంభించాయి. 'పోనీయకు! పోనీయకు! పట్టుకో! పట్టుకో! పారిపోతున్నాడు!' అన్న ధోరణితో కలవరింత ప్రారంభించింది. మరికొంతసేపటికి అది కొంచెం తగ్గింది. కాని ఆపైన మాటిమాటికి అతని నోట 'కాంతామణీ! ఇదిగో! నీ బహుమతీ! నామాట వినవా!' అన్న అనునయ ప్రసంగం ప్రారంభ మయింది. ఇంచుమించుగా భళ్లుమని తెల్లవారేవరకు హేమసుందరి వీనుదోయిలో అదే ధోరణి ప్రతిధ్వనించింది. ఆ మరునాడు కూడా ఆ పరిస్థితి మారలేదు!

అది గమనించి హేమసుందరి చాలా భయపడింది. ఇరుగుపొరుగువారి తోడ్పాటుతో 'శ్రీరంగంలో పేరెన్నికగన్న ఒక వైద్య శిఖామణి నింటికి పిలిపించింది. మిక్కిలి జాగరూకతతో చికిత్స చేయించింది. పొద్దస్తమానము రంగనాయకుని పాన్పు పక్కనే కనిపెట్టుకుని ఉండి శాయశక్తులా పరిచర్య చేసింది. క్రమక్రమంగా ఏడెనిమిది రోజులలో అతని జ్వరం తగ్గింది. నడినెత్తిమీద తగిలిన గాయం బాగా నయమయింది. కాని కొంచెం నిస్త్రాణ మాత్రం మిగిలింది. క్రమక్రమంగా అది కూడా చాలావరకు తగ్గిపోయింది.

ఆ తరువాత ఒకనాటి రాత్రి హేమసుందరి కర్పూరం తాంబూలం రంగనాయకుని చేతి కందించింది. అయినా అత డది అందుకోలేదు. పరధ్యానంగా ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

'ఇదేమిటి ఇలాగున్నా రీవేళ?'

హేమసుందరి ఎంతో ఆత్రంగా ప్రశ్నించింది. అయినా అతడు బదులు పలకలేదు! హేమసుందరి అతని శిరస్సెంతో ఆప్యాయంగా కౌగలించుకొని కళ్లల్లో కళ్లు పెట్టి మళ్లీ ఎంతో ఆప్యాయంగా బ్రతిమాలుకొన్నది:

'ఎందుకో గాని బాగా బెంగపెట్టుకున్నట్టున్నారు! ఎందు కింతటి ఆరాటం? ఆమాత్రం నాతో చెప్పకూడదా?'

రంగనాయకు డెంతో ఆశ్చర్యపడ్డాడు.

'బెంగపెట్టుకోవడ మేమిటి? ఏమీ లేదే! పాపం ఆ సింహాచలం కుటుంబానికి ఎంత ఆపద వచ్చిందా అని ఆలోచిస్తున్నాను అంతే!'

'పోనీలెండి! నాతో చెప్పడం మానివేస్తున్నారా? మీ రెందు కింతగా పరధ్యానంగా ఉన్నారో నాకు తెలియదనుకొన్నారా?'

రంగనాయకు డలాగే ఆశ్చర్యపడి ఆమె విశాలనేత్రాలవై పవలోకించాడు.

హేమసుందరి అతని నుదుటిమీద జీరాడుతున్న గిరజాల ముంగురులు మునివేళ్లతో సరిచేసి తిరిగి గద్గదభరిత స్వరంతో అనునయించింది:

'ఇదిగో! ఇలాగ చూడండి! ఎందు కలాగ దాచివేస్తారు. పాపం! ఆ కాంతామణికోసం బెంగపెట్టుకున్నారులా ఉంది! అవునా! కొంచెం నాతో చెప్పకూడదా? చెబితే నేనేమన్నా బాధపడి వల్లకాదంటానని అనుకొంటున్నారా? నేనేమి అనుకోను!'

'పులిమీద పుట్రలాగా ఎప్పుడు లేనిది ఇప్పు డీ కాంతామణి కొత్త గొడవ ఎందుకు వచ్చిపడింది?' అన్నాడు రంగనాయకుడు నిశ్చల శిలాప్రతిమలా నిర్ఘాంతపడి.

'కొత్త గొడవేమి కాదు! ఈమధ్యన జ్వరం వచ్చినప్పుడు పొద్దస్తమానము ఆ వగలాడి పేరే కలవరించారు!'

రంగనాయకు డదివిని మరింతగా విస్తుపోయాడు!

'ఇదేమిటి? నాకేమి గుర్తులేదే! నిజంగా నేనామె పేరెత్తి కలవరించానా?'

'ఒకసారి, రెండుసార్లు కాదు. అస్తమానము అదే ఘోష! ఇదిగో! కొంచెం నామాట నమ్మండి! స్వామి దయవల్ల ఈనాటివరకు మన కేవిధమయిన లోటు రాలేదు! అంతేకాదు. నా ఒంటిమీద నగలన్ని అయిపోయినా సరే, మీ కెలాంటి మనస్తాపం కలిగినా నే నది భరించలేను. త్రికరణశుద్ధిగా చెబుతున్నాను. కాస్త కనికరించి ఈ చనువు చెల్లించండి! ఇదిగో ఈ ముత్యాలహారం తీసుకువెళ్లి పది రోజులపాటు ఆమెతో సుఖంగా కాలక్షేపం చేసిరండి. మీకెందు కింతటి తపన. నేనేమి అనుకోను. నామాట నమ్మండి. పాపం! ఆమె కోసం దిగులుపడి నానాటికి చిక్కి శల్యమయి పోతున్నారు!"

---

"అయ్యా! ఒక అణా ధర్మం చేయండి. పేదవాణ్ణి."

"చిల్లర లేదు. పది కాయితం ఉంది." "ఇలా తేండి, చిల్లర ఇస్తాను."

పి. ఆనందరావు (ఒంగోలు)

---

కేవలం ఎత్తిపొడవడానికే హేమసుందరి ఆ ప్రసంగం ప్రారంభించినదని మొట్టమొదట రంగనాయకు డనుకొన్నాడు. వీనుదోయి వరకు విస్తరించిన ఆమె విశాలవిలోచనాల లోతు లవగాహన చేసుకొన్న పిమ్మట ఆతని సంశయం పూర్తిగా పటాపంచ లయినది. శిరస్సు కొంచెం వంచుకొని హేమ రెండు చేతులు పట్టుకొన్నాడు:

'హేమా! ఒళ్లు తెలియని పరిస్థితిలో ఏదో కలవరించి ఉంటాను. అంత మాత్రానికే ఇంతగా మనస్సు కష్టపెట్టుకోవాలా?'

'అదిగో! అదేమాట! అందుకోసమే నే నిన్ని విధాల బ్రతిమాలుకొంటున్నాను. నా మనస్సేమి కష్టపడలేదు. మీమీద ఒట్టు పెట్టుకుని చెబుతున్నాను. నామాట నమ్మండి. ఒక్కసారి కాంతామణి భవంతికి వెళ్లిరండి. ఇంకా నా మాటమీద నమ్మకం కలగకపోతే నేనేమి చెయ్యను? ఎంత ఒట్టు పెడితే అంత ఒట్టు. సరిగదా!'

అప్పటికి రంగనాయకునికి ఆమె చిత్తశుద్ధి విస్పష్టంగా బోధపడింది. అతని శిరస్సింకా కిందికి వంగిపోయింది. కొంచెం డగ్గుత్తికతో ప్రాధేయపడ్డాడు:

'హేమా! నిజంగా నావల్ల వల్లమాలిన పొరబాటే జరిగిపోయింది. ఈ క్షణం మొదలుకొని నేనిక ఆమె భవంతి గుమ్మం తొక్కను. అంతే కాదు! మరి ఆమె మాటే తలపెట్టను. నీవంటి పైడి పెన్నిధి నట్టింట పొరాడుతున్నా, తిన్నగా గ్రహించుకోలేక కాకి బంగారంకోసం కలవరించాను. అయినదేదో అయిపోయింది. ఇక నేనామె గోడే తలపెట్టను సరిగదా! నన్ను మన్నించు!'

హేమసుందరి చెక్కిళ్లపై కవోష్ణబాష్పా లేకధారగా ప్రవహించాయి. తలవంచుకుని ఉసూరుమని నిట్టూర్చి చీర చెరగులతో కన్నీరు తుడుచుకున్నది. రంగనాయకు డనేక విధాల బ్రతిమాలుకొన్న పిమ్మట ఆమె యరుణాధరంపై లేత చిరునవ్వులవోకగా తరళించింది.

## 16

పరిపూర్ణారోగ్యం కలిగిన తరవాత నాలుగయిదు రోజులపాటు రంగనాయకుడు ఇంటిపట్టునే ఉండిపోయాడు. అప్పుడప్పు డతనికి సింహాచలం దారుణ మృతి జ్ఞప్తికి వచ్చింది. పశ్చాత్తాపంతో మాటిమాటికి మనస్సనేక విధాల మథనపడింది. తిరుమలరెడ్డి దురాలోచనవల్ల నయితేనేమి, సాహసించి శ్రీరంగం చేరుకొని చేతేతుల చేసిన దుశ్చర్యవల్ల నయితేనేమి, ఆ దురదృష్టవంతుని కెంతటి ఘోరాపద సంభవించింది! పాపం! సింహాచలం కుటుంబాని కిక దిక్కెవ్వరు? వా డిక్కడికి వచ్చి చనిపోయిన సంగతి కూడా ఇంతవరకు ఇంటిలో ఎవ్వరికి తెలిసి ఉండదు. తలవని తలంపుగా ఆనా డెంతటి ఘోర పాతిత్యానికి ఒడిగట్టుకొన్నాను! నా బ్రతుకంతా చిట్టచివరికిలా వట్టి అధ్వాన్నంగా మారిపోయిం దేమిటి? మాటిమాటికి అతని హృదయంలో మథన ఆవిధంగా చెలరేగింది. తన ఆత్మరక్షణ కంతకన్న వేరే గత్యంతరం లేదని కూడా రంగనాయకు డనుకోక పోలేదు. అదీగాక సింహాచలాన్ని చంపివెయ్యాలని కూడా అతడు మొట్టమొదట సంకల్పించలేదు. ఒళ్లెరగని క్రోధావేశంతో కొట్టిన దారుణాఘాతంతో వా డక్కడే చాపచుట్టలా కూలబడి చనిపోయాడు. ఆవిధంగా గట్టిగా కొట్టి ఉండకపోతే సింహాచలం మృతకళేబరానికి బదులుగా తుత్తునియలయిన తన శవమే ఆనాడు కావేరీ ప్రవాహంలో పడి కొట్టుకొని పోయేది! స్వామి కృపవల్లనే తన కంతటి ఘోరరాపద తప్పిపోయినదని రంగనాయకొక గట్టి నమ్మక కలిగింది.

బాగా ముమ్మరంగా జ్వరం కాసినప్పుడు, ఆ తర్వాత, అనుక్షణము అడుగడుగునా ఆందోళనపడి, హేమసుందరి చేసిన పరిచర్య అతని నెంతో కదిలించివేసింది. ఆపైన కాంతామణి భవంతికి వెళ్లి హాయిగా సుఖించవలసిందని ఆమె మాటిమాటికి బలవంతపెట్టిన ధోరణి తలుచుకోగానే అతని నేత్రాంతాలలో చిన్న చిన్న కన్నీటి బిందువులు లొకటి రెండు పొటమరించాయి. శృంగార

**తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక**
**సర్క్యులేషన్ అత్యధికమైనది!**

సరిపోల్చండి!

# కొఠారి మల్లు

శ్రేష్టమని మీకే తెలుస్తుంది

నేతలో, పవితనంలో, మన్నికలో... శ్రేష్ఠమైనది. ఔను, విశిష్టమైన కొఠారి నూలుతో వాటికవే తిరిగే లూములమీద ఈ మల్లు నేయబడుతూంది కాబట్టి. లాల్చీలకు, లంగాలకు, బాడీలకు, దిండు గలీబులకు, అండర్‌వేరులకు, దోవతులకు ఇంకా ఇట్టి అనేక ఉపయోగాలకు చాలా ఆదర్శమైనది.

*మీకు లాంగ్‌క్లాత్‌లు కావాలంటే, మంచిరకపు కొఠారి నూలుతో నేయబడ్డ కొఠారి లాంగ్‌క్లాత్‌లు మీకు నచ్చుతాయి. చాలాకాలం మన్నుతుంది.*

## అడగండి కొఠారి మల్లు M-7 మరియు లాంగ్‌క్లాత్ కూడా!




తయారీ: కొఠారి టెక్స్‌టైల్స్ లిమిటెడ్
రిజిష్టర్డు ఆఫీసు: ఓరియంటల్ బిల్డింగ్సు, అర్మీనియన్ స్ట్రీటు, మద్రాసు-1.
మ్యానేజింగ్ ఏజెంట్లు: కొఠారి & సన్సు

IWT/KT/1779

మంజరి బలవంతంవల్ల ఎప్పుడో ఒకనాటి అర్ధరాత్రివేళ, ఎవరో ఒక అపరిచిత వ్యక్తితో అకస్మాత్తుగా హేమసుందరికి సంబధం కలిగినదని విన్నంతలోనే ఒళ్లెరగని ఆక్కస్సుతో అత డామెపై విరుచుకుపడ్డాడు! తిన్నగా తిరిగి నిచులాపురం వెళ్లిపోవలసినదని హుంకరించాడు. కాని కాంతామణిపై అతని కెంతో మక్కువ కలిగినదని తెలిసినా హేమ ఏమాత్రము అసూయ పడలేదు. పైగా ఆమె భవంతికి పోయి సుఖించవలసిందని ప్రోత్సహించింది. మెడలో ముత్యాలహారం తీసి చేతి కందీయబోయింది. ఆ సంఘటన తలచుకోగానే రంగనాయకుని హృదయం హేమసుందరి యెడల వెల్లివిరిసిన కృతజ్ఞతతో ప్రగాఢమైన ప్రేముడితో తొణికిసలాడింది. కన్నతల్లి కూడా అంతటి ఆప్యాయతతో ఆదరించలేదు! హేమవంటివా రెవరయినా ఈ లోకంలో ఉంటారా ? ఆ గాఢానురాగమయి అడుగుజాడలో నిలబడడాని కయినా తన కావంతయినా అర్హత లేదని రంగనాయకు డనుకొన్నాడు ! శ్రీరంగేశుని అవ్యాజ కరుణవల్లనే తన కటువంటి సాధ్వీమణి, సుందరీతిలకము లభించినదని లోలోపల ఎంతయినా ఉప్పొంగిపోయాడు. మరి అలసించక శీఘ్రమే తాను సంకల్పించుకొన్న మొక్కుబడి చెల్లించుకోవాలని నిశ్చయించుకొన్నాడు.

ఆనాటి సాయంకాలమే పురోహితుని ఇంటికి వెళ్లి స్వామికి కానుకలు చెల్లించడానికి అప్పటికే చాలా ఆలస్య మయినదనీ, త్వరలోనే ఏదో ఒక విధమయిన శుభముహూర్తం ఏర్పాటు చేయించవలసినదనీ చెప్పి తొందరపెట్టి ప్రాధేయపడ్డాడు. వెంటనే ఆయన అన్నిరకాల మేషాలు లెక్కపెట్టి త్వరలో అంతటి చక్కని ముహూర్తం ఏదీ కుదరడంలేదని కొంచెంసేపు తటపటాయించాడు. కాని రంగనాయకుని బలవంతంమీద ఎల్లుండి కార్తీక పౌర్ణమి కనక ఆనాటి ఉదయం రెండు జాముల పొద్దెక్కిన తరవాత మొక్కుకొన్న కానుక లర్పించవచ్చునని నిశ్చయించాడు. కార్తీకపూర్ణిమనాడు తెల్లవారుజాము మొదలుకొని అర్ధరాత్రి వరకు శ్రీ రంగేశుని కనేక మహోత్సవాలు జరుగుతాయి. కనక తన కదే తగిన తరుణమని రంగనాయకుడెంతో సంతృప్తి పడ్డాడు. పురోహితుని కొక బంగారు చక్రం సమర్పించి ముడుపు చెల్లించిన తరువాత తిరిగి ఇంకొక మారు దర్శనం చేసుకోగలనని విన్నవించి రంగనాయకు డక్కడికి నించి బయలుదేరాడు. ఇంటికి వస్తూనే ఆ సంగతి హేమసుందరికి చెప్పి స్వామి దర్శనానికి కావలసిన సంభారాలసేకరణలో పడ్డాడు.

కార్తీక పౌర్ణమినాటి ఉదయం కొంచెం పొద్దెక్కిన తరువాత హేమసుందరి రంగనాయకుడు శ్రీ రంగేశుని దేవాలయానికి ప్రయాణమయినారు. క్షణంలో అతని హృదయం అడుగడుగునా మున్ముందుకు చెంగలించి అపూర్వోత్సాహంతో ఉప్పొంగింది. ఆనాడు రంగనాయకుని తీరు హేమసుందరికే కొంచెం ఆశ్చర్యం కలిగించింది. సరిగంచు కంచి ఉత్తరీయం వల్లెవాటుగా వేసుకొన్నాడు. కుడి ముంజేతికి సింహలలాటంతో మెరుస్తున్న పైడి కడియం కొంచెం

# విశాల నేత్రాలు

బిగువుగా అలంకరించుకొన్నాడు. శ్రీరంగంలో మల్లయుద్ధ ప్రవీణులు కొందరు అతని విద్యానైపుణి పరిశీలించి మెచ్చుకొని బహూకరించిన వీర కంకణ మిది ! వట్టరాని గర్వంతో మేళవించిన అతని దృష్టి మాటిమాటికి దానిమీద ప్రసరించింది! తండలకు రెండింటికి మంకెనపూల మాలికలు చుట్టుకొన్నాడు. పొడుగాటి పైడి తిలకము, సువర్ణ విలోచన యుగళి ఒక బంగారు పళ్లెరంలో ఉంచి అప్పుడప్పుడే వికసించిన మందారాలు దేవకాంచనాలు, కుంకుమాక్షతలు ఆదితర పూజా ద్రవ్యాలు, ఆ కానుకల కిరువైపుల అమర్చుకొన్నాడు. ఎండపొడ లగిలి పువ్వు లేమాత్రము వాడిపోకుండా, పండు మొగలి రేకులతో లేత లేత తాటి మొవ్వుల ఆకులతో శ్రీ చందనం చేవకామతో తయారు చేయించిన పెద్ద గొడుగు ఎడమచేతితో ఎత్తి పట్టుకొన్నాడు. దాని లోపల లక్క పూతతో రెక్కలల్లలాడిస్తున్నట్టు రూపొందించిన గరుడాళ్వారు చిత్రంవైపు చూడ

“అంతమంది మూగారెందుకు ఆ దుకాణం ముందు?” అన్నాడు రాజకీయ నాయకుడు.

సినీతార చెప్పులు కొనడానికి వచ్చిందన్నాడు బాటసారి.

“అక్కడో ఉపన్యాసం ఇవ్వనా? యింతజనం మళ్లీ రాదు” అనుకున్నాడు.

జి. గంగాధరరావు (అమలాపురం)

గానే అతని కెంతో ఉత్సాహం కలిగింది. పైపైన శంఖచక్రాల పైడిపూత చిత్తరులు లేత లేత ఎండపొడలలో తళతళ మెరిశాయి. గొడుగు అంచులలో కుచ్చులతోబాటు అమర్చిన కంచు చిరుమువ్వల సవ్వడి హేమసుందరి కాలి అందెల ఘలంఘలలతో మేళవించింది.

ఆమె ఆనాడు మధురనించి, వచ్చిన లేతలేత చిలకపచ్చ పట్టుచీర కట్టుకొని, ఊదారంగు సరిగంచు రవిక తొడుక్కొన్నది. మెడలో ముప్పేట ముత్యాల హారాలు మూ డలంకరించుకొని నుదుటికి కొంచెం పైభాగంలో రావిరేక, చంద్రవంక ఒకదాని వెనుక ఇంకొకటి అమర్చుకొన్నది. రవ్వల మువ్వలతో తళతళ లాడుతున్న మొలనూలు, నె న్నడుముచుట్టు అలవోకగా బిగించుకొన్నది. సుదీర్ఘమయిన శ్రీ చూర్ణ తిలకాని కాధారంగా, కమ్మ కస్తూరి కద్దిన కుంకుమరేఖ చిన్నారి అరచందురుని ఆకారంతో రూపొందించుకొన్నది. రంగనాయకుని అడుగులో అడుగు వేస్తూ అలసాలస గమనంతో మున్ముందుకు సాగిపోయింది. కార్తీకమాస బాల సూర్యోదయ కాంతిలో రాజవీదిలో భవనాల ద్వారాలలో వేలాడుతున్న పండు మొగలి రేకుల తోరణాలతో శ్రీరంగ నగరం ఆనాడొక

కొంగ్రొత్త వింత కాంతిలో తలమునక లవుతున్నదని రంగనాయకు డెంతో ఆశ్చర్యపడ్డాడు!

అప్పుడే పౌరు లనేకులు పిల్లలతో, పాపలతో, వేర్వేరు కానుకలతో శ్రీ రంగనాథుని సందర్శనం కోసం తొందర తొందరగా పురోగ మిస్తున్నారు. క్రమక్రమంగా హేమసుందరీ రంగనాయకు లిద్దరు మొదటి ప్రాకారం ముఖద్వారం సమీపించారు. శ్రీరంగ దేవాగారం చుట్టు పరివేష్టించిన ప్రాకారాల కేడింటికి ప్రాక్పశ్చిమ దక్షిణోత్తర దిశలలో ప్రత్యేకించి నాలుగేసి సమున్నత గోపురా లున్నాయి. శ్రీరంగ దేవాలయం ప్రాకార గోపురా లన్నిటికన్న మిక్కిలి సమున్నతమై పైపైకి సాగిపోయి రవంత ఓరగా ఒరిగినట్టు స్ఫురించింది. దేవాలయ శిఖరంమీద, గోపురాల శిఖలమీద అమర్చిన బంగారు కలశాల బారు అరుణారుణమైన ప్రాత:కాల భాస్కర కాంతిలో వేయిరేకుల పైడి తామరపూల పంక్తి వలె తరళించింది. గోపురాలమీద, దేవళంమీద అమర్చిన గూళ్లలో పావురాల వల్లటీల సవ్వడి రెక్కల తటతట ధ్వనులతో, కువకువలతో మేళవించి, మాటిమాటికి హేమసుందరీ రంగనాయకుల వీనుల జంటలలో ప్రతిధ్వనించింది. గాలిలో కదలాడుతున్న ధ్వజస్తంభం చిరుగంటల కలరవం గగనాంతరాళంలో అదృశ్య లయిన అచ్చరల వీణాతంత్రీస్వనంవలె అతిలోక మనోహరమై మారు మ్రోగింది!

వా రిద్దరు క్రమక్రమంలో గోపుర ద్వారాలొక టొకటే దాటి దేవాలయం సమీపించగానే శ్రీరంగేశుని కొమ్ముటేనుగు తొండంపైకెత్తి మెడలో వేలాడగట్టిన పెద్ద పెద్ద గంటల గణగణ ధ్వనులతో అల్లనల్లన సమీపించింది. అది తలవని తలంపుగా ఎదురయిన ఒక గొప్ప శుభ శకునమని రంగనాయకు డెంతో ఆనందించాడు. కొండ అరటిపళ్ల గెల ఒకటి కొని దాని కందించి హేమసుందరితోబాటు వారికొంచెం మున్ముందుకు సాగిపోయాడు. భక్తులు కొంతమంది అప్పుడే ఫలపుష్పాలతో వేర్వేరు మొక్కుబడులతో గర్భాలయంలో ప్రవేశిస్తున్నారు. అందరికన్న మొట్టమొదట తానే కానుక లర్పించవలెనని రంగనాయకు డెంతయినా ఉవ్విళ్లూరిపోయాడు. కాని అనుకున్నంత తొందరగా అతని కోరిక నెరవేరలేదు. అయితే పురోహితు డేర్పరచిన శుభముహూర్తం మాత్రం మించిపోలేదు.

క్రమక్రమంగా గర్భగుడిలో నలువైపుల పురోహితుల మంత్రపఠన ధ్వనితోబాటు ఘంటారవం గంభీరమై ప్రతిధ్వనించింది. రంగనాయకుడు, హేమసుందరి ద్వారం మున్ముందు నిలబడి స్వర్ణ తిలకము, పైడి కనుదోయి బంగారు పళ్లెరంతోబాటు అర్చకుని కందించారు. అతడా వింత కానుకలవైపు చూచి రవంతసే పాశ్చర్యపడ్డాడు. ఎప్పుడో సకృత్తుగా గాని ఇంతకుముందు భక్తు లెవ్వరు అటువంటి వింత మొక్కుబడి సమర్పించలేదు. అతని ఎరుకలో చాలాకాలం కిందట సంగీత విద్వాంసు డొ స్వామికొక స్వర్ణమురళి సమర్పించాడు. అం

అర్చకుడు వారికొంతసేపు వారివైపెంతో విడ్డూరంగా చూసి గోత్రనామధేయాల లడిగాడు. రంగ

# విశాలనేత్రాలు

నాయకుని కిక ఆ సమయంలో ఆమె తన ధర్మ పత్ని అని చెప్పక తప్పలేదు. హేమాంబా ధనుర్దాసు లన్న కొత్త పేరులతోనే తండ్రి గోత్రంతోనే తమ ఉభయుల పక్షాన స్వామికి యథావిధిగా సహస్ర నామపూజ చేయించాడు. అర్చన జరుగుతున్నంత సేపు వారిద్దరి నవీన నామధేయాలు శ్రీరంగే శుని సమక్షంలో గర్భాలయంలో అంతట ఒకే క్రమంలో తిరిగి తిరిగి ప్రతిధ్వనించాయి. వాస్త వాని కా క్షణంలోనే ఒక సరికొత్త పద్ధతిలో స్వామి సాన్నిధ్యంలో తమ ఇద్దరి వివాహ మహోత్స వము సాంగోపాంగంగా పరిసమాప్తమయినదని రంగ నాయకు డెంతో సంతోషించాడు. మరి వేరే ఇంకొక ఏర్పాటుమాటే తలపెట్టనక్కరలేదని సంతృప్తి పడ్డాడు.

అర్చన అంతా ముగిసిన తరవాత పూజారి పైడి కనుదోయి, బంగారు తిలకము పైకెత్తి పట్టుకొని మిక్కిలి మెళకువతో స్వామి నెన్నుదుటి కలంకరించాడు. అగరుధూప మాలికలలో, కర్పూర నీరాజన కాంతుల తళతళలో వినూతనాలంకారా లతో జాజ్వల్యమానమైన శ్రీ రంగశాయి నెన్నుదుటి వైపు చూచి హేమసుందరీ రంగనాయకులా లానందావేశాలతో పులకించారు. హేమ వెడద కను దోయి కొలతలతో రూపొందించిన కాంచనవిలోచ నాలు రెండు స్వామి ఫాలతలికి ఎంతో చక్కగా అమరినవని రంగనాయకుడు లోలోపల మిక్కిలి ఉప్పొంగి క్షణకాలంపాటు ఆమె విశాలనేత్రాల లోతులు పరిశీలించాడు. హేమ అతని అభిప్రాయం కని పెట్టి స్వామి సాన్నిధ్యంలో అటువంటి కొంటె ఆలోచన కూడదన్నట్టు ముక్కుమీద వేలుంచి క్రీగంటి చురుకు చూపుతో నివారించి మొలి కెత్తిన చిరునవ్వుతో శిరస్సు వంచుకొన్నది.

పూజ, మొక్కుబడి చెల్లింపు మొదలయిన వన్ని ముగిసిన తరవాత తీర్థప్రసాదా లందుకొని తిరిగి వారిద్దరు తమ భవంతికి ప్రయాణ మయి నారు. దేవాలయం ముఖద్వారంలో ప్రవేశించే ముందు రంగనాయకుడు పాదరక్షల జత, గొడుగు ఒక పువ్వుల అంగడి బేహారి దగ్గర దాచుకొన్నాడు. తిరిగి అవి తీసుకుని హేమసుందరికి ఎంతో ఆప్యా యంగా స్వామి నిర్మాల్యాలు కొన్ని బహూకరించాడు. అవి ఆమె మిక్కిలి భక్తితో కళ్ల కద్దుకొని సిగలో తురుముకొన్నది.

అప్పుడే రెండు జాముల పొద్దెక్కింది. ఆకా శంలో కొబ్బరిచెట్ల కనటాకులు, పోకల ముదురు గెలలు, ఇళ్ల పెరళ్లలో బాదంచెట్ల పండు టాకులు కార్తికమాసం మధ్యాహ్న సూర్యకాంతిలో గాలిలో కదలాడి వింత వెలుగులతో తరళించాయి. శ్రీమంతుల భవంతుల ప్రాంగణాలలో నెమళ్లు సురపొన్నల నీడలలో విశ్రమించాయి. హేమసుంద రితోబాటు రాజవీధిలో కొంత దూరం సాగి పోయిన తరవాత రంగనాయకునికి మధ్యాహ్నం మండు టెండలో కొంచెం చురుకుపా లెక్కు వయినదని స్ఫురించింది. నడక ఆపి హేమ ముఖాని కెదురుగా గొడుగెత్తి పట్టుకొన్నాడు. కాని

అంతలోనే ఆమె ఎంతో సిగ్గుపడి తటాలున తప్పించుకొన్నది:

'కాస్త ఎండ తగిలితేనే అలసిపోయేటంతటి సుకుమారినికాదు లెండి! నాకోసం ప్రత్యేకంగా గొడుగెత్తి పట్టుకో నక్కరలేదు! మీ వెనకాల నడుస్తూంటే నామీద కొంచెం నీడ పడుతూంది. ఇది చాలదా ఏమిటి ?'

అయినా రంగనాయకుడు తన ధోరణి విడిచి పెట్టలేదు. గొడుగు కొంచెం ఓరగా వంచి తిరిగి ఆమె విశాల నేత్రాల కెదురుగా ఎత్తిపట్టు కొన్నాడు.

'చలికాలం ఎండయితే మాత్రం! ఎంత చిట చిట లాడుతూందో చూడు! చెక్కిళ్లు కళ్లు ఎలాగ వాచిపోయాయో! రా! కొంచెం నీడలోకి రా!'

కాని హేమ అతని మాట లక్ష్యపెట్టలేదు:

'ఇదేమిటీ వెర్రి! నడివీధిలో ఎవరయినా చూస్తే ఏమనుకుంటారో అన్న ఆలోచన కూడా లేకపోతే ఎలాగ ?'

ఆమె తిరిగి కొంచెం దూరంగా తప్పుకొన్నది.

'అనుకుంటే అనుకోనీ, నాకేం !'

రంగనాయకుడు అలాగే గొడుగెత్తి పట్టుకొని కొంటె నవ్వుతో కవ్వించి ఆమె భుజంమీద చెయ్యి వేసి నెమ్మదిగా దగ్గరికి తీసుకుపోబోయాడు. హేమ అతని దుందుడుకు ధోరణి గమనించి ఇక బెట్టుసరి చేస్తే నలుగురిలోను నవ్వులపాలయి పోవడమే తప్ప మరి లాభంలేదని గ్రహించి గొడుగు నీడలో నిలిచి కొంచెం రుసరుస లాడింది:

'ఎప్పుడు ఇంతే! మనిషికి ఎంత తోస్తే అంత! నలుగురిలోను కొంచెమయినా మన్నన, మర్యాద గమనించకపోతే ఎలాగ ?'

చిన్న చిరునవ్వు చిందించి రంగనాయకు డది విని విననట్టు మాట్లాడ కూరుకొన్నారు. అంతేగాని మరి ప్రతి సమాధానం చెప్పలేదు. అలాగే ఆమె చెక్కిలిమీద క్రీగంటిమీద చూపు నిలిపి అల్ల నల్లన నడక సాగించాడు.

అంతకుమును పెన్నడు హేమసుందరి శ్రీరంగ నగరం రాజవీథి సందర్శించలేదు. అసలామె కంతగా ఇల్లు కదలి వెళ్లే అలవాటే లేదు! ఎప్పుడయినా తెల్లవారుజామునే లేచి ఇరుగు పొరుగమ్మలతో కలసి కావేరీ స్నానానికి వెళ్లేది. వా రెవరయినా ఇంటికి వస్తే ఎంతో ఆప్యాయంగా మర్యాదచేసి ఆదరించింది. తిరిగి వారి ఇళ్లకు వెళ్లి లోకాభిరామాయణంతో కాలక్షేపం చేసేది. అంతేనేగాని శ్రీరంగం నలువైపుల సందర్శించడాని కయినా ఆమె ఎప్పుడు ఉబలాట పడలేదు. అందు చేత నే డామె బాటలో ఇరువైపుల గల సమున్నత సౌధాలనై పెంతో ఆశ్చర్యంగా చూసింది. క్రమ క్రమంగా ఆ ధోరణితో మైమరచి పౌరు లనేకులు తమ ఇద్దరి వైపు మాటిమాటికి విడ్డూరంగా చూస్తున్నారన్న విషయమే గమనించలేదు. ఇక రంగనాయకునికి చాలాకాలంనించి ఇతరుల అభి ప్రాయాల యెడల విపరీతమయిన ఏవగింపు, నిర్లక్ష్యధోరణి అలవడ్డాయి. కనక ఆ విషయమే అతని ఆలోచనల ప్రవేశించలేదు!

పదిమంది మధ్యలో నిలబడినప్పుడు హేమ ఎంతో అందగత్తె అన్నమాట ఇట్టే స్ఫురించి తీరుతుంది. ఆపైన ఆనాడామె చిలకపచ్చ పట్టు చీరతో, కావిరంగు రవికెతో నెమ్మని పసిడి మిస మిస వన్నెతో అపూర్వ సౌందర్యంతో తరళిం చింది. పైగా శీతకాలం మధ్యాహ్న కాంతి ఆమె శరీరశోభ మరింతగా ఇనుమడింప జేసింది. చెక్కి ళ్లపై ప్రతిఫలిస్తున్న పద్మ రాగాలతో పొదిగిన కర్ణాభరణాలతో, కాటుక రేఖతో వీనుల వరకు విస్తరించిన కనుదోయితో, మెడలో ముత్యాలహారాల తళత్తళలతో, కాలి అందెల ఘలంఘలతో సవిలాస మంథర గమనంతో సాగిపోతున్న హేమసుందరి చక్కదనం రాజవీథిలో అడుగుపెట్టిన పౌరు లందరి చూపులు పట్టి నిలిపి ఆకర్షించింది. ఇక భవంతుల ప్రాంగణాలలో గుమిగూడిన జవ్వ నులు కొందరు నవయౌవనంతో మిసలాడుతున్న రంగనాయకుని కనుముక్కు తీరెంతో మెచ్చు కొన్నారు. కాని చెక్కిళ్లు నొక్కుకుని వా రిద్దరి యెడల తమ లోలోపల చెలరేగిన అసూయ వెల్లడించుకొన్నారు.

---

రైల్లో ఒక యాత్రీకుడు తిరుపతి వెళ్తున్నాడు. మగతగా ఉండి కూచునే తూలుతున్నాడు. అంతలో తిరుపతీ తిరుపతీ అని కేకలు వినిపించాయి. త్రుళ్లి పడి దిగిపోయాడు యాత్రీకుడు... "ఏమయ్యా! మావాడు తిరు పతిని కేకేస్తే నువ్వు దిగి పోయావు" అన్నాడు తెనాలి లోని రైల్వే పాంయిట్స్‌మాన్.

నాగమణి (వైజాగ్)

---

'భార్య ఎంతటి అందగత్తె అయినా పట్ట పగటివేళ నడివీధిలో పక్కనే గొడుగు పట్టుకొని నిలబడి అడుగులకు మడుగు లొత్తుతూ అగ్గగ్గ లాడిపోతారా ఎవరయినా ! ఇదేమి విడ్డూరమమ్మా! ఎక్కడ చూడలేదు ! పోనీ ఆతగాడికి సిగ్గు, శరము లేకపోతే ఆ వగలాడి కయినా ఉండక్కరలేదూ ? తగుదునమ్మా అని భుజము భుజమురాసుకుంటూ నడిచిపోతుందా?అతగాడి కేమయినా మతి పోయిందా? ఆ ఒయ్యారి ముఖంకేసి అదేపనిగా అలాగ చూస్తా డేమిటి ? ఇక నడివీధిలో జనంవైపే చూడ డేమిటి ?'

క్రమక్రమంగా రాజవీథిలో గుసగుస లెక్కువయి వయినాయి. జనం చెట్లనీడలలో గుంపులు గుంపు లుగా గుమిగూడి అదే పనిగా వా రిద్దరి వింత వైఖరి పరిశీలించడం ప్రారంభించారు. అప్పటికి హేమసుందరికి తమ పరిస్థితి అంతా బోధ పడింది. మరి భరించలేక రంగనాయకుని వైపు కొంచెం నిశితంగా చూసి చెవిలో ఊదింది:

'అదిగో చూడండి! లోకులందరు గుంపులుగాజేరి మనకేసి చూసి విరగబడి నవ్వుకొంటున్నారు. మీకేమి సంకోచం లేకపోతే నాకయినా ఉండ వద్దా ! చాలు చాలులెండి ! మీ అభావ చేష్టలు! ఇదిగో నేనిక మీ సరసన నిలబడ దలచుకోలేదు. దయచేసి కొంచెం తొందరగా నడక సాగించండి. నేను మీ వెనకాలే నడిచి వస్తానులెండి! '

అయినా రంగనాయకు డామె మాట పాటించ లేదు. అంతేకాదు! అతడా జనంవైపే చూడలేదు! ఆమె విశాల నేత్రాలమీద, వల్లమాలిన సిగ్గుతో ఎర్రబడిన చెక్కిళ్లమీద అతని దృష్టి నిశ్చలమై నిలిచింది. పాదా లప్రయత్నంగా ముమ్ముందుకు సాగి పోయాయి. లోకుల ధోరణి గమనించిన హేమ సుందరి మరి ఓరిమి వహించలేక వెనుకంజవేసి పక్కకి తప్పుకోవాలని ప్రయత్నించింది. కాని రంగ నాయకు డామె ప్రయత్నం కొనసాగనీయలేదు. ముంగురులమీదగాని, ముఖంమీద గాని, కటాక్షాల మీదగాని చెక్కిళ్లమీదగాని చెదురుపాటుగా నయినా సూర్యకిరణ లేశమయినా సోకనీయలేదు! హేమ సుందరి మరి గత్యంతరం లేక సిగ్గుతో చిమిడిపోయి, తల వంచుకొని మరింత తొందరగా నడక సాగించింది. ఆమె అందెల సవ్వడి మంద్ర మంద్రంగా రాజవీథిలో నలువైపుల ప్రతిధ్వనించింది. అక్కడక్కడ నిలబడిన పౌరులు కొంద రదేపనిగా విపరీతమయిన విడ్డూరంతో వారివైపు చూచి గుసగుసలాడు కొంటున్నారు.

మరికొంతసేపటికి హేమసుందరీ రంగనాయ కుల కిద్దరికి అల్లంత దూరంలో అయిదారుగురు యతీశ్వరు లెదురయినారు. వా రందరు బాట పక్కన ఒక మామిడిచెట్టు నీడలో నిలచున్నారు.

ఆ కాషాయాంబరధారుల వెనకభాగంలో పది పదిహేనుగురు అనుచరు లెంతో అణకువతో శిర స్సులు వంచుకొని ప్రగాఢ భక్తితో గొంతులెత్తి మధుర స్వరాలతో ద్రవిడ వేద పాశురాలు పఠిస్తు న్నారు. కొంచెం సమీపించిన తరువాత గాని రంగ నాయకుడు వారివైపే చూడలేదు. ఆ యతీశ్వ రుల పాశుర పారాయణఘోష హేమసుందరి ముఖం మీద నిలిచిన అతని చూపు రవంత మరలించింది. వా రందరి మధ్య సమున్నతమూర్తి యతీశ్వరు డొకడు నిశ్చల విశాల నేత్రాలతో రంగనాయకుని ముఖవైఖరి పరిశీలిస్తున్నాడు! ఆయన పెదవులపై పారిజాత పుష్పం వంటి లేత చిరునవ్వు తరళిం చింది. రంగనాయకుని కిక అడుగు పడలేదు! రెండు మూడు నిముషాలపాటు అలాగే నిలబడిపోయాడు.

ఆ సమున్నతమూర్తి ఆజానుబాహువు! పండు తమలపాకు వంటి శరీరచ్ఛాయ ! కొంచెం కొన దేరిన సమున్నత నాసిక. బలిష్ఠమయిన శరీర దార్ఢ్యాన్ని బట్టి పరిశీలిస్తే అయిదు పదుల సంవత్సరాల వయస్సున్నట్టు స్ఫురించింది. కాని ముఖంలో మాత్రం అంతకన్న అత్యధికమయిన వయః పరిణామమే గోచరించింది. నిర్మల పద్మ పత్రాల వంటి ఆ యతీశ్వరుని వెడద కనుదోయి వైపు చూడగానే రంగనాయకుని హృదయంలో హేమసుందరి సుదీర్ఘ నేత్రయుగళి తళుక్కుమని మెరిసింది! అత డంతకుమును పెన్నడు ఆమె కళ్ల కన్న సువిశాలమ్ములయిన విలోచనా లెక్కడ చూచి

# విశాలనేత్రాలు

ఉండలేదు. ఆ నేత్రాల తుదలలో చిన్న చిన్న సన్నని రేఖలు కొన్ని అల్లి బిల్లిగా అల్లుకొని విచిత్రమయిన సౌందర్యంతో తరళించాయి. 'మహారాజెవరో సన్యసించి శ్రీ రంగేశాయిని సేవించుకొంటున్నారు కాబోలును! లేకపోతే ఆ కళ్లలో అంతటి తీవి, రాజసము ఎలాగ వస్తాయి!' అన్న ఆలోచన అప్రయత్నంగా అతని మనస్సులో మొలకెత్తింది. ఒంటిమీద కప్పుకొన్న కాషాయ వస్త్రంతో కలిసిపోయిన ఆ యతీశ్వరుని శరీరచ్ఛాయ మధ్యాహ్న సూర్యకాంతిలో మరింతగా మెరిసింది! శ్రీ రంగేశుని పాద ముద్రికల వంటి ఊర్ధ్వపుండ్రాలు రెండు తెలితెలి కాంతులతో నెన్నుదురు టిపై భాగం పర్యంతము విస్తరించాయి. మధ్యప్రదేశంలో సన్నని శ్రీ చూర్ణతిలకం క్రమక్రమంగా కొసదేరి ఫాలతలి అతిక్రమించింది.

క్షణకాలంపాటు ఆ సుదీర్ఘమూర్తి గభీర దృష్టి, రంగనాయకుని చూపు ఒండొంటితో మేళవించాయి. అంతలోనే ఆయన అనుచరులతో బాటు తిరిగి దేవళంవైపు తన ప్రస్థానం ప్రారంభించాడు. మరికొన్ని నిమేషాలలోనే వారి నిద్దరిని సమీపించాడు. హేమ అది గమనించి బాగా సంకోచించి విపరీతమయిన సిగ్గుతో కుంచించుకుపోయి అటు ఇటు ఒదిగింది. కాని రంగనాయకు డంతగా లక్ష్యపెట్టలేదు. చూచీ చూడనట్టు ఉపేక్షించాడు. తిరిగి నెమ్మది నెమ్మదిగా నడక సాగించాడు. అంతలోనే ఆ సమున్నమూర్తి అంతేవాసులతోబాటు వారి కెదురు పడ్డాడు. ఆపైన హేమ మరి రంగనాయకుని సరసన నిలబడలేదు. కొంచెం వెనకపడి తల వంచుకొని అతని ననుసరించింది. కాని రంగనాయకు డంగీకరించలేదు.

'ఎండ చుర్రుమనడం లేదూ ! ఎందు కలాగ కంగారు పడతావు! భయం లేదులే ! గొడుగు నీడలోకి రా !'

బాట మధ్య నిలబడి కనుసన్నతో పిలిచాడు. అయినా హేమసుందరి గొడుగునీడ కిందికి రాలేదు. రంగనాయకుడే కొంచెం వెనక్కి వెళ్లి ఆమె ముఖాని కెదురుగా గొడుగెత్తి పట్టుకుని చిరుకోపంతో ఎరుపెక్కిన ఆమె కటాక్షాల సోయగం తదేకదృష్టితో పరిశీలించాడు. దానిమీద హేమసుందరి మరింతగా కోపగించి ధుమధుమలాడింది.

'చాలు చాల్లెండి ! మీ కొంటెవేషాలు ! ఊరువాడ మనల్ని ఇద్దర్ని గురించి ఎంతో విడ్డూరంగా చెప్పుకుంటున్నారు! స్వాములవారున్నారని కూడా గమనించకపోతే ఎలాగ ?'

'హేమా ! మన మేమన్నా పరాయివాళ్లమా! వాళ్లంతగా ఆడిపోసుకోవడానికి ! ఈవేళ స్వామి సమక్షంలో మన కిద్దరికి వివాహం జరిగిపోయింది! పురోహితులు మన ఇద్దరి పేరులతోను సలక్షణంగా పూజా పునస్కారాలు జరిపించేశారు. ఇక మన మిద్దరము భార్యాభర్తలమే గాని పరాయివాళ్లం కాదు. అనవసరంగా నీకీ లేనిపోని సంకోచ మెందుకు ?

'ఎంత భార్యాభర్తలమైతే మాత్రం ! కొంచెం ప్రపంచానికి వెరవద్దూ !'

'అయ్యో వెర్రిదానా ! నిజానికి బాగా భయపడి వలసినప్పుడు నీ వెక్కడ చెక్కు చెదరలేదు. ఊరికే ఉత్త పుణ్యానికి ఇప్పు డెందుకీ ఆరాటం ? చూశావా ? ఎండ పొడ పడి నీ చెక్కిళ్లలాగ వాడిపోయాయో !'

అయినా హేమసుందరి అతని ప్రార్థన కంగీకరించలేదు. అంతలోనే ఆ యతీశ్వరు లందరు వారి నిద్దరిని అతిక్రమించి ముమ్ముందుకు సాగిపోయారు. ఆ సుదీర్ఘమూర్తి సునిశితవీక్ష తిరిగి రంగనాయకుని నేత్రాలలో గాటంగా నాటుకొన్నది. అయినా అత డంతగా లక్ష్యపెట్టలేదు. కాని ఎందుచేతనో ఒక్కసారి వెనక్కి తిరిగి చూడాలని పించింది. తన దృష్టి అటువైపు మళ్లించాడు. ఆ సుదీర్ఘవ్యక్తి అదేవిధంగా వెనుదిరిగి నిశ్చల దృష్టితో రంగనాయకుని వింత ధోరణి పరిశీలిస్తున్నాడు! అంతటి సూక్ష్మ పరిశీలన కేమి కారణమో రంగనాయకుని కవగాహన కాలేదు. అయినా అత డంతగా ఆందోళన పడలేదు. లోకులు కాకులు! ఎవరికి తోచినట్టు వా రను కొంటారు. అవన్ని పట్టించుకుంటే ఎలాగ !' అని తనలో తాను సమాధాన పడ్డాడు. అయినా ఆ యతీశ్వరు డెవరో కొంచెం కనుక్కోవాలని అనిపించింది. తన కనతిదూరంలో రాజవీథిలో నడి సాగిపోతున్న ఒక వృద్ధుని వైపు తిరిగి కొంచెం సమీపించి ఆయన సంగతి ప్రశ్నించాడు. అత డది విని రవంతసేపు నిర్ఘాంత పడ్డాడు.

'మీరెవరో గాని ఈ ఊరికి బాగా కొత్తవారులా ఉన్నారే ! వారినే ఎరగరా ! అదిగో ! ఆ మధ్యన ఉన్నవారు శ్రీమద్రామానుజ యతీంద్రులు! మిగిలినవా రందరు వారి అంతేవాసులు !'

'ఓహో ! అలాగా' అని రంగనాయకుడు తిరిగి హేమసుందరి దగ్గిరికి వెళ్లిపోయాడు. అత డంతకుమును పెన్నడు రామానుజయతి పేరే వినలేదు. అందుచేత ఆ వృద్ధుని మాటలవల్ల ఆయన సంగతి ఆవంతయినా బోధపడలేదు. 'ఎవరో సన్యాసి కాబోలు ! అయితే మాత్రం నాకేం ?' అని కొంచెం వెటకారంగా నవ్వుకొని, లోలోపల సమాధానపడి హేమతో కలిసి త్వరగా నడక సాగించి తన భవంతిలో ప్రవేశించాడు.

—ఇంకా ఉంది

## సెట్సుమీద

# వాల్టా ప్రొడక్షన్సు చిత్రం

వీనస్ స్టూడియోలో నిర్మించిన వాల్టా ప్రొడక్షన్స్ వారి 'ఖరీదైన' సెట్టు—గంభీరంగా ఉంది. నిశ్శబ్దంగా ఉంది—కెమెరాముందు నించొన్న నాయకీ నాయకులు తీయబోయే సన్నివేశానికి సన్నద్ధులవుతున్నారు. 'యస్ రెడీ' అన్నాడు రామారావు, మూడ్ లోకి వెళ్తూ. 'రెడీ' అన్నాడు కెమేరామీదనుంచి కమల్ ఘోష్.

"స్టార్ట్" అని దర్శకుడు మానాపురం అప్పారావు 'ఆనతి' ఇచ్చాడు. కెమెరా తిరిగింది.

"క్లాప్"

క్లాప్ వెళ్ళిపోయింది.

నాయకి సుశీల ఖిన్నురాలై కనిపించింది. ఆమె ముఖం వెలవెలబోతున్నది. కళ్ళవెంబడి నీళ్ళు బయటకు రాబోతున్నై. ఆ సంగతి గమనించని రఘు—"సుశీ! నువ్వా! ......ఏమిటిది? చేరువలో ఉండి కూడా దాగుడుమూతలెందుకు? ఇది కలనుకున్నాను" అన్నాడు సంతోషంగా, ఆశ్చర్యంగా.

"అలా అనుకోవడమే మంచిది" అన్నది సుశీల—నిశ్చలంగా.

"సుశీ! నీకోసం ఎక్కడెక్కడో వెతికాను. నువ్వు కనబడక, ఎంతగానో ఆవేదనపడ్డాను. అయితేనేం—రావలసిన చోటుకే వచ్చావు. కావలసినవారి సన్నిధిలోనే ఉన్నావ్........ఇక నీ బాధలన్నీ మరిచిపో!" అన్నాడు రఘు.

"మరిచిపోవలసింది నేను కాదు, మీరే నన్ను మరచిపోవాలి" అన్నది సుశీలపొంగి పోతున్న దుఃఖాన్ని అవుకుంటూ.

రఘు కేమీ అర్థం కాలేదు. అతను అగమ్యంగా చూస్తూ—"సుశీ!" అన్నాడు—దిగ్భ్రాంతుడై.

"కట్"

కెమెరా ఆగిపోయింది; సౌండ్ రికార్డింగూ ఆగిపోయింది.

"ఓకే" అన్నారు. షాట్ కాగానే సుశీల, రఘూ—అంజలీదేవి, రామారావులుగా మారిపోయారు. షాట్ బాగా వచ్చిందా అని కనుక్కొన్నారు.

"బావుంది" అన్నాడు దర్శకుడు.

"వెరీ గుడ్"

తర్వాత షాటుకు ఉద్యుక్తులయ్యారు—కెమెరావారు. అసలు, ఈ కథలో ఏమిటంటే—సుశీలా, రఘూ ప్రేమించుకున్నారు. కొన్నాళ్ళకు ఇద్దరూ విడిపోవలసివచ్చింది. తర్వాత రఘుకు సుశీల కనిపించలేదు. అతను తన ఊరు వెళ్ళగా—తన ఇంట్లోనే, తన సుశీల పనిమనిషిగా ఉండటం చూశాడు! ఇది ఎట్లా జరిగింది? ఆమె పనిమనిషిగా ఆ ఇంటికే ఎట్లా వచ్చింది? రఘు ఏం చేస్తాడు? తర్వాత కథ ఎట్లా సాగుతుంది?—వెండితెరపై చూడాలి.

వాల్టా ప్రొడక్షన్స్‌వారు వీనస్‌లో నిర్మిస్తున్న ఈ సాంఘిక చిత్రం నాలుగు రీళ్ళు దాటింది. పైవారుకాక, ఈ చిత్రంలో రేలంగి, గుమ్మడి, రాజనాల, కన్నాంబ, గిరిజ, చలం, సూర్యకాంతం (గెస్టు), కె. వి. యస్. శర్మ మున్నగువారు నటిస్తున్నారు. ఈ చిత్రరచన: సముద్రాల (జూ); సంగీతం: పెండ్యాల నాగేశ్వరరావు; పాటలు: శ్రీ శ్రీ, కొసరాజు; కళ, దర్శకత్వం: మానాపురం అప్పారావు; వ్యవస్థాపకులు: జాస్తి వెంకటేశ్వరరావు.

ఈ షాట్ తర్వాత 'బ్రేక్' వేశారు. ఆరోజు షూటింగులో ఆ ఇంటి నౌకరుపాత్ర కూడా వస్తుంది. ఈ పాత్రను కాకరాల అనే కొత్త నటుడు నటిస్తున్నాడు. నాటకరంగంమీద ఇతనికి మంచిపేరుంది. ఇతనుకాక, ఈ చిత్రంలో మరికొంతమంది కొత్తవారు కూడా కనిపిస్తారుట. 'సు' ★



విశాల్ ప్రొడక్షన్స్ వారి 'మదనకామరాజు కథ'లో మీనాకుమారి.

రాజ్యలక్ష్మీవారి 'రక్తసంబంధం' రిహార్సల్ లో కాంతారావు, సావిత్రి, రామారావు, దేవిక. ఫోటో : రూప.

# తెలుగు పత్రికలన్నిటిలో 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' సర్క్యులేషన్ అధికమైనది

## సినీతారల ఫోటోలు

మీ అభిమాన సినీతారల ఒరిజినల్ ఫోటోలు (నటీ, నటులవి) అందమైన పోజులలో కార్డు సైజు డజను వెల రు. 5/– పోస్టేజి రు. 1/– అదనం.

CINE PHOTO DISTRIBUTORS

(P.O.) RELANGI (W.G.)

స్థాపితం: 1920

## రెడ్డి & కో, (రిజిష్టర్డు)

గోపాలపురం — తూ. గో. జిల్లా

బొల్లి, మేహపొడ, మేహమచ్చలు వగైరా సమస్త చర్మవ్యాధులకు ప్రత్యేక చికిత్స

శాస్త్రీయ ఆయుర్వేద ఔషధములు లభించును.

కేట్లాగు సలహా ఉచితం.

## పాదాలలో ఆనెలు

పాదాలలో ఆనెలు, కండలు పెరిగి, వ్రేళ్లపాతుకుపోయి పాదము నేలపై బెట్టలేక రాళ్ళ తగిలిన త్రుళ్లిపడు వారు పైపూతగా వాడిన వ్రేళ్ళతోసహా మాయంచేయు గల సంజీవి. వెల పోస్టుఖర్చులతో రు. 4–25న.పై.

కొక్కోకము చిత్రపటములు గలది. రు. 1–50

దాంపత్య రహస్యములు ... రు. 3–00

తెలుగు హిందీ స్వయంశిక్ష రు. 4–50

పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

ప్రభ అండ్ కో.

3, మలయపెరుమాళ్ వీధి, మద్రాసు-1.

## ఆదాయము కావాలంటే



ఇంటింటా కుట్టు పని నేర్చి మీ సొమ్ము ఆదా చేయండి. నేర్చుకొనుటకు ప్రత్యేక గ్రంథం—అందరు టైలర్లే రు. 5/- 266 పే. 180 బొమ్మలు, అందమైన ఫుల్ క్యాలికో బైండు. బెతాయింపు రు. 3–50. కత్తిరింపులు రు. 1/–. రహస్యబోధిని రు. 0–62. ఈ 4 తెలుగు. వి. పి. అదనము.

జీ. పున్నారావుచౌదరి, మోపర్రు, తెనాలి తా.

## చవనామృతము (Elixir-De-Chavana)

అందరూ వాడదగిన టానిక్కు




## బాలరక్ష

పిల్లల ఆరోగ్యమునకు.

కోరువారికి సూచీ పత్రములు పంపుదుము.

స్టాకిస్టులు కావలెను:

లక్ష్మీనారాయణ కంపెనీ, కాకినాడ




### వివిధ పట్టణములలోని స్టాకిస్టులు

| | | | |
|---|---|---|---|
| హైదరాబాదు — | శ్రీ డి. జె. ఫరేడ్ అండ్ కో | బెజవాడ — | శ్రీ చంద్రమౌళేశ్వర్ & కో |
| విశాఖపట్నం — | ,, బి. కుచేలరావుగారు | ,, — | ,, విజయలక్ష్మి ఆయుర్వేదిక్ స్టోర్సు |
| విజయనగరం — | ,, విజయా మెడికల్ సిండికేట్ | | |
| శ్రీకాకుళం — | ,, ధన్వంతరి మెడికల్ స్టోర్సు | ,, — | ,, సూర్యా మెడికల్, స్టోర్సు |
| ఆమదాలవల్స — | ,, టి. వెంకటస్వామి సన్సు | గుడివాడ — | ,, ప్రభాత్ మెడికల్ స్టోర్సు |
| శృంగవరపుకోట — | ,, శ్రీనివాస మెడికల్ స్టోర్సు | బందరు — | ,, మారుతీ స్టోర్సు, రాబర్టుసన్‌పేట |
| పిఠాపురం — | ,, లక్ష్మీనారాయణ మెడికల్ స్టోర్సు | గుంటూరు — | ,, పద్మ ఏజన్సీస్ |
| సామర్లకోట / పెద్దాపురం | ,, కె. వీరభద్రరావు & సన్సు | బాపట్ల — | ,, సుభా మెడికల్ స్టోర్సు |
| | | పిడుగురాళ్ళ — | ,, విశ్వనాధ మెడికల్ స్టోర్సు |
| రాజమండ్రిరము — | ,, ఈశ్వరదాస్ అండ్ కో | పొన్నూరు — | ,, ప్రభాత్ మెడికల్ స్టోర్సు |
| వింజరము — | ,, శ్రీరామా మెడికల్ హాల్ | నిడుబ్రోలు — | ,, భవాని మెడికల్ స్టోర్సు |
| పామర్రు — | ,, ధన్వంతరి ఆయుర్వేదస్టోర్సు | తెనాలి — | ,, సారధీ మెడికల్ స్టోర్సు |
| ఏలూరు — | ,, సాంబశివ మెడికల్ స్టోర్సు (ఏజన్సీస్) | రేపల్లె — | ,, కొమ్మూరి నర్సయ్యాండ్‌సన్సు |
| | | విస్సన్నపేట — | ,, విజయా మెడికల్ స్టోర్సు |
| నర్సాపురము — | ,, జి. కామేశ్వరరావుగారు | నెల్లూరు — | ,, పి. దొరస్వామి అండ్ సన్ |

## మీరు ఉబ్బసముతో బాధపడుతూ ఉంటే ఎఫాజోన్ వాడండి




తయారీ మరియు పంపకపు దారులు:
జె.ఎల్. మోరిసన్, సన్ అండ్ జోన్స్
(ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
బొంబాయి . కలకత్తా . మద్రాసు . ఢిల్లీ

JMEY-I-TEL

# కూచిపూడి నాట్యము

15-వ పేజీ తరువాయి

కూడా చాలా ప్రసిద్ధి చెందింది.

నాట్యం అనేది జీవకళ, అతి పవిత్రమైంది. నాట్య సమయంలో నర్తకుల శరీరాన్ని దేవతలు ఆశ్రయిస్తారట. కనుకనే నర్తకుల అవయవ నిర్మాణాన్ని కూడా శాస్త్రకారులు నిర్దేశించి అర్హతలు నిర్ణయించటం జరిగింది. నర్తకి రూపవతి, ప్రసన్నముఖి, వర్ఛస్వినీఅయి, అతిగా లావు, పొట్టి, పొడుగ్గా కాకుండా సమదేహయై ఉండాలి. లావైన పెదవులు గల స్త్రీలు నాట్యాని కయోగ్యులట.

మన భారతీయ నృత్య రీతులలో మనోహరమైనది భరతనాట్యం. ఈ నాట్య ప్రదర్శనలో అలరింపు, జతి స్వరము, శబ్దము, వర్ణము, పదము, తిల్లాన అనేవి చాలా ప్రధాన మైనవి. కాని నేటి అభిరుచి మారి, శాస్త్రీయ భరతనాట్యంపై అభి



'శబ్దం' నృత్యంలో ఒకభంగిమ -చి॥ స్వర్ణలత

లాష తగ్గిపోయి కేవలం జిప్సీ నృత్యాలు, ఎంకి పాటలు మొదలైన వాటినే ఎక్కువగా ప్రదర్శిస్తున్నారు. అలాగే కష్టమైన అడుగులు, అభినయ విశేషాలు వదలివేసి ప్రదర్శన లిస్తున్నారు. విభిన్న రుచులతో కూడిన ఈ లోకంలో కొంత మంది ప్రేక్షకులకు అవి ఆనందం కల్గిస్తే కలిగించవచ్చు. కాని కూచిపూడి నాట్య ప్రశస్తి, ఇలాటి కష్టమైన వాటిని సాధించి ప్రదర్శించటంలోనే ఉంది. అందువల్ల అలరింపు, శబ్దము మున్నగు శాస్త్రీయమైన వాటికే ప్రాధాన్యం ఇస్తూ, నాట్యశాస్త్ర ప్రాశస్త్యము, ఉన్నత ప్రమాణాలు తగ్గకుండా దేశంలో భరత నాట్యాన్ని విరివిగా ప్రచారం చేయుటం కళాభిలాషు లందరి విధ్యుక్తధర్మం.

ఓం శివం. 

## రాజధాని కబుర్లు

11-వ పేజీ తరువాయి

కంపిస్తూ ఉండటమే! ఇక పీడిత ప్రజానాయకులు, కార్మిక వీరులు, కర్షక ధీరులు, ఈ బీద ప్రజల్ని ఉద్ధరించటానికి బయలుదేరే నాలుగు తాటాకుటిళ్ళమధ్య ఓ స్తంభం ప్రతిష్ఠించి, ఓ యూనియన్ పేరుపెట్టి, అట్టమీద వ్రాసి అతికిస్తారు. ఇది శ్రీరామరక్ష. దీని నీడన వాళ్లంతా సురక్షితంగా సంచరిస్తూ ఉంటారు. ఈవిధమైన దృశ్యాలు, ఈ విశాల హైదరాబాదులో కొల్లలు కొల్లలుగా కనిపిస్తాయి. ఇవి రాజధాని నగరానికి శోభ నివ్వకపోవటమే కాకుండా చాలా వికృతంగాను, అసహ్యంగానూ కనిపిస్తాయి. అటు ఉన్నవారికీ ఉపయోగం లేదు. కాస్త జల్లు పడి కొద్దిగా గాలి వీచేటప్పటికి ఎవరిల్లు ఎక్కడుందో వెతుక్కోవాల్సిందే! వీళ్లందరికి, శాశ్వతమైన నివాసం కల్పించటానికి ఈ 'నాయకులు' ఎందుకు ఆలోచించరో అర్థంకాదు. మునిసిపాలిటీవారు వీటి విషయంలో ఎంతవరకు బాధ్యత తీసుకుందా మనుకుంటున్నారో కూడా అంతకంటే అయోమయం!

* * *

నయాపుల్ వంగింది. టాంక్‌బండ్ కంగింది! అయితే ఏం! ముసురుపట్టిన జీవితాల్లో కళ కళలు బయలుదేరినాయి. మొహాలు విప్పారుతున్నాయి. నీరు చుట్టేసిన భవనాల్లోంచి, మెల్ల మెల్లగా ఒక్కొక్కరే బైటకు వస్తున్నారు. ఫెళ్లన ఎండ కాచింది. ఆవేశంగా ప్రవహిస్తున్న మూసీనది తళతళ మెరిసింది. అందరూ నిట్టూర్పారు. ఈ తడిసి ముద్దయిన బట్టలు ఎప్పటికి ఆరుతాయో యని! ఎండలో వచ్చి నిలబడ్డారు! అబ్బ! సూర్యుణ్ణి చూసి ఎన్నాళ్లయిందీ అనుకుంటున్నారు. సూర్యరశ్మిలో అంత చైతన్యం ఉంది. అంత ఆనందం ఉంది. నిరాశ్రయులైన వేలాది ప్రజలకు పునరావాసం కల్పించటానికి చురుకుగా ఏర్పాట్లు జరుగుతున్నాయి. పాఠశాలలు ధర్మశాలలు నిండిపోయినాయి. తాత్కాలికంగా అందరూ జాలిపడతారు. చేతనయిన సహాయం చేస్తారు! అయితే ఇది ఒకనాటితో అయ్యేదికాదు. శాశ్వత పునరావాసానికి ఏర్పాట్లు జరగాలి. ఎన్నో పురాతన గృహాలు ఈ వారం రోజులబట్టీ కావలసినంత నీరు పీల్చుకుని, భూమిమీదికి ఒరిగినాయి. ఇంకా కొన్ని మీద పడతామని బెదిరిస్తున్నాయి. వీటి సమస్య పరిష్కరించాలసి ఉంటుంది. వాన వెలిసింది. వరద తగ్గింది. గతానుభవాన్ని దృష్టిలో పెట్టుకొని, ముందు చెయ్యాలిసి కార్యక్రమం పట్ల దృష్టిని మరల్చటం ఎంతైనా అవసరం.

* * *

ఓ మూల ఏకధాటిగా వర్షం కురుస్తూనే ఉంది. శ్రీ ఆదిరాజువారిమీద ప్రశంసలు కురిపిస్తూనే ఉన్నారు. శ్రీ ఆదిరాజు వీరభద్రరావు గారు నిరాడంబరులు, యువకుల్ని ప్రోత్సహించట మనేది ఆయనలో ఉన్న ప్రత్యేకమైన గొప్ప లక్షణమని కొనియాడారు. వారి నిరాడంబరత్వం వారి విగ్రహంలోనే మూర్తీభవించి ఉంది. తెలుగు భాషావికాసానికి, వారు చేసిన ఏళ్ళేళ్ళ కృషికి ఈనాడు ఈ సన్మానం కావచ్చు. కాని హృదయ లాలిత్యం, నిర్మలమైన మనస్సు, అవ్యాజమైన ప్రేమ, శిష్య వాత్సల్యం మొదలైన వారి వ్యక్తిగత గుణాలకు కూడా ఈ ఘనత చెందుతుం దనుకోవటం మనల్ని మనం గౌరవించుకున్నట్టే అవుతుంది. అంత పెద్ద వర్షంలో కూడా శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయం, జనంతో కిక్కిరిసి పోయిందంటే, ఆయన పట్ల ఉన్న గౌరవాభిమానాలు వ్యక్తమవుతున్నాయి. అనేక సాహిత్య సంస్థలు, అనేకమంది ప్రముఖ వ్యక్తులు పూనుకుని చేసిన ఈ ఘనమైన సన్మానం చెప్పుకోతగ్గ స్థాయిలోనే జరిగింది. ఎక్కువ ప్రచారం లేకుండానే, సన్మానసంఘంవారు, అయిదువేల నిధిని సేకరించి వారికి సమర్పించటం ఎంతైనా సముచితంగా ఉంది. ఇంకా నిధిని సేకరించటానికి జరుగుతున్న కృషి కూడా హర్షణీయమే.! ప్రభుత్వం మీద ఆధారపడకుండా, స్వయంకృషిమీద జరిగే మంచి పనులకు ప్రజల అండదండ లుంటాయనటానికి ఇదొక నిదర్శనం. ఆ రోజుల్లో ఓ మహారాజు, కవుల్ని, విద్వాంసుల్ని సత్కరిస్తే, ఈ ప్రజాస్వామ్య యుగంలో, ప్రజలే అలాంటి పని చేయాలి. వారే పూనుకుని తగిన వారికి ఉచిత రీతిన సన్మానం చెయ్యటం ఆరోగ్యకరమైన సాంప్రదాయం.

ఐ. యల్. యన్. ★

---

## హరివంశము

13-వ పేజీ తరువాయి

విషయమును చెప్పుచున్నాను.

"చెప్పుము. చెప్పుము. విందును. విందును. మహారాజా! తాము గూడ వినవలయును.."

కంచుకి మరల ఇట్లు చెప్పెను : తల్లీ! ఆచార్యుని దుఃఖము అతివేలము కాగా, శ్రీకృష్ణదేవుడాయనను సమీపించి "తండ్రీ! ఉపాధ్యాయ! ఆచార్య!" అని సంబోధించినాడు. ఆచార్యులు శ్రీ కృష్ణదేవుని కన్నులలో కన్ను లుంచి చూచినారు. "నాయనా! నీవు నాకు దిక్కు! నిన్ను చూచికదా సర్వ దుఃఖములను మ్రింగుచున్నాను. ఏమి చేయమందువు! కాశికను విడిచిపోవలయు గదా అని విచారించుచున్నాను" అనినారు. 'ఆచార్య! తాము ఎవ్వరు! సాక్షాత్ పరబ్రహ్మ మనగా అది తాము. తమయందు లేని తీర్థములు వేర యున్నవా! నేను తమకు శిష్యుడను. చెప్పగలవాడను కాను. క్షైబ్యము తమబోటి వారికి చెల్లునా! కాశిక ఎక్కడలేదు. తాము ఎక్కడ నున్న అక్కడనే కాశిక. దుఃఖము జడుల లక్షణము. సాక్షాత్చైతన్యమునైన మీకు దుఃఖము ఏమిటి..." అనినాడు. ఆచార్యులు అంతలో తెప్పరిల్లినారు. శరత్తులో గంగ అంత విశదముగా నుండదు. అంతగా ఆచార్యుని ముఖము విశదమైనది. నాకు అదే విచిత్రమనిపించినది.

"తరువాత!" అనినది సుదక్షిణ.

"తరువాత ఆచార్యులు ఆచార్యాణిని చూచి ఇట్లు అనినారు. ఆచార్యాణి! బయలుదేరుమా! మనము పోవుచున్నాము. శిష్యులును వచ్చుచున్నారు. ఇది యంతయు నేమిటి? ఈ ఆశ్రమములో నిక మనకేమి పని. అన్నియు నిచ్చట వదిలివేసియే పోవుదము. జీర్ణవస్త్రమును వదిలినట్లు వదిలివేయుదము" అని అచ్చటి విప్రులను క్షత్రియులను, వైశ్యులను, శూద్రులను అందరిని సంబోధించి "మేము ఇక కాశికను వదిలి పోవుచున్నాము. మరల ఎప్పుడో అవిముక్త దర్శనము" అన్నారు.

"కంచుకీ! ఆచార్యులు సశిష్యముగా పాదచారులై కాశికను వదలిరా!"

"అంతయు నాకు తెలియదు. నాకు తెలిసినదిది. ఆచార్యులు బయలుదేరబోవుచుండగా, మాతలియు, మరికొందరు సూతులును రథములతో వచ్చిరి. మాతలి శ్రీ కృష్ణదేవుని సమీపించి ఏమో విన్నవించుకొనెను. ఆయన "అట్లులనా!" అని మందహాసము చేసెను. నేను చూచుచుండగా భగవంతుడు ఒక్క రథమునకు సారథియై, ఆచార్యుని, ఆచార్యాణిని, మహానందులవారి భార్యను ఆ రథము నెక్కించుకొని బయలుదేరెను. నేను అప్పుడు ఆయనను సమీపించి అడిగితిని! "స్వామి! ఎంతదాక పోవుచున్నారు?" అని. ఆయన నాతో అనిన మాటయేమో తమకు ముందుగానే మనవి చేసుకొని యుంటిని. ఆ రథము బయలుదేరుట చూచి ఇటు వచ్చితిని."

> అరుదుగ నీ ముఖంబు కలలందున కాంచి
> కలాకలాపి సుందరతర చంద్రదమ: కిరణమంథర
> గంధ కుటీ జటా కిరీట రుచిరమూర్తి!
> నీ అడుగుతావులు నెమ్మదినుంచి కొల్తు
> సుందరగిరి ధారణైక ప్రమథమ్మగు మూర్తి
> నుపాస్తి చేయగన్.

—హారీత శివశర్మ



అతని అర్ధాంగి. మొనాకో రాణి ఐపోయింది.

ఈ దంపతుల తొలి పంట కారొలిన్ లూయి మార్గరెట్ జనవరి 23 వ తేదీ 1957 వ సం.లో జన్మించింది.'మా తరఫున మీరు కూడా భగవంతునికి ధన్యవాదాల నందించి ఆనందం వేడుకలూ చేసు కొండని' రైనీర్ తన ప్రజలకు సందేశ మిచ్చాడు. ఈ చిన్న రాజ్యమంతా పెద్దగా వేడుకలు చేసుకున్నారు. యువరాణి జన్మదినోత్సవం అలా వేడుకగా జరిగిన తర్వాత మరుసటి సంవత్సరం 14 వ తేదీనాడు రాజ్యానికి వారసుడు జన్మించాడు.

ఈసారి 101 సార్లు ఫిరంగులు ప్రోగాయి. యువరాజు ఆల్బర్ట్ అలగ్జాండర్ జన్మించాడు.

నిజంగా మగపిల్లవాడే రాజ్యానికి వారసుడు అవ్వాలీ అనే సంప్రదాయం మొనాకోకు లేదు. ఆల్బర్ట్ పుట్టకపోతే కారొలిన్‌కే సింహాసనం దక్కేది ఆడపిల్ల రాజ్యానికి వారసురాలు కారాదనే నియమమే లేదు మొనాకో రాజ్యంలో. రైనీర్ రాజు కూడా ఈ సింహాసనానికి తల్లి తరఫున వారసుడు అయ్యాడు. రైనీర్ తాతగారి నుంచి రాజ్యభారాన్ని పుచ్చుకున్నవాడు. రైనీర్ తల్లి వణి ఛార్లెట్ తన కుమారుని కోసరం 1944 సం. జూన్ 2 వ తేదీనాడు సింహాసనాన్ని యిచ్చేసింది.

1949 వరకూ రైనీర్ రాజు తాతగారే రాజ్యభారం వహించారు. 1949 వ సం. లో ఆయన మరణించిన తర్వాత రైనీర్ పట్టాభిషిక్తుడయ్యాడు.

రైనీర్ ఫోటోలో అంత బాగా పడడు. కామిరాను చూస్తే చాలు ఎక్కడలేని గాంభీర్యము వచ్చేస్తుం దతని మొహంలో.

మామూలుగా చాలా అందంగా చలాకీగా ఉంటాడు మొనాకో రాజు. మంచి దేహదార్ఢ్యం, శరీర సౌష్టవం గల రైనీర్ తన రాణికన్నా కాస్త పొడుగ్గా అయిదడుగుల తొమ్మిది అంగుళాలు ఉంటాడు. ముప్పై ఎనిమిది నలభై సంవత్సరాలరాజు ఫోటో అంటే చాలు ముద్దు మొహం పెట్టేస్తాడు.

రైనీర్‌కు చాలా సరదా లున్నాయి. అతనికి చాలా శాస్త్రాలు తెలుసును. ఇంచుమించు శిల్ప శాస్త్రం మొదలు ఈత వ్యాయామం మొదలైనవాటి వరకూ అతనికి క్షుణ్ణంగా చాలా సంగతులు తెలును. ఒక్కొసారి అతని విజ్ఞానానికి ముందు రాణిగ్రేస్ ఓటమి నంగీకరించాల్సి వస్తుంది. జంతుశాస్త్రం గురించి అతనికి ఎంత విజ్ఞాన మున్నదో మోటార్ కార్ల రేసు గురించి కూడా అంత వివరంగా అత నెరుగును. రాజు ఇంగ్లాండులో విద్యాభ్యాసం చేశాడు. అతను చదువుకున్నవి రెండు ఇంగ్లీషు పాఠశాలలు. అప్పు డతను బాక్సింగ్‌లో ఛాంపియన్ కూడా.

స్విట్జర్లాండులో చదువుకున్నప్పుడు రైనీర్‌కు గల నటనా చాతుర్యం ప్రతిభ బాగా రాణించాయి. అటు తర్వాత యూనివర్సిటీలో కూడా అతనికి

# నేనూ మా రాజుగారూ

9—వ పేజీ తరువాయి

నాటకానుభవం ఉన్నది. పారిస్‌కు వెళ్లి మొనాకో రాజు రాజకీయాల శాస్త్రం కూడా అభ్యసించాడు.

చిన్నప్పటినుంచి చిరునవ్వుతో చురుకుగా మంచి పకడ్బందీగా ఉండే శరీర సౌష్టవం గల రైనీర్ యిప్పటికీ అలాగే అగుపిస్తాడు. కామిరాను చూస్తే మాత్రం, ఫోటో తీస్తామంటే మాత్రం .... అంతే మొహం ముడిచేస్తాడు!

వీరోచితమైన లక్షణాలు, ధైర్య సాహసాలూ

ఓ ఘరానావ్యక్తి బోనెక్కి—సాక్ష్యమిస్తున్నాడు. ముద్దాయి తరఫు న్యాయవాది ప్రశ్నలు వేస్తున్నాడు.

"దొంగతనం ఎన్ని గంటలకు జరిగింది?"

"నే నాలోచించిం దేమంటే"

పాపం ఆ పెద్దమనిషి మొదలు పెట్టాడు.

ఇంతలో న్యాయవాది అభ్యంతరం చెప్తూ "నీ ఆలోచనతో మాకు నిమిత్తంలేదు!" అని గుద్దురిమాడు.

"అయితే నా సాక్ష్యం అనవసరమనుకుంటా. నే నేం మీలాంటి న్యాయవాదినికాను ఆలోచించకుండా చెప్పగల్గటానికి" తక్షీమని సమాధానం చెప్పాడా పెద్దమనిషి.

(కమలాదేవి కాళీపట్నం)

గల రైనీర్ స్వచ్ఛందంగా రెండవ ప్రపంచ యుద్ధంలో పాల్గొన్నాడు. ఫ్రెంచి సేనలో 'గ్రిమాల్డీ' సెకండ్ లెఫ్టినెంట్ గానూ, తర్వాత సెక్సాన్‌లోని కాల్బలంలోని 36 వ విభాగంలో 'లయిజాన్ ఆఫీసర్' గాను రైనీర్ పనిచేశాడు. బెర్లిన్ కైవసమైనప్పుడు ఆ సేనలలో అతను ఉన్నాడు. వీరోచితమైన బిరుదు లతనికి లభించాయి కూడా.

ఈ 3 వ రైనీర్ రాజు మాటకు మొనాకోలో తిరుగు లేదు. ఆయన మాట శిలాక్షరమే. ఐరోపా మొత్తంమీద ఇది పూర్తి స్వతంత్ర రాజ్యమని చెప్పాలి. ఉదాహరణకు 1959 లో జరిగిన సంఘటనలను మనం పరిశీలించవచ్చును.

మొనాకోకు పద్దెనిమిది మంది సభ్యులు గల జాతీయ శాసన మండలి ఒకటి ఉన్నది. ఈ మండలి ఆఏడాదిలోఏంతకూ బడ్జెట్‌ను పూర్తిచేసిసమర్పించలేకపోయింది. రైనీర్‌కు ఓపిక నశించింది. ప్రజాశ్రేయస్సు దృష్ట్యా దానిని రద్దు చేసేశాడు. తానే స్వయంగా ఒక జాతీయ సలహా మండలిని నియమించుకుని పరిపాలన కొనసాగిస్తున్నాడు. నాటినుంచి అంతా సజావుగానే పోతున్నది.

వాస్తవానికి మొనాకో లాంటి చిన్న రాజ్యానికి ఇలాంటి పద్ధతి బాగానే నప్పుతుంది. ప్రజలకు ఆదాయం పన్ను కట్టాలనీ కార్పొరేషను పన్నులు చెల్లించాలనీ బాధ ఉండదు. నేరుగా ఆస్తి పన్ను కూడా వీరికి ఉండదు. పైగా అక్కడ ప్రజలకు నిరుద్యోగ సమస్య లేనేలేదుట!

ప్రభుత్వానికి అప్పు లేదు, సైన్యం కోసరం పెద్ద ఖర్చు లేదు. దేశంలో అవినీతి, నేరాలూ కూడా పెద్దగా ఉండవు. ఎక్కువగా విలాస యాత్రికులవల్ల ఈ రాజ్యానికి ఆదాయం వస్తుంది. అది రాకపోయినా ఓ ఏడాదిపాటు ఈ ప్రజలు జీవితం హాయిగా గడిచిపోవడానికి చాలినంత ధనం రాజుగారి ఖజానాలో ఉంటుంది.

సాధారణంగా 'టూరిస్టులు' విలాస యాత్రికులు విపరీతంగానే వస్తారు మొనాకోకు.

తన చిన్నతనంలో కూడా గ్రేస్‌కెల్లీ న్యూజెర్సీలో సంద్రతీరంలో ఆటలాడుకుంటూ వేసం కాలాలు గడిపింది కాని మొనాకో వచ్చిన తర్వాత అత్యంత ఆహ్లాదకరమైన సంద్రతీరం ఆమెకు దక్కింది. ఐరోపాకల్లా మంచి వేసంగి సెలవు ఐన మాంటే కార్లో తీరం ఆమె పాదాలముందే ఉన్నది.

ఈ తావున సిరిసంపదలు పేరుప్రఖ్యాతులు, అందచందాలు ఉన్నవారంతా విడిసి ఉంటారు. ఆడంబరమైన వజ్ర వైఢూర్యాది నగలు ధరించిన నెలతలు, డబ్బూ దాబూ ఉన్న పురుషులూ అక్కడ ఖరీదైన అందమైన రెస్టోరెంట్‌లోనూ, విశ్రాంతి భవనాల్లోనూ విలాసంగా గడుప వస్తారు.

'మాంటే కార్లో'' లో నైట్ క్లబ్‌లకు పెట్టింది పేరు.

''కేసినో'' (నాట్య మందిరం) లో నైతే అన్ని రకాల లాటరీలు, జూదాలు బ్రహ్మాండంగా జర్గుతూ ఉంటాయి. ఈ రకరకాల ప్రదర్శనలను, జూదాలను పర్యవేక్షించేటందుకు ఈకాసినోలో 600 మంది సుశిక్షితులైన నిర్వాహకులు ఉంటారు.

ఐతే ఈ జూద మందిరంలోనికి రాజ దంపతులు వెళ్లరు. అంచేతనే 'కేన్స్' కు సినీతారగా వచ్చినప్పుడు మాత్రం గ్రేస్‌దగ్గరలో ఉన్న కొన్ని మందిరాలను చూసిందిగాని మొనాకోసాంప్రదాయంప్రకారం ఏలికగానిఅతని సతి గాని ఈ వినోదశాలలోనికి అడుగు పెట్టరు. అంతేకాదు. 98 సంవత్సరాల నుంచి ఈ జూదశాలల్లోకి స్థానిక మొనాకో వాసులు ప్రవేశించరాదనే ఆంక్ష ఉన్నది. అదే తొలుత రాజు ఆచరిస్తాడు. 'యథారాజా తథా ప్రజా' అని కదా అన్నారు.

(ఇంకావుంది)






BANGALORE CITY

# బంగారు పంజరం

8 వ పేజీ తరువాయి

లేదు. కాఫీ తాగి, మాలి పిలిస్తే ఇలా వచ్చేశాను."

ఇద్దరూ సావిత్రమ్మ దగ్గరకెళ్ళారు. ఆమె మామూలుగా పలకరించింది. నిర్మల ఆశ్చర్యపోయింది. ముభావంగా తనతో సరిగా మాట్లాడకుండా ఉంటుం దనుకుంది, కానీ కొడుకు దగ్గరున్నాడని కాబోలు తనతో బాగా మాట్లాడుతోంది. నిర్మల ఏవేవో ఆలోచిస్తోంది. ఉగాది కొన్నాళ్ళేఉంది. ఆ విషయం ప్రస్తావనకు వచ్చింది.

ఎప్పుడూలేంది ఆవేళ నిర్మల మందులివ్వను మర్చిపోయింది. సావిత్రమ్మకు జ్ఞాపకంవచ్చి వంటింటి దగ్గరున్న బీరువా దగ్గరకు మందుకోసం వెళ్ళింది. మందుత్రాగి, ఆరుబయటికెళ్ళింది. సన్నజాజి పందిరి నీడలో మంచంమీద నిర్మల నిద్రపోతోంది.

సావిత్రమ్మకు కోపం జ్వాలలై మండుతోంది. ఇంటికి పెద్దకోడలు తొమ్మిది దాటిందో లేదో వెంటనే పడుకుంది. అంతగా అలసిపోయేటంత చాకిరీ ఏం చేస్తోందని?

"వెంకాయమ్మా! అబ్బాయి ఏడీ" అంది వంటా విడతో.

"భోంచేసి వెళ్ళిపోయారు. ఏదో పనుందట. వంట త్వరగా చేయమని కూడ చెప్పలేదు. అన్నం, పప్పుపులుసు, అప్పడాలు వడ్డించారు చిన్నమ్మాయి గారు."

సావిత్రమ్మకు కోపం తారాజువ్వలా లేచింది. తన కొడుకు అలాటి భోజనం చేయటం ఇదే మొదలు. రెండు కూరలు, చారు, పుల్లటి పచ్చడి, తియ్యటి పెరుగు, ఇన్ని లేందే సరిగా తిననివాడు ఇవ్వాళ ఉట్టికడుపుతో వెళ్ళిఉండాలి.

ఆమె చరచర మాలతి దగ్గరకెళ్ళింది.

మాలతి ముసుగుతన్ని పడుకునిఉంది. "మాలతీ" అంటూ ప్రక్కలో కూచుంది.

మాలతి ఊఁ అంది. అంతే.

"ఏం—అలా ఉన్నావు" అంటూ చెంపను నిమి రింది. వెచ్చగా చెంప తగిలింది. గాభరాగా గొంతు క్రింద చూచింది.

"జ్వరం తగిలిందే తల్లీ" అంది సావిత్రమ్మ బాధగా.

"ఔనమ్మా. మారేలే. అదే పోతుంది."

"నిర్మల వచ్చిందా ? డాక్టరుకు కబురు పెట్టలేదూ?"

"ఊహూ. ప్రొద్దుట బాగానే ఉంది. ఇప్పుడే పడుకున్నా."

"అయ్యో......ఇంకా కబురు చేయలా? మాలతీ! నిర్మలేంచేస్తోందో తెలుసా? నిద్రపోతోంది......నాకు మందీయలేదు; నిన్ను చూచుకోలేదు; అన్నయ్యకు సరిగా అన్నం పెట్టలేదు......అంతే తల్లీ, అసలు రంగు బయట పడ్తోంది. క్రొత్తచీపురు బాగా ఊడు స్తుందట. ఏడాదిలోనే ఇంత నిర్లక్ష్యం తల్లీ...... ఏం చేద్దాం......" సావిత్రమ్మ కన్నీరొత్తుకుంది.

"అలా ఎందుకనుకుంటావమ్మా. ఈరోజేగా వదినె మందీయలేదు. వెంటనే అంతలా బాధపడకు. నీకు బాగాలేదని తెలియదు. ఇందాకే నాకు మైసూరు పాకు ఇచ్చి వెళ్ళింది. నువ్వు మరీ కొంచెం తప్పయితే రాద్ధాంతం చేస్తావు......ఊరుకో."

"ఔన్లే. మీ వదిన్ను ఏమనను" అంటూ డాక్టరుకు కబురు పెట్టింది.

ఏ వాతావరణం వస్తుందని నిర్మల భయ పడిందో, ఆ వాతావరణం వచ్చేసింది. భయంతో ఆమె యాంత్రికంగా ఆ ఇంట్లో తిరుగుతోంది.

ఆవేళ మధ్యాహ్నం మాలతి పుస్తకం చదువుతూ పడుకునిఉంది. ఆమె ఎప్పటికిమల్లే ఉల్లాసంగాలేదు. ఆ పుస్తకం చదువుతూ కన్నీరు కారుస్తోంది. జ్వరం తగ్గింది గాని నీరసం పోలేదు.

రోజులాగే నిర్మల వచ్చింది. నిర్మల ముఖంలో అలసట, ఏదో బాధ ద్యోతకమౌతోంది. మాలతితో మాట్లాడాలన్న ఉత్సుకతతో ఆమె దగ్గర కొచ్చింది. మాలతి దుఃఖిస్తోందన్న భావం కల్గగానే నిర్మల తన అలసటను నెట్టిపారేసి, ఎంతో ఆత్రంగా వదినె ప్రక్కలో కూచుంది. నిర్మలను చూచి మామూలుగానే కన్నీరు తుడుచుకుంది.

"వదినా—ఏడుస్తున్నావేం?"

"నన్ను పేరుతోనే పిలవమన్నాను వదినా—అలా 'వదినా' అంటూ పిల్చావంటే మనిద్దరిమధ్యా ఏదో చనువు చొరబడలేని పొర క్రమ్మినలా ఉంటుంది. నాకు అలా నచ్చదు. వదినా, ఆడబిడ్డలమధ్యఉండే ఆ హద్దు ఉండకూడదని నా వాంఛ. స్నేహితుల్లా మసల లేమా?" అంది. ఆమె కంఠం ఇంకా బొంగురుగానే ఉంది.

నిర్మల తిరిగి అదే ప్రశ్నవేసింది. మాలతి తట పటాయించి, నెమ్మదిగా అంది: "ఈ పుస్తకంలో నాలాటి అమ్మాయిని గూర్చి వ్రాసుంది. తండ్రి, తల్లి గతించినతర్వాత, ఆ పిల్ల అగచాట్లు చెప్పలేను. ఎందుకో నాపరిస్థితిగుర్తొచ్చి దుఃఖంఆగిందికాదు."

నిర్మల కొంతసేపు మౌనంగానేఉంది. తర్వాత అంది, "ఈ పుస్తకం నేను చదువలేదుగానీ, నీ స్థితి కూడ అలాగౌతుందని ఎందుకనుకోవాలి? అందరం సలక్షణంగా ఉన్నాము. ఇక కొన్నాళ్ళ తర్వాత సంగతిని గూర్చి చింతిస్తున్నావేమో. నీకు ఆర్థికంగా గానీ, ఇతర వ్యక్తులవల్లగాని, ఏ విధమైన కష్టం వాటిల్ల దని దృఢంగా చెప్పగలను. అన్నింటికి ప్రధానం డబ్బు కదా? నీ జీవనోపాధికి తగినంతకంటే ఎక్కు వగా ఉంది. నీకు సుఖశాంతులు సర్వదా లభిస్తాం టాయి. నీ వలా వృథాగా దిగులుపడకు" అంది ఓదార్చుతున్నట్లు.

మాలతి కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరుగుతున్నాయి. హృదయం ద్రవించిపోయేలా వెక్కి వెక్కి ఏడ్చింది. నిర్మల, మాలతి భుజం తడుతూ, ఓదారుస్తోంది. కొన్ని క్షణాలు గడిచినై. ఆమె హృదయం కొంత వరకు తేలిక పడింది. నిర్మలను చూస్తూ అంది: "నా బాధ అంతవరకేకాదు వదినా—భగవంతుడు నన్నిలా కుంటిదానిగా చేయటంతో నా జీవితమంతా అంధకార మయమైంది. నావల్ల ఎవరి కేవిధంగాను సంతోషం లేదు. నన్ను చూస్తుంటే అందరూ దిగులుపడ్తారు. చూస్తున్నావుగా—అమ్మ ఎంతగా కుమిలిపోతోందో. ఏ పాపం చేశానోగానీ...." మాలతి దుఃఖాన్ని ఆపుకో లేక, మళ్ళీ ఏడుస్తోంది.

"నాకంతా అర్థమైంది మాలతీ. కాని పొరబడు

## బంగారు పంజరం

తున్నావు. భగవంతుడు నిన్ను మా ఇంట్లో పుట్టించి ఉంటే నిజంగా నీ వెంతో హృదయావేదనతో జీవితాన్ని గడిపేదానివి. పేద ఇంట్లో పుట్టక, ఈ గొప్పింట బిడ్డవై పుట్టినందుకు భగవంతుని కెంతో అచ్చి ఉన్నావు. తగిన విద్య ఉంది—సేవచేయటానికి మేమున్నాము. నిన్ను తన ప్రాణసమానంగా చూచుకునే అన్నయ్యున్నారు. ఇక నా విషయంలో నీ వెటువంటి అభిప్రాయాని కొచ్చావో నాకు మాత్రం తెలీదుగానీ, నీవంటే నా కేవిధమైన కోపంగానీ, విసుగుకానీ లేదు. ఇంకా చెప్పనా, నీవంటే నాకెంతో ఇష్టం!"

"నా కా విషయం తెలుసు—నీ వలాటి దానవనే నా సుఖంకోసం రుక్మిణి—పిన్ని నిన్ను కోడలిగా చేసుకోమని, అమ్మని, నాన్నని బలవంతం చేసినప్పుడు ఎవ్వరూ కాదనలేకపోయారు. కానీ, వదినా, నా జీవితంలో ఒక్క కాంతిరేఖలేదు. నా హృదయం ఎందుకో కుమిలిపోతోంది." నిర్మల ఏడుస్తున్న మాలతివేపు జాలిగా చూచింది. ప్రక్కనున్న క్రచ్చస్, సన్నగాఉన్న కాలు ఆమె హృదయాన్ని కృంగ దీసినై. "మాలతీ! అలా కుమిలిపోతే లాభమేముంది చెప్పు. అత్తయ్య, మామయ్య, మీ అన్నయ్య ఈవిధంగా ఏడుస్తోన్న నిన్ను చూస్తే ఎంతగా దుఃఖిస్తారో ఆలోచించు—అయినా నీ హృదయంలో ఇలాంటి వాటికి తావు కల్పించకు. నేను చెప్పకూడదుగానీ, చెబుతున్నా. మనకి అందుబాటులోలేని ఉన్నత శిఖరాలను గురించి పగటి కలలు కని, కాలం వృధా పర్చుతూ, మనఃక్షోభతో కుమిలిపోతూ, అసంతృప్తితో బాధపడుతుంటే ఎలా చెప్పు? మంచి తెలివిగలదానివి. మంచి సాహిత్యానుభవాన్ని సంపాదించుకున్నదానివి. నిత్య సత్యాలను విస్మరిస్తే, సామాన్య మానవునికి, నీకు భేదమేముంది? ఈ అసంతృప్తిని రేపే ఈ ఊహలకి, నీ ఊహాపథంలో చోటివ్వకుండా ఆపుచేయగల్గిన మనోనిబ్బరాన్ని సంపాదించుకో!"

మాలతి గుడ్లప్పగించి వింటోంది. నిర్మల మాటల్లోని సత్యాన్నామె గ్రహించలేకపోలేదు. కానీ, స్వతహాగాఉన్న, 'నిరాశ'వల్ల నిర్మల మాటల్ని సాధారణ దృష్టితో చూడలేకపోయింది. మనసులోని వివేకం పని చెయ్యలేదు. స్నేహితురాలి మాటలనైనా గౌరవించలేకపోయింది. ఆమె హృదయాలోచన లువ్వెత్తున లేస్తున్నాయి.

కొంత సేపటి కామె అంది. "ఔనొదినా.... అనుభవిస్తేగాని తెలియదు......ఆ గుండె నిబ్బరమే లేకపోతే ఈపాటికేమయ్యేదాన్నో."

నిర్మల చటుక్కున మాలతి కళ్ళలోకి చూచింది. తను అనలెక్కువగా మాట్లాడదు. ఈసారి మాట్లాడింది. అది కూడ మాలతిపై ఉండే అనురాగం కొద్దీ మాట్లాడింది. కానీ, సరైన సమయంలో మాట్లాడలేదు. ఇంతటి వివేకవతి తన్నపార్థం చేసుకుందా? "మా అన్నయ్యతో, సకల భోగాలనుభవించే నీవు నా బాధ నర్థం చేసుకుని చెబుతున్న సంగతులేనా? నీ కర్థంకాదు. నాలోని దావానలం మీ కే హాని చేయదు. మీరు నిశ్చింతగా ఉండండి.....నీవు నా బాధ

నిర్ధారణ చేసుకోలేవు......నీకు తెలియదు.........నీవు......"

నిర్మల "ఒద్దు మాలతీ" అంటూ, రెండు చేతులతో ముఖం గట్టిగా కప్పుకుంది. ఉన్నట్లుండి సోఫామీద కొరిగిపోయింది.

ఇలా జరుగుతుందని కలలోనైన అనుకోని మాలతి 'వదినా, వదినా' అంటూ పిల్చింది. ఆమె కర్థమైంది. నిర్మల స్పృహతప్పిపడిఉంది. ముఖంమీద నీళ్ళు జల్లి కాలింగ్‌బెల్ స్విచ్ మూడుసార్లు నొక్కింది. కొంతసేపటికి వంటావిడ,పనిపిల్ల పరుగెత్తుకొచ్చారు. ఆమె చేతులాడటంలేదు. "ఒద్దు మాలతీ" అంటూ అరచింది. తను మాట్లాడందే–అలా కొయ్యబొమ్మలా తనవేపు చూస్తూ, కొన్ని క్షణాల కిలా అరచి పడి పోయింది. ఎందుకో, ఏదేదో ఊహించుకుంటూ అరచింది కాబోలు,

వదిన తేరుకోవటం చూస్తూ, మాలతిగ్లాసుతో నీళ్ళు పట్టుకుని ప్రక్కలో కూచుంది. వనావిడ వెంకాయమ్మ విసురుతూ కూచుంది. డాక్టరుగార్ని పిలుచుకునిరామ్మని పనిపిల్ల దౌడుతీసింది.

మాలతి హృదయం దడ దడ కొట్టుకుంటోంది. తనా మాట లెందుకనాలి—ఆ క్షణంలో తనలోంచి అంత కఠినమైన మాట లెలా వచ్చాయి. ఆత్మ పరిశీలన చేసుకుంటూ కన్నీరు కారుస్తోంది.

నిర్మల తేరుకొంది. మాలతినోట్లో నీళ్ళ పోస్తుంటే నెమ్మదిగా త్రాగుతోంది......

వెంకాయమ్మ అంటోంది, "ఏమోనమ్మా—సరిగ్గా భోంచెయ్యలేదు. ఏదో నుస్తీగా ఉందంటూ ఎంగిలి పడినట్టేపడిలేచిపోయారు. బాబుగారు కూడా కంగారువడ్డారు. జ్వరంలేదని తెలిశాకనే కాలేజికి వెళ్ళారు. తలనొప్పిగాఉందంటూ, మీ దగ్గ రుంటానని ఏదైన పనిబడ్తే మీ గదిలోకి రమ్మని ఇలా వచ్చారు. ఇంతలోకి......" వెంకాయమ్మ ముఖంలో తళుక్కున మెరుపు మెరసినట్లు ఆలోచన తట్టింది. ముఖం చేటంత చేసుకుని అంది. "అయ్యో పిచ్చివాణ్ని...... మరేం ఫరవాలేదులెండి......బాగుం టుంది కాసేపటికి. భోంచెయ్యలేదంటూ ధ్యాసంతా దానిమీదేఉండిపోయిందిగాని, అసలు సంగతే మనసు కొచ్చిందిగాదు" అంటూ, నిర్మల అరచేతులను నెమ్మదిగా రాస్తోంది. "ఏమిటది" అంది మాలతి.

ఆమె నవ్వి ఊరుకుంది. కాఫీ పట్టుకురమ్మని ఆమెతో చెప్పి మాలతి వదిన ముఖాన్ని కౌగిలో కుదుస్తూ అంది, "వదినా నన్ను క్షమించవూ. ఏదో ఉద్రేకంలో ఆనుకోలేక ఏమో అనేశాను. నీ హృదయా న్నెంత నొప్పించానో, ఆ క్షణంలో వివేకం నశించింది......పిచ్చిగా అన్నాను." మాలతి వేడికన్నీరు నిర్మల చెక్కిలిపై బడింది. విశాల నయనా లను భారంగా మాలతివైపుకెత్తి చూచింది. ఆమె కళ్ళు కూడ అశ్రుపూరితాలైనై. "వదినచేత కన్నీళ్ళు పెట్టిస్తున్నా" అనుకుంటూ మాలతి ప్రేమగా తుడిచింది. నిర్మల మాట్లాడలేదు. కళ్ళు మూసు కుని మాలతి చేతిని గట్టిగా పట్టుకుంది.

డాక్టరు వచ్చింది. మాలతిని, నిర్మలను రెండు మూడు ప్రశ్న లేసింది. చిరుగా నవ్వుతూ అంది. "బాగా రెస్టు తీసుకో నిర్మలా. అన్నట్లు చిన్నవా ఉన్నప్పుడే చిలిపిపనులు జేస్తూ, ఇంటిల్లిపాదినీ హడలు గొట్టేస్తున్నాడే."మాలతి విస్తుపోయి చూస్తోంది. నిర్మల సిగ్గుతో కళ్ళుమూసుకుంది. కబురు విన్న సావిత్రమ్మ పట్టరాని సంతోషంతో గబగబ వచ్చింది. నిర్మలపై ఈ నాల్గురోజులనించిఉన్న కోపం ఎగిరి పోయింది.

అందరి హృదయాలు ఆనందంతో వెల్లి విరి శాయి. సావిత్రమ్మకంతా అర్థమౌతోంది. పాపం పిచ్చిపిల్ల ఎంతగా బాధపడిందో. తనంతగా తొందర పడిఉండకూడదు. ఏదో ముగతగా ఉండబట్టి తన పనులు మర్చిపోయింది. ఈ నాల్గురోజుల్ల తనెంత కోపంగా మాట్లాడింది నిర్మలతో! పోనీ చెప్పి ఉండకూడదూ... సిగ్గుపడిందేమోలే. కోడల్ని ప్రక్కలో కూర్చుని ప్రేమగా పల్కరించింది సావిత్రమ్మ.

కబురు విన్న ప్రసాదరావు రెక్కలు కట్టుకుని వాలాడు. ఉగాదికని కూతురిని, అల్లుడిని పిల్చు కుని వెళ్ళాడు.

కమ్మలమ్మ సంతోషం చెప్పనలవికాదు. తన చిన్ననాటి ఇల్లు మళ్ళీ చూసు ంటే నిర్మల హృదయం సంతోషంతో నిండిపోయింది. రెండు రోజుల్లో వసంత, ఆమె భర్త కూడ వచ్చారు.

ఇంటినిండా సందడి. ప్రకాష్ నిరాడంబరత్వాన్ని చూచి, అందరు మెచ్చుకున్నారు. నిర్మల ఎన్ని సేర్ల బంగారం వేసుకుందోనని, ఇంట్లో ఎంత ఖరీదు గల చీరలు కడ్తుందో చూడాలని అమ్మలక్కలు ఉబలాటపడ్డారు. కానీ, నిర్మల మామూలుగా ఉంది. తన సంపదను ఇతరులు చూడాలని ఆమె ఆశకాదు. ముఖ్యంగా తనవాళ్ళను గూర్చిన చింత. పెళ్ళి కావలసిన చెల్లెంద్రు తన సిరిసంపదలనుచూస్తే అలాటి గొప్పింటి కోడళ్ళయితే బాగుంటుందని పగటి కలలు కంటారు. తల్లిదండ్రులు పెద్ద ఖరీదుగల చీరను తన కివ్వవలసి వస్తుంది. వసంత బాధపడదూ? దానికి కూడ ఇవ్వాలి. కొన్ని నగలు మాత్రమే తెచ్చు కుందికానీ పెట్టుకోలేదు. తిరిగి హైద్రాబాద్ చేరాకే నాటి ముఖం చూస్తుంది. తల్లిదండ్రుల తృప్తికోసం ఒకరోజు వారికి మాత్రం చూపింది.

అత్తవారింట్లో ఎంత భోగభాగ్యాలున్నా, పుట్టిం ట్లో లభించే శాంతి, సౌఖ్యా లక్కడ ఉండవు. నిర్మల బంగారు పంజరంలోంచి బయటికొచ్చిన చిలుకలా ఖావిస్తోంది. ఆమె హృదయం హాయిగా, తేలికగా ఉంది.

వసంత కూడ తల్లి కాబోతోందని తెలిశాక, నిర్మల తృప్తిపడింది.

ఆవేళ రాత్రి అందరు పిల్లలు పడుకున్నాక, పెద్దవాళ్ళు మంచాలమీద కూచుని మాట్లాడు కుంటున్నారు. చర్చనీయాంశము వచ్చి, కుసుమల పెళ్ళి విషయం.

ప్రసాద్‌గారు చెప్పుకుపోతున్నారు. "ఇద్దరిదీ రాజమండ్రే. ఒకబ్బాయికి ఫ్యాక్టరీలో పని. మాట ఏభై చిల్లరొస్తుందట. మంచివాడనే అనుకుం టున్నారంతా....ఇప్పటివరకు. ఇద్దరన్నలు, ఒక విధవ చెల్లి, తల్లి, తండ్రి—అంతా ఉమ్మడిగానే ఉంట న్నారు. స్వంత ఇల్లుంది. అంటే, అద్దెఖర్చు లేదను మాట. ఏడాదికి సరిపడే ధాన్యం వస్తుంది.....కానీ ప్రకాష్ అడ్డు తగిలాడు. "అదేమిటండి ..... కానీ"

అంటున్నారు. ఇంతవరకూ అబ్బాయినిగూర్చి గుడ్ రిపోర్ట్స్ ఇచ్చారుగా"

"అబ్బాయినిగూర్చి బాగానేఉంది రిపోర్ట్. కానీ, తల్లి ఉంది చూశావూ? ఆవిడ మహంకాళి, చండ శాసనురాలని చెబుతున్నారు. ఇద్దరు కోడళ్లు పడ రాని బాధలు పడ్తున్నారట......"

"చూస్తూ, చూస్తూ అలాంటి ఇంట్లో......" నిర్మల అంటుంటే ప్రకాష్ ఆమెని వారిస్తూ అన్నాడు. "అలాంటిఇంట్లోపడి అందర్నీ పడతోయాలి. అంటే ముగ్గుర్ని వేరు పొమ్మంటే......దాంతో తని విర గడై పోతుందిగా?"

"కాను నాయనా! అలా అనుకున్నాను. కానీ, అది సామాన్యమైన పనిగాదు. భూమి ముసలాయన స్వార్జితం. ఇష్టంలేకపోతే సూది మొనంత భూమి కూడ ఇవ్వడు. అందుకే అందరూ తల్లిదండ్రులను అంటిపెట్టుకున్నారు."

"వీరితో కలిసుండి కష్టాలనుభవించేకన్నా వేరుగా ఉండటంకదా మనక్కావలసింది?" వసంత అంది.

"కానమ్మా. మన పిల్ల కాపురం వేరుగా ఉండా లని మనకుంటుంది. కానీ, అది జరిగే పనిగాదు. వాళ్ళకేమో వాళ్ళబ్బాయి తమతో ఉండాలనే ఉం టుంది. అందుకే ఈ సంబంధాన్ని ఒదులుకోవ టమా, లేక ఏదైన మార్గాన్వేషణచేసి పెళ్ళి జేయు టమా? ఇదే గడ్డు సమస్య—వీలైతే పరిష్కరిం చండి."

"ఇలా వదులుకుంటే మనకు సరిపడే స్తోమతులు గలవారు ఎవరు దొరుకుతారండి? ఏదో ఒకటిచేసి పెళ్ళిజేయాలి గాని" కమలమ్మ తన బాధను వెల్ల డించింది.

"కాను, మీలాటివారు పిల్లలకు పెళ్ళి చేయాలి. అనే ఆలోచనతోనే ఉంటారుగాని, ఆ పెళ్ళివలన జరిగే అనర్థాలను, క్లిష్టపరిస్థితులను, కష్ట నష్టాల నసలే ఆలోచించరు. పిల్ల సుఖపడక కోడరికం దుర్భర

# బంగారు పంజరం

మైతే, నెత్తీ, నోరూ బాదుకుని మొత్తుకుంటారు. అలాంటి పెళ్ళి జరిగేకంటే, పెళ్ళి చేయకుండా ఉంచటమే నయం." ప్రకాష్ గబగబ అనేశాడు.

అంతవరకు మౌనం వహించిన వసంత భర్త "నిజమే—అన్నగారి మాట అక్షరాలా నిజం. ఈ సంబంధం వదలుకోవటమే మంచిది."

"మీ రిద్దరు బాగానే చెబుతున్నారుగానీ, ఆచర ణలో పెట్టవలసివస్తే బాధపడేది మేమేను. పెళ్ళి చేయకపోతే దాని గతేంకాను? ఎవరు చూసుకుంటారు? వేరే సంబంధం కోసం చూడాలంటే ఎన్ని చెప్పుల జత తిరుగుతాయో—ఆలోచిస్తుంటే ఎంతో భయంగా ఉంటుంది." ప్రసాదరావుగారు నిస్పృహతో అన్నారు. కొన్ని క్షణాలు మౌనంగా గడిచినై. ప్రకాష్‌కు చటు క్కున ఏదో స్ఫురించింది. చిటికవేసి, ఉల్లాసంగా చెబుతున్నాడు.

"మనవాళ్ళిద్దరిలో గయ్యాళి మరద లెవరు నిర్మలా?"

"ఎందుకూ?......నళిని గట్టిపిల్ల...... గయ్యాళి అనొచ్చు"

"ఇంకేం. ఈ సంబంధం నళినికి నిశ్చయం చేయండి. తన నోటి దురుసుతనంతో అత్తని బుట్టలో వేసుకుంటుంది. మనకు తెలీదూ? గయ్యాళి అత్తలు, గయ్యాళి కోడళ్లకు లొంగు తారు. అలా జరక్కపోతే మనం, ఆ ఇద్దరి కోడండ్ర తల్లిదండ్రులు, ముగ్గురన్నదమ్ములు వేరుబోయేలా ప్రయత్నించాలి. ఒకరుగాదు. ముగ్గురు వియ్యం కులు మీదికొస్తే ఏంజేస్తారు? అప్పటంతా అనుభ వించాక చూస్తూ, చూస్తూ వేరే వాళ్ళకు ప్రాయ లేరుగా?"

"ఇంతా ఎందుకండీ? అసలా అబ్బాయికి వేరే ఊళ్లో పని చూస్తే?" అందరూ నిర్మలవైపు

[illegible] చూశారు. "నిజమే గాని, మంచి దొరకటం సులభంకాదు. ప్రయత్నం చేద్దాము." ప్రకాష్ నిర్మలవైపు చూస్తూ అన్నాడు.

"ఇలాంటి అత్తలనుగూర్చి సంఘం ఏమీ పట్టిం చుకోదు. బోలెడన్ని సాంఘిక సంక్షేమ అధికార్లు సిబ్బంది ఉన్నారు. ఎందుకుట? అకారణంగా కోడ ళ్ళను బాధించేవారిని, అత్తలను బాధించేవారిని ఎలాగో శిక్షించాలి" వసంత—భర్తమాటలకు అందరూ నవ్వుతూ, నిజమంటే నిజమన్నారు.

"మీరింకో సంబంధం విషయం చెప్పండి" కమ లమ్మ భర్తకు జ్ఞాపకం చేసింది.

"ఆ అబ్బాయి ప్రస్తుతం ఫోర్‌మెన్‌గా నాగా ర్జునసాగర్ దగ్గర పనిచేస్తున్నాడు. తల్లి, తండ్రి ఒక అన్నయ్య, ఇద్దరు చెల్లెండ్రున్నారు. కుటుంబ మంతా రాజమండ్రిలోనే ఉంటుంది. పెద్ద కొడుకు హైస్కూలు మేష్టరు. ఆడపిల్లలు కాపురాలు చేస్తున్నారు......"

"అబ్బాయిని గూర్చిన రిపోర్ట్?" ప్రకాష్ ప్రశ్నించాడు.

"బాగానేఉంది నాయనా! తెలివిగలవాడు బుద్ధి మంతుడట. తెలిసినవాళ్ళు చెప్పారు. పెద్ద కొడుకు భార్య పురిటిలో పోయిందట. ఒక కొడుకున్నాడు. చాల మంచి కుటుంబమని చెప్పారు."

"ఇంకేం. శుభస్య శీఘ్రం అన్నారు. కానివ్వండి ఈ నెలలోనే." ప్రకాష్ ఆవులిస్తూ చిటికె వేశాడు.

"అయితే నళిని వరుడికి వేరేపని చూచే ప్రయ త్నం మనం ముగ్గురం చేయాలి. మీ సాయం నా కెంతైనా అవసరం" ప్రసాదరావుగారు అంటే మిగతా ఇద్దరు సరే అన్నారు.

ఆ రాత్రి ప్రసాదరావుగారు నలుగురాడపిల్లలకు పెళ్ళి చేసేసి నిశ్చింతగా ఉన్నట్లు కలగన్నారు కూడా!

(సశేషం)





# కొత్తనుడికట్టు-9

## అడ్డం

1. పొట.
3. ఇంటిలోని ఆకుపు ఏవరు?
6. రాత్రికి మారుపేరు.
8. జంట.
9. డొక్కకి తగిలించేది.
11. ఇరవై అయిదు.
13. ఉద్యానము.
14. శిరుషానికి చిహ్నమా?
16. ఏకలి చిందర వందరయితే రాజు వస్తాడు?
19. దట్టము.
20. క్రమము.
21. అపాయము.
22. పక్షులకు ఉండేవి ఏమిటి?

## నిలువు

2. పాపాలు చేస్తే పంపించే చోటు.
4. ఇతర అధికారి గౌరవమా?
5. స్త్రీ.
7. ఎన్క్రుమా దేశం.
10. తల క్రిందులుగా పాలమీద తరకలుగా వస్తుంది!
11. పూరి—.
12. జరీ.
13. నీరు పారే దారి, తూకము తగ్గించి చూడండి.
15. ఇది వినపముకొరకే అంటారు!
16. వ్యవసాయదారుల పూజలలో ముఖ్యమయినది.
17. ముందూకము.
18. స్త్రీ, ఆవు, గంగ, తులసి, భూమి!!

★

## 8-వ కొత్త నుడికట్టుకు జవాబులు.

### అడ్డం :

1. వేదిక, 3. మోహారము 5. రయము, 6. తనయ, 7. ఎముక 9. ఆది, 11. మాసికము, 13. మెలకువ, 14. రవ్వ, 15. కచట 17. శేనాడు, 19. ఆవల, 21. పొరపాటు, 22. పుత్తడి.

### నిలువు :

1. వేమన. 2. కర, 3. మోము, 4. రత్నము, 6. తలమానిక, 8. కలువరేడు, 10. ఆమె, 12. ముర, 16. చక్కెర, 18. నానుడి, 19. ఆటు, 20. పుల.

# న్యూఢిల్లీ లేఖ

7-వ పేజీ తరువాయి

రెవరో ఊహని చేయాల్సి ఉంటుంది మరి!

మధుర నుంచి మద్రాసుకు విమానంలోనే వెళ్లాను. నేను యిటీవల కొంతకాలంపాటు యిరోపా, అమెరికాలలో తిరిగి వచ్చాను గనుక జాతీయ అంతర్జాతీయ వైమానిక సౌకర్యాలు ఎలా ఉంటాయో తెలుసుకోగలిగాను. నా అనుభవంవల్ల తేలిందేమంటే భారత అంతర్జాతీయ విమాన సంస్థ 'చాలా గొప్ప'దని.

ఏథెన్సు నుండి ఇస్తాంబుల్‌కు విమానంలో వచ్చేందుకు 45 నిమిషాలు పట్టింది. అప్పుడు ఈ రెండు నగరాల మధ్య ఓలిమ్పియా అనే గ్రీక్ విమానంలో ప్రయాణం చేశాను. ఈ నలభై అయిదు నిమిషాల కాలంలో మాకు పానీయాలు, మంచి ఆహారం, పండ్లు, ఫలహారాలు ఇచ్చారు. ఇక మన విమానాలో — విమానంలో ఈగలు ఎక్కువ, బాత్‌రూమ్‌లు మురికి కూపాలు, ఆహారమా— నోట్లో పెట్టుకో బుద్ధికాదు.

ఢిల్లీ నుంచి విమానం మద్రాసుకు ఉదయం ఆరు గంటలకు బయల్దేరుతుంది. అల్పాహారం ఇచ్చారు. ఆ సరఫరా తీరుచూస్తే తగినన్ని పళ్లాలు కూడా లేవేమో అనిపించింది. నా చోటు కాక్‌పిట్ దగ్గరుందేమో. 6 గంటలకు ప్రారంభమైన ఆహారపంపిణీలో నా వంతు వచ్చేసరికి తొమ్మిది అయింది. అల్పాహారం క్రింద ఓ మాంసం ముక్క ఇంకేదో యిచ్చారు.

ఢిల్లీకి తిరుగు ప్రయాణంలో కిటికీ ప్రక్కన సీటు ఇవ్వమని అడిగాను. మద్రాసు విమానాశ్రయంలో కూడా అదే మళ్లీ మళ్లీ కోరాను. కౌంటరు దగ్గర కూచున్న ఓ పురానావారు, "మీరు ఆలస్యంగా వచ్చినందున అలా కిటికీ ప్రక్క సీటు దొరక" దని మొహమాటం లేకుండా చెప్పేశారు. ఇంక విమానంలోకి వెళ్లి చూశా. ఎవరికీ కేటాయించని సీట్లు ఎంత లేదన్నా మూడన్నా ఉంటాయి. అందులో ఒకటి ఢిల్లీదాకా ఖాళీగానే ఉంది!

ఇది నాకు చాలా బాధ కలిగించింది. తూర్పు, పశ్చిమ భారత్‌లతో పోలిస్తే దక్షిణ భారతంలో జరుగుతున్న పారిశ్రామికాభివృద్ధి చాలా స్వల్పం. పోనీ విలాస యాత్రల విషయంలో దక్షిణ భారతాన్ని ఎంతవరకు గుర్తిస్తున్నారనేది చూద్దాం. మద్రాసులో విలాస యాత్రలకు ఉన్న హోటళ్లు అంత ఉత్తమమైనవి కావు. మధురలో అసలు అలాంటి హోటలేలేదు! రైలు ప్రయాణాలు అసౌకర్య భూయిష్టాలు, తిండి తలచటానికి వీల్లేదు. ఢిల్లీ బొంబాయిల మధ్య బోయింగ్ విమానాలు ప్రవేశపెట్టారు. దక్షిణ భారతాన్ని కలిపే విమానాలు మాత్రం యథాతథంగా ఉన్నాయి.

కావాల్సినసౌకర్యాలు రావాలంటే దక్షిణ భారతంకు "ప్రాధేయతా మాత్రంతో" లాభంలేదు. కాస్త నిరంకుశంగా ఉండాలి. ★

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Street Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

